# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును.






జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

## కృతజ్ఞాభివందనములతో

మా అభిమాన నటి బ్యూటీక్వీన్ జయప్రద ముఖచిత్రం వేసి నేటికి ఈ నూతన సంవత్సరంలో ఆరు వారాలు గడిచిపోయాయి. కాని రోజుకి ఒక్క సారైన ఆ సంచిక చూడకపోతే మాకు ఏమి సహించదు.

త్రివేణి, స్వప్నసుధ, కాచిగూడ.

● ● ●

నటి జయసుధ ముఖచిత్రం అందంగా వుంది. సీరియల్ రాగసంధ్య చాలా బాగుంది. రచయిత్రి–కాశీనాధుని సువర్చలాదేవిగార్కి అభివందనములు;

మీసాల అప్పారావు, ఆముదాలవలస.

## కనులకు మనసుకు విందు

ముఖచిత్రం కనులకు విందు చేయగా, కథలు, సీరియల్స్ మనసుకు విందును చేశాయి.

కుమార్, గంటా ఉమాశంకర్‌రెడ్డి, బరంపురం.

## "సీరియల్స్"

"సీరియల్ మౌనవిపంచి" నాకు చాలా నచ్చినది. "కాగితపు పడవలు" చాలా ఆసక్తికరంగా సాగుతున్నది.

అమిరినేని హరికిషన్, వేమూరు.

## న్యూఢిల్లీ లేఖ

నటి జయసుధ ముఖచిత్రంగల 1–2–85 సంచికలో డా. జయదుబాషీగారి "భారతదేశానికి ఏది మంచిది? "న్యూఢిల్లీ లేఖ వ్యాసం, చాలా బాగున్నది.

డి. రాజయ్య, డోర్నకల్.

● ● ●

కలుషితమైన "ఎన్నికలు" గూర్చి, జయదుబాషీగారు "పేకబెత్తం"తో "మహా" నాజూగ్గా ఏకేసారు. ఆయనకి, నా అభినందనలు.

పెన్మత్స సూరిబాబు, హైదరాబాదు

## ఆక్షేపణలేదు

మనదేశాన్ని "హిందూదేశం" అనవలెనని డా. జయదుబాషీగారి సూచనను తీవ్రంగా నిరసిస్తూ నాగులపాడు నుండి జె. నాగేశ్వరరావు, ఎ. వసంతలక్ష్మిగార్ల లేఖను 18-1-85 తేదీ సంచికలో చదివాను.

మన దేశము హిందూదేశమే. మనదేశములో అనాదిగా ఉన్నది గనుకనే మనమతాన్ని "హిందూ" మతము అంటున్నాము. వేదయుగములో హిందూ నామము మన మతానికిలేదు. వేదములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, శ్రుతులు, స్మృతులు, భారత రామాయణాది ఇతిహాసములు, పురాణములు, భగవద్గీత, వాటిల్లో ఎక్కడా, మనమతాన్ని "హిందూ" మతమని వాడినట్లు కనబడదు. మనది ఆర్యమతము, మనదివేదమతము. హిందూదేశములోని మతము




గనుకనే మనది హిందూమతము, హిందూదేశములోని వారము గనుకనే మనము హిందువులము. హిందూదేశములో నివారి భాషయే హిందూస్థానీ, అదియే హిందీ. హిందూదేశమును ఆనుకుని ఉన్నది గనుకనే దక్షిణ సముద్రాన్ని హిందూ మహాసముద్రము అంటున్నాము. ఉత్తరమున హిందూదేశాన్ని ఆనుకుని ఉన్న పర్వతశ్రేణి "హిందూ కుష్" (రాయలసీమలో హిందూపూర్ ఉన్నది) ఇవి మతపరమైనవికావు.

"హిందూ" పదము "సింధు" శబ్ద సంబంధమైనది. గ్రీసుదేశీయులు మనదేశం వచ్చినప్పుడు "సింధూ" నదీ ప్రాంతంలో కొంతకాలం ఉన్నారు. "సింధునది"ని వారు "ఇండస్" అన్నారు. గ్రీకు రాయబారి మెగస్తనీసు మనదేశాన్ని గురించి వ్రాసిన గ్రంథము "ఇండికా" కాలక్రమమున పశ్చిమ దేశీయులు మనదేశాన్ని ఇండియా అనడం ప్రారంభించారు.

మనము హిందువులమనీ, మనదేశం హిందూదేశమనీ, మన మతము హిందూమతమనీ, చెప్పుకోటానికికూడా సిగ్గుపడే దౌర్భాగ్యస్థితికి మనము దిగజారినాము. ఇందుకు ముఖ్యకారకులు కీ. శే. జవహర్‌లాల్‌నెహ్రూ, ఆయన కుమార్తె ఇందిరాగాంధీ అని చెప్పకతప్పదు.

డా. జయదుబాషిగారి విమర్శలు చాలా సహేతుకంగానూ, ఆలోచనాపూరితంగానూ ఉంటాయి.

"ఇండియా దట్‌ఈజ్ భారత్" అని మన రాజ్యాంగంలో నిర్వచించటానికి పూర్వం, (1947కి పూర్వం) మనదేశాన్ని ఎల్లరూ "హిందూస్థాన్" లేక "హిందూదేశము" అనేవారు. మన మతము "హిందూమతము" అనీ, మనజాతి "హిందూజాతి" అనీ, మనదేశం "హిందూదేశము" అనీ అనటంలో ఏ విధమైన ఆక్షేపణకు తావులేదు.

పిల్లలమర్రి వెంకటరామయ్య, రాజమండ్రి

## కళ్ళకు కట్టినట్లుంది

"సిద్ధపురుషుడు బాలయోగి" వ్యాసం చాలా బాగుంది. వారు దర్శనమిచ్చే విధానాన్ని కొప్పెన్ షేక్ మౌలాలీ గారు కళ్ళకు కట్టినట్లుగా వర్ణించినారు. తపస్సును గురించి, అమృత సిద్ధిని గురించి చక్కగా వివరించినారు. ఇటువంటి వ్యాసములను ముందు ముందు కూడా ప్రచురించగలరని ఆశిస్తూ-

ఎ. ఎన్. ప్రసాద్, అనంతపూర్ □



## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938 - 1972)

శుక్రవారం : 22-28 మార్చి, '85

శ్రీ క్రోధన నామ సం. చైత్ర శు. పాడ్యమి

సంపుటము 78 : సంచిక 29

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడిప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్ట్‌లో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి 'ఊర్వశి'

(ఫోటో: పి. రవిచందర్)

# నల్లడబ్బుని పెంచుతున్న ప్రభుత్వరంగం

రాజీవ్‌గాంధీ జాగ్రత్తపడక పోతే నిష్కల్మషంగా కనిపించాలన్న ఉద్దేశంతో ఆయన తీసుకుంటున్న క్షాళన చర్యలే ఆయనని కష్టాలలో పడేస్తాయి. నల్లడబ్బుని నిర్మూలించడానికి ఆయన పడుతున్న వృథా ప్రయాస నవ్వు తెప్పిస్తున్నది దానితో ఆయన పార్టీకే ఎక్కువగా సంబంధం ఉన్నది. ఆ విషయం ఆయనకి తెలిసే ఉంటుంది లేకపోతే తెలుసుకోవాల్సి ఉంటుంది కాంగ్రెసు పార్టీ కార్యక్రమాలలో రాజకీయాలనేవి చాలా కొద్ది భాగం మాత్రమే ఆ పార్టీ, లేదా చాలామంది కాంగ్రెసువారు చేసే అసలైన వ్యాపారం డబ్బు చేసుకోడమే. లేదా ఇతరులు డబ్బు చేసుకోడానికి సహాయం చేసి తద్వారా ప్రయోజనం పొందడం కాంగ్రెసు పార్టీని, దాని వ్యావృత్తిని అరికడితే నల్ల డబ్బు ప్రవాహం ఒక్కసారిగా చాలంత అదే ఇంకిపోతుంది. మన ఆర్థిక వ్యవస్థలో నించి నల్లడబ్బుని ఏరివేయాలంటే మొట్ట మొదట కాంగ్రెసుని క్షాళన చెయ్యాలి. కానీ రాజీవ్‌గాంధీగాని మరొకరుగాని ఆ పని చెయ్యగలరని ఎవరూ అనుకోవడంలేదు. అలా చెయ్యడంవల్ల రాజకీయంగా ఆత్మహత్యకి పాల్పడినట్లే అవుతుంది.

భారతదేశంలో తెల్ల డబ్బుకన్నా నల్లడబ్బే ఎక్కువ ఉన్నట్లు అంతర్జాతీయ ద్రవ్యనిధి, తదితర అంతర్జాతీయ సంస్థల లెక్కలు తెలుపుతున్నాయి. శ్రీమతిగాంధీ ప్రధానమంత్రి కాక ముందు పరిస్థితి ఈ విధంగాలేదు. జవహర్‌లాల్ నెహ్రూ గురించి మీరు ఏమైనా చెప్పండి కాని ఆయన తమ హయాంలో అవినీతి పెచ్చరిల్లి పోకుండా ఉంచగలిగారు. అప్పటికీ ఎస్. కె. పాటిల్, ప్రతాప్ సింగ్ కైరాన్ వంటి కొందరు నెహ్రూ పేరు, పార్టీపేరు చెప్పి పార్టీ కోసం, తన కోసం కూడా డబ్బు పోగుచేసుకునేవారు. శ్రీమతి గాంధీ ప్రధానమంత్రి పదవికి వచ్చినప్పుడు నల్లడబ్బు మన జాతీయాదాయంలో పదిశాతానికి మించిలేదు. ఎన్నో ఇతర దేశాలలో కూడా అలానే ఉంటుంది. కానీ వ్యాపారస్థులు, తదితరుల వద్దనించి అధికార పక్షం వీలైనంత పెద్ద మొత్తాలలో డబ్బు చేసుకోవడం మొదలు పెట్టినప్పటినించి నల్లడబ్బు శాతం క్రమంగా పెరగడం ప్రారంభం అయింది. అత్యవసర పరిస్థితిదాకా అది అలాగే కొనసాగింది

రెండవసారి 1980లో శ్రీమతిగాంధీ అధికారంలోకి రాగానే ఆ పార్టీ తనకి భద్రత లేదని భావించి ఇంతకు ముందుకంటే పెద్ద మొత్తాలలో సులువుగా, సురక్షితంగా డబ్బు చేసుకోడానికి తగిన మార్గాలని అన్వేషించడం ప్రారంభించింది. వ్యాపారస్థులు ఇచ్చే డబ్బుకన్నా విదేశాలతో వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకోడంవల్ల మరింతగా డబ్బు చేసుకోవచ్చు. కొన్ని వందల టాంకులు లేదా ఓ డజను పెద్ద విమానాలని కొనుగోలు చేస్తే కొన్ని వందల కోట్ల రూపాయలని తేలికగా చేసుకోవచ్చు. అందుకు కొన్ని కాగితాలపై సంతకాలు చేస్తే చాలు ఒకే దెబ్బకి రెండు పిట్టలని కొట్టవచ్చు. ఆ డబ్బు ఎవరికీ దొరకని ప్రదేశాలలో దాచుకోవచ్చు. టాటాలని, బిర్లాలని ఖుషామత్‌గా పట్టుకోవాల్సిన పని ఉండదు. అందువల్ల బయటపడే కుంభకోణాలలో ఇరుక్కుని అప్రతిష్ఠ పాలయ్యే ప్రమాదం ఉండదు వ్యవహారం అంతా చక్కగా, సాఫీగా జరిగిపోతుంది. అవసరమైనప్పుడు డబ్బు చేతికి అందుతుంది. ఆర్థిక మంత్రులు, బాంకుల ఛైర్మన్‌లు వాళ్ళకి ఎంతగా సహాయం చేసినా కొంతమంది విదేశాలలో నివసించే భారతీయులు అప్పుడప్పుడు కాస్త తలనొప్పిగా తయారవుతూ ఉంటారు అదితప్ప మరే ఇబ్బందులూ ఉండవు.

ప్రభుత్వంలోని ఆర్థిక నిపుణులు, మరి కొందరు ఈ నల్లడబ్బు పోవాలంటే పన్నులు తక్కువగా ఉండాలని అంటూ ఉంటారు. కాని వారికి అర్థంలేదు దేశంలో ఉన్న నల్లడబ్బుకి, పన్నులకి ఎంత మాత్రం సంబంధంలేదు. ప్రభుత్వరంగం పథకాలలో జరిగే వ్యయంలో నాలుగో వంతు రాజకీయనాయకులు, వారి మిత్రుల ద్వారా దుర్వినియోగం అవుతున్నదని ఒకరు అంచనా వేశారు అంటే మనకి రాబోయే లక్షా ఎనభైవేల కోట్ల రూపాయల విలువగల పంచవర్ష ప్రణాళికలో సుమారు 50 వేల కోట్ల రూపాయలు అధికార పార్టీలోని వ్యక్తుల చేతుల్లోకి పోతాయన్నమాట. అంటే దాదాపు నెలకి వెయ్యి కోట్ల రూపాయలు ఇది పది లోక్‌సభ ఎన్నికలకి సరిపోయేంత డబ్బు మన పంచవర్ష ప్రణాళికలు రూపొందింపబడేది అభివృద్ధికోసం కాదు, రాజకీయ నాయకుల జేబులు నింపడానికే. ప్రతి పంచవర్ష ప్రణాళికతో పాటు నల్లడబ్బుని తయారు చేసే ఒక మిని ప్రణాళిక కూడా ఉంటుంది ప్రణాళిక ఎంత పెద్దదిగా ఉంటే డబ్బు చేసుకోవడం కూడా అంత పెద్ద ఎత్తునే ఉంటుంది. కాంగ్రెసు పార్టీ పెద్ద ప్రణాళికలని రూపొందించడానికే ఆసక్తి చూపడంలో వింత ఏమిలేదు మన యువ ప్రధాన మంత్రి తమ పదవి బాధ్యతలని చేపట్టిన వెంటనే ప్రణాళిక పరిమాణం తగ్గించడం జరగదని తమ పార్టీవారికి హామి ఇచ్చారు. కాని అంత పెద్ద ప్రణాళికకి కావలసిన వనరులు మాత్రం కనుచూపు మేరలో కన్పించడం లేదు

ఏటా పదివేల కోట్ల రూపాయల విలువగల విదేశీ వస్తువులు అక్రమ రవాణాద్వారా మన దేశానికి దిగుమతి అవుతాయని ఇటీవల "టైమ్స్ ఆఫ్ ఇండియా"లో ఒక రచయిత అంచనావేశారు. అంత డబ్బు మనదేశం ఎలా చెల్లించ గలుగుతుంది? బొంబాయి, దాని పరిసరాలలో ఉన్న రేవులు ఈ దొంగ రవాణాకి కేంద్రాలు. ఈ దొంగ రవాణాదారుల ముఠా నాయకులకి రాజకీయవాదులతో, వ్యాపారస్థులతో దగ్గర సంబంధాలు ఉంటాయి. అబ్దుల్ రెహమాన్ అంతూలే పేరు తరచూ చెప్పబడుతూ ఉంటుంది. హాజీమస్తాన్ పేరుకూడా వినిపిస్తూ ఉంటుంది. వీరిద్దరూ ఒకప్పుడు కాంగ్రెసు (ఐ)కి చెందినవారే. అంతేకాదు వారిలో ఒకరు కాంగ్రెసు (ఐ) ముఖ్యమంత్రిగా కూడా పని చేశారు.

ఇక జాతీయ బ్యాంకులు, ఆర్థిక మంత్రిత్వ శాఖలోని వాటి యజమానులూ ఉన్నారు ఇటీవల

(59వ పేజీ చూడండి)



# ఆశాజనకంగా ఉండే పరిణామం

మొన్న డిసెంబరులో జరిగిన 'లోక్‌సభ ఎన్నికలలో కర్ణాటక ప్రజలు (లేదా ఓటరులు) కాంగ్రెసు (ఐ) పార్టీని ఘనంగా గెలిపించారు. మార్చి శాసన సభ ఎన్నికలలో మాత్రం వారు జనతా పార్టీనే బలపరిచారు

కాంగ్రెసు (ఐ) పార్టీ సుమారుగా పదిహేను సంవత్సరాలు శ్రీమతి ఇందిరా గాంధీ పేరుమీద నడిచింది. ఇప్పుడు ఆ రాజకీయ పక్షం ఆమె కుమారుడు శ్రీ రాజీవ్ గాంధీ పేరుమీద నడుస్తోంది. జాతీయోద్యమం మీద అభిమానం కలిగిన కాంగ్రెసు అభిమానులకి చాలా మందికి శ్రీమతి ఇందిరా గాంధీ పద్ధతులు అంతగా నచ్చేవికావు "కాంగ్రెసు" పేరు ఉన్నప్పటికీ ఆమె వామపక్షాన్ని స్వీకరించిన పార్టీ "అసలయిన" కాంగ్రెసు అని ఒప్పుకో బుద్ధివేసేది కాదు. ఇలాంటి వారికి!

జనతాపార్టీ సంగతివేరు కర్ణాటకలో ఈ పార్టీ నాయకుడు శ్రీ రామకృష్ణ హెగ్డేకి ఇటు శ్రీ రామారావుకి తెలుగుదేశం పార్టీలో ఉన్న స్థానంకాని అటు శ్రీ రామచంద్రన్‌కి అన్నా ద్రావిడ మున్నేట్ర కళగమ్ పార్టీలో ఉన్న స్థానంకాని లేదు.

కర్ణాటకలోనేకాదు. భారతదేశం మొత్తంమీద జనతా పార్టీకి "మహా నాయకులు' ఎవరూలేరు. ఈ రాజకీయ పక్షం నిజానికి ఒక కాంగ్రెసు చీలిక పార్టీ శ్రీమతి ఇందిరా గాంధీతో పడక చీలిపోయిన "పాత' కాంగ్రెసు అవతారమే జనతా అన్నా తప్పులేదు.

ఆంధ్ర సచిత్ర వారపత్రికకి న్యూఢిల్లీలేఖ రాస్తూ ఉండే కే. శే. శ్రీకృష్ణ 1969 లో కాంగ్రెసు చీలిపోయినప్పుడు అనేవారు – "శ్రీమతి ఇందిరా గాంధీతో ఘర్షణ పడిన శ్రీయుతులు మొరార్జీ దేశాయి. కామరాజనాడారు. నిజలింగప్ప మొదలయిన వారికి ఒక బలహీనత ఉంది; అదేమిటంటే. వారిని తమ పార్టీ అయిన కాంగ్రెసుని దెబ్బతియ్యటానికి భయం శ్రీమతి ఇందిరాగాంధీకి ఇటువంటి భయంలేదు. ఆమె బలాలలో ఇదొకటి." అని.

శ్రీమతి ఇందిరాగాంధీ బలాలలో ఇదొకటి. ఆమె మరొక బలం ఏమిటంటే ఆమె ప్రత్యర్థులని అభ్యుదయానికి విరోధులుగా. ధనికవర్గాల పక్షపాతులుగా, అల్ప సంఖ్యాకుల మేలుకోరని వారుగా చిత్రించగలగటం.

వాస్తవాలు ఏమాత్రం తెలిసిన వారికయినా ఆమె ప్రచారం నమ్మతగేదిగా ఉండేదికాదు. కాని, జనసామాన్యం ఆమె ప్రచారాన్నే నమ్మారు. శ్రీమతి ఇందిరా గాంధీయే ఇంచుమించు అన్నిచోట్లా గెలిచారు. శ్రీయుతులు మొరార్జీ దేశాయి. నిజలింగప్ప. సంజీవరెడ్డి. మోహన్‌లాల్ సుఖాడియా తదితరులు రాజకీయాలలో వెనుకబడిపోయాడు. (కీ. శే. కామరాజనాడారు సంగతివేరు శ్రీమతి ఇందిరాగాంధీ నేటి తమిళనాడులో ద్రావిడ కజగమ్ వారితో మైత్రి ఏర్పాటు చేసుకుని కామరాజనాడారు నిర్మించిన సంస్థని నాశనం చేశారు. ఆమెకి ముందు ఈ పని మొదలుపెట్టిన వారు మరొక కాంగ్రెసు నాయకులు కీ శే చక్రవర్తి రాజగోపాలాచారి. ఈయన గాంధీగారి వియ్యంకుడు. ఈమె పండిత జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె)

శ్రీమతి ఇందిరాగాంధీ – తమ తండ్రిలాగే – తమ లక్ష్యాలని సాధించటంకోసం వామపక్షాలుగా పరిగణించబడే వాటి నాయకులని చక్కగా వాడుకున్నారు ఆమె హయాములో ఒక కమ్యూనిస్టు పార్టీ
కాంగ్రెసుకి అనుబంధ సంస్థ అన్నపేరు తెచ్చుకోగలిగింది

ప్రచారం మాటలకి పరిమితం చెయ్యకుండా చేతల ద్వారా కూడా చేసేవారు శ్రీమతి ఇందిరా గాంధీ. బాంకులని హటాత్తుగా జాతీయం చేశారు. రాజభరణాలని రద్దు చేశారు. పాకిస్తాన్‌తో యుద్ధానికి దిగారు. అణుశక్తి పరీక్షలు చేయించారు. ..

ఆమె చేసిన పనులన్నిటిలోనూ ఎక్కువ హానికరమయినది అత్యవసర పరిస్థితిని విధించటమే భారతదేశం వంటి ఒక వెనుకబడిన దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి చావు దెబ్బ తగిలిందని ఎందరో అనుకున్నారు. ఇంతకీ ఆమె ఈ చర్య తీసుకున్నది ఎందుకు? కోర్టులో తమ ఎన్నికల కేసు పోయినందువల్ల! అదృష్ట వశాత్తు ఆమె చేసిన ఈ భయంకరమయిన పని ఆధునిక భారత దేశం చరిత్రలో ఒక చిన్న ఘట్టంగా మాత్రమే ఉండిపోయింది.

అత్యవసర పరిస్థితి లేదా ఎమర్జెన్సీ విధింపు ఫలితంగానే కావచ్చు ఆమె 1977 ఎన్నికలలో ఓడిపోయారు. ప్రధాన మంత్రి పదవిని కోల్పోయారు (విచిత్రం ఏమిటంటే. శ్రీమతి ఇందిరాగాంధీ దేశంలోని ఇతర రాష్ట్రాలలో అపజయం పొందినా ఆంధ్ర ప్రదేశ్. కర్ణాటక రాష్ట్రాలలో మాత్రం ఘనంగా గెలిచారు! తెలుగు వారికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద ఇతరులకి ఉన్న విశ్వాసం లేదేమోనన్న అనుమానం ఈ పత్రికలో వ్యక్తం అయింది.....)

అప్పుడే జనతా పార్టీ ఉద్భవించింది. ఇందులో కాంగ్రెసు సంప్రదాయాలలో మంచివి అనతగిన వాటిని నమ్మేవారు ఎందరో చేరారు. ఇతరులు కూడా చేరారు కాని అది అంత ముఖ్యమయిన విషయంకాదు. ముఖ్యమయిన విషయం ఏమిటంటే. జాతీయోద్యమంలో అభివృద్ధి చెందిన భావాలనీ. ప్రజాస్వామ్య వ్యవస్థ మొదలయిన వాటినీ గౌరవించే వారు ఈ రాజకీయపక్షం నాయకులలో కనిపించారు

స్వతంత్ర భారత దేశం చరిత్రలో కొత్త అధ్యాయం ఒకటి ప్రారంభం అయినదని ఎందరో అనుకున్నారు వారి విశ్వాసానికి పెద్ద ఆఘాతమే త్వరలో తగిలింది ప్రధాన మంత్రి పదవికి ఆశపడ్డ శ్రీ చరణసింగ్ తమ శత్రువులనతగిన శ్రీమతి ఇందిరాగాంధీతో లాలూచీపడి శ్రీ మొరార్జీ దేశాయి ప్రభుత్వాన్ని పడగొట్టారు. ఈ సందర్భంలో ఆయనకి శ్రీ సంజీవ రెడ్డి తోడ్పడినట్లు చెప్పబడేది..

జనతాయుగం" 1980లో అంతమయి పోయింది శ్రీమతి ఇందిరాగాంధీ దేశం అంతటా విజయాలు సాధించి మళ్లీ ప్రధాన మంత్రి అయ్యారు ఆంధ్ర ప్రదేశ్‌లో ఘనంగా గెలిచారు

అంతకి రెండు సంవత్సరాలకి ముందుగానే ఆంధ్రప్రదేశ్. కర్ణాటక రాష్ట్రాలలో శాసనసభ ఎన్నికలు జరిగాయి రెండు రాష్ట్రాలలోనూ నేటి కాంగ్రెసు (ఐ) వారే గెలిచారు.

అయితే ఈ రెండు రాష్ట్రాలలోనూ 1983లో జరిగిన శాసన సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) ఓడిపోయింది. ఆంధ్రప్రదేశ్‌లో చలన చిత్రనటుడు శ్రీ రామారావు స్థాపించుకున్న తెలుగుదేశం ఘనంగా గెలిస్తే కర్ణాటకలో జనతా కాంగ్రెసు(ఐ) పార్టీలు రెండూ ఇంచుమించు సమ ఉజ్జీగా విజయాలు సాధించాయి.

శ్రీ రామకృష్ణ హెగ్డే నాయకత్వాన జనతాపార్టీ కర్ణాటకలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోగలిగింది ఆయన ప్రభుత్వాన్ని భారతీయ జనతా. క్రాంతి రంగ పార్టీలవారు బలపరిచారు.

స్వంత మెజారిటీ లేకుండా ఇటువంటి ఏర్పాటులతో కొనసాగే జనతా రాష్ట్ర ప్రభుత్వం ఎక్కడ నిలుస్తుందని ఎందరో అనేవారు. శ్రీ హెగ్డే ఒక సాదా రాజకీయ నాయకుడు ఆయన శ్రీయుతులు రామచంద్రన్. రామారావులవలే సినిమా హీరోకాదు! శ్రీమతి ఇందిరాగాంధీవంటి అఖిల భారతస్థాయి నాయకులూ కాదు?

అటువంటి వ్యక్తి యొక్కపార్టీ లోకసభ ఎన్నికలలో ఓడిపోయినప్పటికీ రాష్ట్ర శాసన సభ ఎన్నికలలో గెలవటం భారతదేశం రాజకీయాలలో ఒక ఆశాజనకమయిన పరిణామం అంటే ఏమాత్రం అతిశయోక్తి కానేకాదు!

ఇంతకి ముందే అనుకున్నట్లు శ్రీరామకృష్ణ హెగ్డే ఒక సగటు లేదా సాదా రాజకీయ నాయకుడు. ఈయన పార్టీకి వోటువేసినవారు సినిమా

అభిమానులు కారు. జనతాపార్టీకి భారత దేశంలో ఎక్కడా శ్రీమతి ఇందిరాగాంధీవంటి నాయకులు లేరు. (ఇది కొందరికి ఆ పార్టీ బలహీనతగా తోచవచ్చు) కాని నిజానికి ఇటువంటి పరిస్థితి కొనసాగటమే మంచిది. గాంధీగారి నిష్క్రమణ తరువాత భారత దేశంలో మహా నాయకులని గురించి మాట్లాడటం ఎప్పట్టుగానే ఉంటుంది. పాశ్చాత్య దేశాలలో వలె ఇక్కడ కూడా సమర్థు-లయిన రాజకీయవాదులు అధికారంలోకి వస్తూ-ఉండాలనిపిస్తుంది) కర్ణాటకలో అసలే వేరను-కోవాలి!

పంజాబు భారతదేశంలోకెల్లా ఎక్కువ అభివృద్ధి చెందిన రాష్ట్రంగా పరిగణించబడుతోంది. అంటే ఈ రాష్ట్రం యొక్క తలసరి ఆదాయం ఇతర రాష్ట్రాలతో పోలిస్తే చాలా ఎక్కువ. సిక్కు మతాన్ని రాజకీయాలకోసం వాడుకునేవారు కొందరు రంగప్రవేశం చేశారు కాని అక్కడ మహా నాయకులు ఎవరు ఉండేవారు, ఉన్నారు?

తమ కాళ్ళకి దణ్ణాలు పెట్టించుకునే రాజకీయ నాయకులూ, తమ ఎంగిలి నీటిని తీర్థంగా పంచే రాజకీయ నాయకులూ దక్షిణ భారత రాష్ట్రాలలోనే ఎక్కువగా కనపడుతున్నారు! ఒకప్పుడు కీ. శే. జోసెఫ్ స్టాలిన్, మావో త్సే తుంగ్‌లు వారి అనుచరులచేత దైవసమానులుగా పరిగణించబడలేదు. అటువంటి-వారి అభిమానులన తగిన భారతీయ కమ్యూనిస్టు పార్టీల ముఖ్య మంత్రులు సయితం ఈ విధంగా తమ భారతీయానుచరులచేత గౌరవించబడటం లేదు! శ్రీ జ్యోతిబసు కాళ్ళమీద ఎందరు పడుతున్నారు? కీ. శే. అచ్యుత మీనన్ ఎంగిలి నీటిని ఎవరయినా తీర్థంగా తాగేవారా?)

ఇటువంటి రాజకీయ వాతావరణంలో శ్రీ రామకృష్ణ హెగ్డేవంటి కాంగ్రెసు సంప్రదాయాలకి చెందిన రాజకీయవాది గెలవగలగటం ఒక శుభ సూచకమయిన పరిణామం.

★ ★ ★ ★

ఈ మధ్య కొన్ని ప్రతిపక్షాలవారు "కాంగ్రెసు సంస్కృతి" అంటూ వెటకారంగా మాట్లాడటం మొదలుపెట్టారు. సంస్కృతి అన్నమాట అర్థం సంగతి అలాగ ఉంచి కాంగ్రెసు సంస్కృతి లేదా కాంగ్రెసు సంప్రదాయాలు ఏమిటని ఆలోచించి చూస్తే వచ్చే ఆలోచనల సారాంశం ఇది!

★ గాంధీగారు అనేవారు-దేవుడికి కూడా ఒక ఆకలితో ఉన్న అభాగ్యుని రొట్టెముక్క రూపంలో తప్ప ప్రత్యక్షం అయ్యే ధైర్యం ఉండదు, అని.

★ గాంధీగారు ఈ దేశంలోని కార్మిక నాయకులలో ప్రథములు.

★ అంటరాని వారుగా మాటలకి అందని అన్యాయాలకి గురి అవుతూ వచ్చిన వారిని "హరిజనులు"గా పిలిచారు గాంధీగారు. భారతీయ


శ్రీ రామకృష్ణ హెగ్డే

సమాజంలో అభివృద్ధి చెందిన ఇటువంటి దారుణమయిన దోషాలని తొలగించాలని అనేవారు ఆయన.

★ భారత ఉపఖండం మీద కోట్లమంది మహమ్మదీయులు ఉండేవారు. భారత దేశంలోనూ ఉన్నారు. వీరూ, హైందవులూ కలిసి జీవించాలని అన్నవారిలో గాంధీ మహాత్ముడే ప్రథముడు.

★ భారతదేశం తన గ్రామాలలో జీవిస్తుంది-అనేవారు గాంధీగారు. గ్రామాలలో ఉంటూ వ్యవసాయం చేసుకుని బతికే భారతీయులే ఎక్కువ మంది ఉంటారు. వారి పరిస్థితిని మెరుగు పరచటమే ముఖ్యం అని గుర్తించని కాంగ్రెసు పెద్దనాయకులు ఎవరూ లేరు.

★ ఇంత మంది పేదవారు జీవించే భారత దేశంలో రాజకీయాధికారం కలవారు కనీసం వేషాలలోనయినా ఆ పేదవారిని అనుకరించాలని కాంగ్రెసువారు ఒక రకం వేషాన్ని స్వీకరించారు. లెనిన్ కావాలని రైలు ఇంజను డ్రయివరులు ధరించే టోపీని పెట్టుకునే వాడుట..... మావో త్సే తుంగ్ మామూలు చీనా దేశస్థుడి వేషమే ధరించేవాడు....

★ కాంగ్రెసు వారు ఎప్పుడూ తగువులాడు కుంటూ ఉంటారు. ఇదే వారి సంస్కృతి అంటారు కొందరు. (నిజానికి తగవులు లేని భారతీయ రాజకీయ పక్షం ఏది?!) ఇది ఒక లోపం అని ఇటువంటివారి అభిప్రాయం . కాని అదే వారి బలం అని ఈ విలేఖరి నమ్మకం. ప్రాచీన భారత దేశంలో ఎప్పుడూ యుద్ధాలే జరిగేవి—ఇవి రాజుల మధ్యనా, మేధావుల మధ్యనా, ఇతరుల మధ్యనా అన్ని రకాలుగానూ జరిగేవి! ప్రాచీన గ్రీసుదేశం లోనూ అంతే కదా? ప్రపంచం అంతటికీ అన్ని విధాలుగానూ ఆదర్శంగా ఉంటున్న పాశ్చాత్య ప్రపంచంలోనూ అంతేకదా? ప్రజాస్వామ్యం అంటే ఏమిటి? అతి వినయం ధూర్త లక్షణం అననే అన్నారు కదా?

★ ఒక్క మాటలో చెప్పాలంటే కాంగ్రెసు ఉద్యమం భారత సమాజం లేదా సమాజాలకి నిజమయిన ప్రతినిధి. అన్ని మతాల వారికీ, అన్ని వర్గాల వారికీ ఇందులో స్థానం ఉంది!

★ కొంతదాకా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ కాలంలో చాలా వరకు శ్రీమతి ఇందిరాగాంధీ కాలంలో కాంగ్రెసు పార్టీ (లేదా పార్టీలు) తమ నిజమయిన గుణాలకి దూరం అయింది (లేదా అవుతూ వచ్చాయి.)

★ కాంగ్రెసు అన్నది ఒక ఇంగ్లీషు పదం. అది ఎలాగో మన భాషలలోకి వచ్చేసింది. పేరు ఏది ఉన్న-ప్పటికీ ఒకనాటి కాంగ్రెసు సంప్రదాయాలని గౌరవించే రాజకీయ పక్షాలు మాత్రమే ఈ దేశంలోని ప్రజలకి అసలయిన ప్రతినిధులుగా ఉండగలవు. పశ్చిమ జర్మనీలో నాజీలు వచ్చినట్లు, అర్జెంటీనాలో పెరానిస్టులు వచ్చినట్లు అక్కడక్కడా కొందరు తాత్కాలికంగా ప్రజలలో అధిక సంఖ్యాకుల ఆదరణ పొందవచ్చునేమో కాని చివరికి అందరూ ప్రధాన జాతీయ స్రవంతి లోకి రాక తప్పదు!

—సూరి.

# ప్రేమించవే మనసా......

అద్దేపల్లి సుచిత్రాదేవి

(గత సంచిక తరువాయి)

మనసనేది లేకపోతేనే మనిషికి హాయి! మనసుతో ముడిపడిన వ్యక్తిని మరిచిపొమ్మంటే! అది అంత తేలికా? కానీ నా కోసం నా ఆత్మీయులనందర్నీ బాధ పెడుతున్నాను.

శామ్ అసలు నువ్వు నా మనసుకు దగ్గరెందు కవాలి? అయిన వాడివి నన్నిలా ఒంటిరిని చేసి ఎందుకు హఠాత్తుగా దూరమవాలి? నేనెలా బ్రతకాలను కున్నావు?

రేపు.... రేపటికి మన పరిచయానికి సంవత్సరం సరిగ్గా! సంవత్సరమేనా? ఆశ్చర్యం కదూ! ఎన్నో జన్మల నుంచి తెలిసున్న వాళ్ళలా ఉండే వారం కదూ మనం. ఇరవై రోజుల క్రితం యీ రోజు కోసం ఎన్నిపాన్లు వేసుకున్నాం. నువ్వే చెప్పావు మొట్టమొదట మనం కలిసి మాట్లాడుకున్న గండిపేటకి వెళ్దామన్నావు. అక్కడే చెపుతానన్నావు తర్వాత ప్రోగ్రామ్.

ఏది? ఎక్కడున్నావ్ నువ్వు?

శామ్! శామ్! శామ్!

నా మనసు వేసే కేకలు నీకు వినిపించటం లేదు?" విజ్జూ పుస్తకం మూసేస్తూ అన్నాడు.

"అక్కడే ఉండచ్చు, వెళ్ళి చూద్దాం!"

"నేనూ వస్తాను!" డైరీ రజియా చేతికిచ్చి లోపల పెట్టమంది.

"వదినా, వస్తాను" అని విజ్జూ వెనుక కూర్చుంది. స్కూటర్ స్పీడుగా వెళ్ళిపోయింది.

రజియా నీరసంగా సోఫాలో వాలిపోయింది.

* * * * * * *

ఎలా డ్రైవ్ చేసిందో, ఎలా గండిపేట కొచ్చిందో దేముడికే తెలియాలి. అదృష్టవశాత్తూ మాత్రమే దారిలో ఎక్కడా ఎలాంటి ఏక్సిడెంట్‌లు జరుగలేదని చెప్పచ్చు.గమ్యం చేరిన తర్వాత కూడా కారాపి స్టీరింగ్ పట్టుకుని అలాగే అచేతనంగా కొన్ని నిముషాలు కూచుండి పోయింది.

"శిల్పా.... హనీ!" చెవిలో శామ్‌సన్ గుసగుసలాడుతున్నట్లే ఉంది.

మెల్లగా గార్డెన్ వైపు నడిచింది.

**జరిగిన కథ-3 :** భువనేశ్వరి శివశంకరంగార్ల కూతురు శిల్ప ప్రేమించిన శామ్ దూరమవడంతో అమె బ్రతుకే చీకటయిపోయింది. ఆమెను ఆ దిగులు నుంచి మరిపించేటందుకు సస్య శిల్ప వాళ్ళింట్లోనే నాలుగు రోజులు ఉండి తనతో కూడా తనింటికి అమెను తీసుకొని వెళ్ళింది. విజ్జూ, సస్య, శిల్ప, సంజయ్, రజియా కలసి యాదగిరిగుట్టకు వెళ్ళి వచ్చారు. అక్కడి నుండి వచ్చిన మర్నాడు ప్రొద్దునే శిల్ప కాఫీ కూడా తాగకుండా స్నానం చేసి ఇప్పుడే వస్తానని చెప్పి కారులో ఒక్కతే ఎక్కడికో వెళ్ళింది. మధ్యాహ్నం ఒంటి గంటయినా ఆమె జాడ లేకపోయేటప్పటికి శిల్ప డైరీ చదివితే ఏమైనా విషయం ఊహించవచ్చని ఆమె డైరీ చూస్తాడు విజ్జూ.

"అదిగో, ఆ చెట్టే, అదో ఆ పూల మొక్కల పక్కనే మొట్టమొదట శామ్ తనతో చొరవగా మాట్లాడాడు!" అక్కడ కొచ్చి నిలుచుంది. ఆ రోజు జరిగిన సంఘటనలన్నీ మనసులో మెదిలాయి.

ఆ రోజు......

శిల్ప, సస్య, రాధ, సునంద, షాజాది, ఫ్లారీ తమ క్లాసులోని తమ జట్టంతా కలిసి యిక్కడికి వచ్చారు.

రాధ ప్రేమించిన శేఖర్‌కి బొంబేలో మంచి ఉద్యోగం వచ్చింది. ఇక మరుసటి రోజే వాళ్ళ పెళ్ళి. వాళ్ళ ప్రేమకి రెండు వైపులా యింట్లో పెద్దవాళ్ళు అంగీకరించలేదు. కులం వాళ్ళ మధ్య అడ్డుగోడ అయింది. ఇన్ని రోజులు శేఖర్‌కి ఉద్యోగం రాక ఆర్థికంగా స్వాతంత్రం లేకపోవటంతో మౌనంగా ఉన్నారు యిద్దరూ. రాధ యింట్లో తను యింకా చదువుతానని పంతం పట్టి ఎమ్. ఏ. లో చేరి శేఖర్ పిలుపు కోసం ఎదురు చూస్తుండింది వాళ్ళ నిరీక్షణ ఫలించి శేఖర్‌కి మంచి ఉద్యోగం వచ్చింది. ఇక ఎవరికీ వాళ్ళు భయపడనక్కరలేదు. ఇద్దరికీ మైనారిటీ ఎప్పుడో తీరింది. అందుకే పెళ్ళికి అడ్డుపడ్డ పెద్దలకు చెప్పకుండా గప్‌చిప్‌గా ఫ్రెండ్స్ సమక్షంలో పెళ్ళి చేసుకుని బొంబేకి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నారు.

పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయే ముందు ఫ్రెండ్స్ అందరితో సరదాగా ఒకరోజు గడపాలన్నది రాధ. అందుకే గండిపేట పిక్నిక్ ప్రోగ్రామ్ వేసారు. ఇళ్ళ దగ్గర్నుంచి టిఫిన్‌లు వీలయిన వాళ్ళు తెచ్చారు. వీలుకాని వాళ్ళు కేకులు, బిస్కట్లు తెచ్చారు.

అందరూ నీళ్ళకి దగ్గరగా బండలపై కూర్చున్నారు.

"రాధీ ఎమ్. ఏ. ప్రయివేట్‌గా నన్నా చదివి పూర్తి చేస్తావా? లేక యింతటితో డుమ్మానా?" చేపలకి నీటిలో పల్లీలు విసురుతూ అడిగింది సస్య.

"శేఖర్ చదవమనే అన్నాడు. నేను యీ ఎమ్. ఏ. పూర్తి చేస్తే నాకూ ఏదన్నా మంచి జాబ్ దొరుకుతుంది. దేనికీ వెతుక్కోకుండా యిద్దరి సంపాదనా వుంటుంది కదా?" రాధ కలల్లో తేలిపోతోంది.

"పెళ్ళి అయిన తర్వాతా చదవగలమంటావా?" అడిగింది షాజాది. ఆ అమ్మాయి కన్నీ అనుమానాలే. సందేహాల సుందరి అని పిలుస్తారు మిత్రబృందం తనని.

"ఏం ఎందుకు చదవలేను. శేఖర్ కూడా నాకు హెల్ప్ చేస్తాడు. డౌట్స్‌కి తనే చెప్పచ్చుకదా. సేమ్ సబ్జక్టే కాబట్టి" రాధ మాటలకి ఫ్లారెన్స్ ఫక్కుమని నవ్వింది.

"సరిసరి. యిహనేం ఫస్ట్‌క్లాస్ తప్పదు నీకు. సబ్జక్టు మాత్రం సోషియాలజీ కాక కొద్దిగా మార్చాలి అంతే!"

"అదేమిటి?" అడిగింది శిల్ప.

"ఏమిటా? చేసే హెల్ప్ సరసాలలో, తీర్చే డౌట్స్ ప్రేమ పాఠాలలో" తమాషాగా అంది ఫ్లారీ.

అందరూ పకపకా నవ్వారు.

"ఛీ, పెద్ద ఆరిందలా అన్నీ ముందే తెలిసినట్లు చెబుతుంది." రాధ ముఖం ఎఱ్ఱగా అవుతుండగా కసిరింది.

"ఇందులో ఇనుభవాలతోనే తెలియాలా? ఇన్‌స్టింక్ట్! దట్సాల్ మై ఫ్రెండ్. చేపపిల్లకెవరు యీత నేర్పాలి?"

ఫ్లారీ మాటల్లో గడుసుదనం ఉంది.

"అబ్బ, నీతో నీక్కాబోయే మొగుడు ఎలా వేగుతాడో!" రాధ నవ్వేసింది.

అంతవరకూ మౌనంగా ఉన్న సునంద గంభీరంగా "రాధీ, నిజంగా ప్రేమ ప్రేమ అని పరుగులెత్తే చాలామంది మీలా తెలివిగా, నిదానంగా ప్రవర్తిస్తే ప్రేమ వివాహాలు విఫలమవటం అంటూ ఉండదు. అమ్మాయికి పదహారు పదిహేడు ఏళ్ళు, అబ్బాయికి సరిగా యిరవయ్యేళ్ళు రాగానే ప్రేమించేస్తున్నా మంటారు. అది పూర్తిగా కలల వయసు. అసలు ప్రేమకర్థంకూడా ఆ వయసులో తెలియదు. ఒకరికొకరు నీవు లేందే బ్రతకలేను అని గొప్ప గొప్ప సినిమా డైలాగులు చెప్పేసుకుని చాలా ధైర్యంగా ముందూ వెనుకాచూసుకోకుండా పెళ్ళి

ఉంటారు ఏ గుడిలోనో దండలు మార్చుకుంటారు. జీవితం ప్రారంభిస్తారు. ఇంట్లోంచి తెచ్చుకున్న 'మనీ' వున్నంత వరకూ జీవితం యీస్ట్మన్‌కలర్ పిక్చర్‌లో హీరో హీరోయిన్ల డ్రీమ్ సాంగ్‌లాగే ఉంటుంది. డబ్బు అయిపోతుంది. పూర్తికాని చదువులకి ఉద్యోగాలేం దొరుకుతాయి? మహా మహావారే నీరసించి పోతుంటే

ఆర్థిక లోపాలతో పాటు ఒకరి లోపాలు ఒకరి ముందు బయటపడతాయి. సర్దుకు పోవటమన్నది అప్పుడిక వాళ్ళకు ముఖ్యంగా అవమానంగా ఉంటుంది. దాంతో సామరస్యత శూన్యమైపోతుంది. నీవు లేక నేను లేను అనుకున్న




ప్రేమికులు నువ్వెంతంటే నువ్వెంతని మాటలు అనుకుంటారు. తగవులేసుకుంటారు. వీధినపడతారు విడిపోతారు. లవ్ స్టోరీ ట్రాజెడీగా ముగిసిపోతుంది. అసలు అందుకే ప్రేమ వివాహం అనగానే అందరిలో ఓ చులకన భావం ఏర్పడి పోయింది.

"ఆ, ఆ వేడి ఎన్నాళ్ళుంటుందిలే నాలుగు రోజులు తిరిగితే వాళ్ళే అమ్మా, అయ్యా అని యిల్లు వెతుక్కుంటూ వస్తారు!" అనేస్తున్నారు తెలిగ్గా.

అలాకాక కొంచెం నిదానించి, తాము పెద్దలనుంచి కావని వేరుపడి పోయినా నిశ్చింతగా బ్రతగ్గలము అనుకుని, కాస్త సహనము, కొంచెం క్షమా, అనురాగంతో పాటు అలవర్చుకుని ఉంటే ప్రేమ వివాహాలన్నీ విజయవంతమవుతాయి. ప్రేమికులు హాయిగా ఉంటారు!" ఉపన్యాస ధోరణిలో ఆగకుండా చెప్పింది సునంద.

అందరూ చప్పట్లు కొట్టారు.

"ఇంత విలువైన లెక్చర్‌కి మనందరి తరఫున సంతోషంగా మన కంచుగంటకి యీ కప్పు బహుమతి ప్రదానం చేస్తున్నాను". ఫ్లారీ కాళీ వర్లీ పొట్లాన్ని చక్కగా కప్పులా చేసి అందించింది. దాన్ని సునంద సవినయంగా అందుకుంటుంటే మళ్ళీ అందరూ లయబద్ధంగా చప్పట్లు కొట్టారు.

**కాలేజి డిబేట్సులో** సునంద మైక్ ముందుకొచ్చిందంటే అంతా పిన్ డ్రాప్ సైలెన్స్ అయిపోవాల్సిందే. ఆమె ఖంగున మాట్లాడుతూ ఉంటే, ఒక్కో పాయింట్ వివరిస్తుంటే స్టూడెంట్స్ అల్లరి చెయ్యటం కూడా మరిచిపోయి కూచుంటారు.

అందుకే తనకి "కంచుగంట అనినిక్‌నేమ్ పెట్టారు కొందరు ముద్దుగా.

"ఆ విషయము ఏమో గానీ యువతీయువకులకు పెద్ద సందేశం యిచ్చింది యిప్పుడు" సస్య నవ్వుతూ అన్నది.

"మొత్తానికి ఎలా అయితేనేం? మన రాధాకళ్యాణం శుభప్రదంగా జరగబోతుంది" సంతోషంగా అన్నది శిల్ప.

"రాధీ, మనలో మొదట పెళ్ళి చేసుకుటూంది నువ్వేనే. నీ వివాహం ఆనందంగా జరిగి నువు సుఖంగా ఉంటే అది మిగిలిన అందరికీ ఆదర్శప్రాయం" అన్నది షాజాది.







# ప్రేమించవే మనసా....

"అచ్చా. బొంబె వెళ్ళగానే మీ భయ్యాకి లెటర్ రాస్తాను. షాజికి త్వరగా షాదీ జరిపించెయ్యండి. అది అవస్థపడుతుంది చెప్పలేక. తనకి పెళ్ళి చేస్కోవాలని వుంది. పోనీ అని ఎవర్నైనా ప్రేమించే ధైర్యమూ లేదు. మీరూ చెయ్యకపోతే ఎలా అని?" అన్నది రాధ.

ఆ మాటలకి సిగ్గుగా నవ్వేసింది షాజాది.

"చాల్లే పెద్ద పెళ్ళిళ్ళ పేరక్కవు బయల్దేరావు!"

నిజానికి షాజీ వాళ్ళ అన్నయ్య చదవమన్నాడని చదువుతుందేకానీ తనకి పెద్ద ఇంట్రెస్ట్ లేదు. కానీ వాళ్ళ అన్నయ్యకు మాత్రం పరదాలు దాటుకుని తమ యింట్లో ఆడపిల్లలు కూడా పెద్ద చదువులు చదవాలని ఆశ.

"ఏం అక్కర్లేదు. ఈ సంవత్సరం అన్ని పరీక్షల్లోనూ తన్నేసెయ్. మీ అన్నయ్యే అర్థం చేసుకుంటాడు, దృష్టి చదువుమీద లేదని" ఫ్లోరి సలహా యిచ్చింది.

"లేవండి, అలా కాసేపు తిరిగివద్దాం" శిల్ప లేచింది. అంతా గార్డెన్ వైపు నడిచారు. ఆదివారం అయితే బాగా జనముండేవారు కానీ వర్కింగ్ డే అవటం మూలాన యివాళంతగా ఎవరూ లేరు.

దూరంగా పొద చాటున ఓ జంట పూర్తిగా యీ లోకాన్నే మర్చిపోయినట్లు కూర్చుని ఉన్నారు. అతని ఒడిలో ఆమె, ఆమె మెడ చుట్టూ అతని చేతులు!

"రేపట్నుంచి మన రాధీ కూడా అలాగే...." అటు చూపించి చిలిపిగా అన్నది ఫ్లోరి.

అంతా మళ్ళీ కలకలా నవ్వారు. రాధ చిరుకోపంతో ఫ్లోరి జడపట్టి లాగబోయింది.

ఫ్లోరీ అందకుండా పరుగు తీసింది.... ఆ సందడికి, ఏకాంతంగా పచ్చికలో కూర్చుని చదువుకుంటున్న రాగి జుట్టు ఫారినర్ తలయెత్తి అసహనంగా చూసి మళ్ళీ పుస్తకంలో తలదూర్చాడు.

అతన్ని చూసి సన్య "అబ్బో" అన్నట్టు భుజాలు ఎగురవేసింది. ఆ పూట తోటలో పువ్వులతో పోటీగా వీళ్ళ నవ్వులు విరిసాయి. వాళ్ళ అల్లరి పరుగులకు చెట్లు తలలూపాయి.

షాజీ ఏదో చెపుతుంటే సన్య మరీ వెనగ్గా నడుస్తుంది. మిగిలిన అందరూ ముందున్నారు. తనూ సన్య, షాజీలతో నడవచ్చని ఒంటరిగా మధ్యలో ఆగిపోయింది శిల్ప. వెనక్కు చూస్తున్నదల్లా "హలో" అని సడన్‌గా తన పక్కన పురుష స్వరం వినిపించడంతో ఉలిక్కిపడి తల తిప్పింది.

"ఇతను...ఇతను, ఎక్కడో చూసినట్లుందే?"

అతనికి పాతికపైన ముప్పయి లోపు వయస్సుండవచ్చు. పొడవుగా, చామన ఛాయగా, స్నేహపూర్వకమైన చిరునవ్వుతో చూడగానే మంచి అభిప్రాయం కలిగేలా ఉన్నాడు.

ఆమె చూపు గమనించి "నేను.... నన్ను మరిచిపోయ్యారా?" అడిగాడు అదే నవ్వుతో

ఇబ్బందిగా అనిపించింది శిల్పకి. "సారీ" అనేసింది.

"రాజారావుగారింట్లో ఫంక్షన్‌కి మీరు మీ డాడీతో వచ్చారూ...."

"ఓ!" గుర్తు వచ్చింది శిల్పకి

రాజారావుగారు శివశంకరంగారికి బాగా స్నేహితులు. వాళ్ళమ్మాయి రూప పెళ్ళి రిసెప్షన్‌కి శిల్ప తండ్రితో కలిసి వెళ్ళింది. ఆ రోజు రాజారావుగారు ఆ హడావుడిలో నే కొంతమంది తనకు తెలియని వారిని పరిచయం చేసారు. అప్పుడే యితన్నీ పరిచయం చేసినట్లు గుర్తు. ఇతనక్కడ చాలా కలివిడిగా తిరుగుతూ కనిపించాడు. వాళ్ళ ఆఫీసులోనే పని చేస్తున్నట్లు చెప్పారు పేరు ఏదో చెప్పారు.....ఆ శ్యామ్, శ్యామ్‌సుందర్ కాబోలు.

"మీరు....మీ పేరు శ్యామ్‌సుందర్ కదూ?"

అతను హాయిగా నవ్వాడు. "భలేవారే, మొత్తం మీద పేరులో రెండక్షరాలైనా గుర్తుపెట్టుకున్నారు. శ్యామ్‌సుందర్ కాదు, శామ్‌సన్"

"ఓహ్" అనుకుంది శిల్ప.

సన్య, షాజీ వచ్చేస్తున్నారు శిల్ప అటు తిరిగి చూసేసరికి. అతనూ అటు చూసి అన్నాడు. "మీరూ మీ ఫ్రెండ్స్‌తో కలిసి వచ్చినట్లున్నారు." అతను మాట్లాడుతుంటే తను మరీ ఏమీ మాట్లాడకపోతే బావుండదని "అవును! మీకీ రోజు ఆఫీస్ లేదా యిలా వచ్చారు.?" అడిగింది.

"ఊర్నుంచి మా బంధువులు వచ్చారు. వాళ్ళకు సిటీ కొత్త. ఇక్కడికి తీసుకెళ్ళమని అడిగితే సెలవు పెట్టి వచ్చాను. అదో అక్కడున్నారు వాళ్ళు. నేను మంచినీళ్ళ కోసమని వచ్చాను. ఇంతలో మీరు కనిపించారు."

అప్పుడు గమనించింది అతని చేతిలోని పెద్ద వాటర్ బేగ్. ఇంతలో సన్య, షాజీ వీళ్ళ దగ్గరకు వచ్చేసారు.

సన్య అతను చూడకుండా కళ్ళెగరేసింది "ఎవరన్నట్లు?"

ఒకరికొకర్ని పరిచయం చేసింది శిల్ప.

"నేనిక వస్తాను" ఫ్రెండ్స్‌తో కదలబోయింది శిల్ప.

"ఒకే, సీయూ" చొరవగా అనేసి అతనూ వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఎన్నోసార్లు ఏదో ఓ సందర్భం కలిసివచ్చి కలుసుకోవటం జరిగింది. రాను రాను ఒకళ్ళ అభిప్రాయాలు ఒకళ్ళకు నచ్చాయి. మనసులు కలిసాయి. వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నారు. పెద్దలుకూడా అంగీకరించారు. కానీ....కానీ విధి ఎంత క్రూరంగా శామ్‌నీ తననీ వేరుచేసింది?

శిల్పకి మనసులో తామిద్దరూ కలుసుకున్న ప్రతి నిముషమూ సినిమా రీలులా తిరుగుతూ కనిపించసాగింది.

"మరోసారి .... మరోసారి తనూ, శామ్, సన్య, ప్రకాష్, సంజయ్, రజియా, విజ్జూ అందరూ కలిసి వచ్చారు ఇక్కడికి.

## ప్రేమించవే మనసా...

"అప్పుడెంత సరాదాగా గడచిపోయింది. అప్పుడు.... ఎక్కడా? ఆఁ.. అదిగో ఆ రాతి మీదే తనూ శామ్ చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు!" అప్రయత్నంగానే అటు నడిచింది శిల్ప. కనులతోనే ఆ ప్రదేశాన్ని ఆప్యాయంగా తడిమింది. అందరూ ఆ రోజు కొద్దిసేపు జంటలుగా విడిపోయారు. విజ్జూ ఎవరికీ చెప్పకుండా కొన్ని ఫోటోలు తీయబోతున్నట్లు ముందుగానే చెప్పాడు.

తను మరీ ఎక్కువగా మట్లాడదు. శామ్‌కూడా దాదాపు అంతే. కానీ ఎప్పుడో మూడ్ వస్తే మాత్రం గలగలమని ఆగకుండా మాట్లాడుతూ అందరిని నవ్విస్తాడు. లేనప్పుడు కామ్‌గా ఉండిపోతాడు, ఉన్న చోటు తెలియకుండా.

"అరే ఎంతసేపని అలా మౌనంగా ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ కూర్చుంటారు! మాటాడుకోరు. నవ్వుకోరు. కనీసం చేయి చేయి అయినా పట్టుకోరు. ఇక మీ ఫోటో ఏ ఫోజులో ఉండగా తీయమంటారు?" అంటూ వచ్చాడు విజ్జూ.

**"మరే వీళ్ళ ప్రేమ ఒక మౌనగీతం" సస్య అల్లరిగా అన్నది.**

**సస్య, ప్రకాష్ ఎప్పుడు వచ్చారో విజ్జు వెనుక ఉన్నారు. శామిద్దరూ ఉలిక్కిపడి యీ లోకంలోకి వచ్చారు. దూరంగా సంజయ్, రజియా వస్తున్నారు. సంజయ్ ఏదో అనగా దానికి తల ఎత్తి పకపకా నవ్వుతున్నదల్లా రజియా రాయిని తట్టుకుంది. పడబోతున్న ఆమెను రెండు చేతులతో వంగి పట్టుకున్నాడు సంజయ్.**

**ఒక్కక్షణం నిలదొక్కుకుంటూ అతని చేతుల మధ్య ఆమె కనులు తెరిచి కనులు మూసే లోపల జరిగిపోయిన ఆ సంఘటనని విజ్జూ కెమెరాలో బంధించేసాడు. ఇంటికి వెళ్ళిన తర్వాత తను తీసిన మూడు జంటల ఫోటోలు చూపాడు.**

**సంజయ్, రజియాల ఫోటో ఎంతో సహజంగా ఉంది. సస్య, ప్రకాష్ ఒకరి చేయి ఒకరు పట్టుకుని నవ్వుతూ నడుస్తుండగా తీసినట్టున్నాడు. ముద్దుగా ఉందా జంట. ఇక శిల్ప, శామ్ ఒకరి కన్నుల్లోకి ఒకరు చూసుకుంటూ కూచుని ఉండగా తీసిన ఫోటో. అది శిల్ప ప్రాణం!**

"శామ్, ఫోటోలోనూ, మనసులోనూ ఉన్నావు. కానీ కనుల ముందుకు రావేం?"

శిల్ప అక్కడే శూన్యంలోకి చూస్తూ అదే రాతిపై ఒంటరిగా కూర్చుండిపోయింది.

* * * * * * * *

అలా ఎంత కాలం గడిచిందో శిల్పకే తెలియదు. వాతావరణమంతా మబ్బు పట్టి చల్లగా ఉంది.

సమీపంలో కొన్ని అడుగుల దూరంలోనే ఓ అల్లరి మూక వచ్చి కూచోటం గమనించనే లేదు.

వాళ్ళు ఓ నలుగురు ఉన్నారు. అంతా పాతికలోపు వయసు వాళ్ళే.

ఈ లోకానికి సంబంధించనట్టు పరాగ్గా, ఒంటరిగా అందమైన ఆడపిల్ల కనిపించేసరికి వాళ్ళకి చాలా హుషారుగా ఉంది.

"ఎవరి కోసము నిరీక్షణ?" తమాషాగా అన్నాడొకడు.

"ప్రియుని కోసమేగా, యింకెవరి కోసం?" వెకిలిగా మరొకడన్నాడు.

"ఛ, ఇంత మంది ఉన్నాం ప్రియుల కోసం అనాలి?" మరొకడు సరిదిద్దాడు.

అసలదే ఓ అర్థం లేని వాగుడు. అయినా అదేదో పెద్ద జోక్‌లా అందరూ విరగబడి నవ్వారు.

ఆ నవ్వులకి ఉలిక్కిపడి తల ఎత్తింది శిల్ప. కీచకుల వారసుల్లా వాళ్ళని అంత దగ్గరగా అలా హఠాత్తుగా చూసేసరికి భయంతో గుండె కొట్టుకోవటం మానేస్తుందేమో అనిపించింది శిల్పకి.

నుదురంతా స్వేద బిందువులు అలుముకున్నాయి.

భయంతో రెపరెపలాడిన శిల్ప విశాలమైన కనులు వాళ్ళకి మరింత ధైర్యాన్నిచ్చాయి.

పల్చగానే ఉన్నా అక్కడక్కడా జనం కనిపిస్తూ తిరుగుతుండ బట్టి గానీ లేకపోతే ఎప్పుడో చొరవ చేసేవాళ్ళు.

సడన్‌గా ఒకడు "పాట పాడవోయ్" అన్నాడు పక్కనున్న వాడితో వాడికప్పటికప్పుడు ఏ పాటా గుర్తు రాలేదులా ఉంది.

"మెహబూబా, మెహబూబా" అని అందుకున్నాడు.

"హెలెన్ లా నేను డాన్స్ చేసేదా?" మరొకడు ఉత్సాహంగా లేచాడు.

"ఛట్, నువ్వెందుకు? ఆడదాని డాన్స్ ఆడది చేస్తేనే మజా!" శిల్పని చూసి నవ్వాడు.

శిల్పకి సన్నగా దడ ప్రారంభమయింది. ఎదురుగా చూసింది. నీళ్ళు మరీ అంత ఎక్కువ లేవు, దూకగానే కొట్టుకు పోయేందుకు!

"తనని వీళ్ళ బారి నుండి కాపాడే దెవరు?" అనుకుంటూ చుట్టూ చూసింది.

తన కనులను తనే నమ్మలేకపోయింది! భ్రమకాదు గదా అనుకుంది!

దూరంగా సస్య, విజ్జూ వస్తున్నారు!

ఒక్క ఉదుటున లేచింది శిల్ప. వేగంగా చప్పట్లు కొడుతూ చెయ్యి ఊపింది.

ముందు విజ్జూ చూసాడు.

"అదిగో శిల్ప"

సస్య కూడా చూసింది. దూరంగా కంగారుగా తమ వైపు పరుగెత్తుతున్నట్లు వస్తున్న శిల్ప, ఆమె వెనుకగా ఓ రౌడీ బృందం!

"మైగాడ్, ఎలాంటి పరిస్థితుల్లో చిక్కుకుంది!"

సస్య పైకన్న మాట విజ్జూ మనసులో అనుకున్నాడు.

ఒంటరిగా చిక్కిన ఆడపిల్ల హఠాత్తుగా యిలా తన వారిని కలిసి వెళ్ళిపోవటం ఆ అల్లరి మూకకి కొండమీద నుంచి తోసినట్లయింది. వాళ్ళ కళ్ళల్లో స్పష్టంగా నిరాశా, ముఖంలో ఏమీ చెయ్యలేని కసి కనిపిస్తున్నాయి.

దగ్గరకు చేరేసరికి దాదాపు పరుగెత్తుతూనే వచ్చేసి రెండు చేతులతో విజ్జూ నొకవైపు, సస్య నొకవైపు పట్టుకుంది శిల్ప. తమ చేతుల్లోని ఆమె అరచేయిని భయం లేదన్నట్లు మృదువుగా నొక్కారు సస్య, విజ్జూ.

"పద, వెళదాం." విజ్జూ ముందు నడిచాడు.

కారు దగ్గరకు వచ్చిన తర్వాత అన్నాడు. "శిల్పా, ఏమిటీపని? నీకోసం ఎంత కంగారు పడ్డాము!"

"థాంక్‌గాడ్, సమయానికి మేము వచ్చేసాము కానీ ఆ కోతిమూక నిన్ను అల్లరి పెట్టివుంటే?" సస్య అన్నదానికి శిల్ప మవునంగా ఉండిపోయింది.

"ఆ వెధవలననేం ప్రయోజనం? మనకు తెలివి ఉండాలి కానీ, ఇదేమన్నా స్వప్నలోకమా? హైద్రాబాదు నగరం అని తెలియదూ? ఇంకా నయం జనం ఒకరిద్దరైనా తిరుగు తున్నారు కాబట్టి సరిపోయింది" విజ్జూ కొంచెం కోపంగానే అన్నాడు.

"అసలు నువ్విలా రావాలనుకుంటే మాతో చెప్పి రావచ్చుకదా, నీ కంతగా యిక్కడికి రావాలనివుంటే తోడు ఎవ్వరం లేకపొయ్యామా? ఇంకొంచెం వుంటే పోలీస్ కంప్లయింట్ కూడా యిచ్చివుండే వాళ్ళం!" సస్య అన్నది శిల్ప వంక చూస్తూ.

శిల్ప ఆ మాటలన్నీ వినేదానికి కానీ అసలు ఆలోచించేదానికిగానీ శక్తి లేనట్లు అయి కారు బాక్ డోరు తెరుచుకుని సీటుపై వాలిపోయి కళ్ళు మూసుకుంది.

విజ్జూ, సస్య ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"సస్యా, ఇప్పుడేం మాట్లాడి లాభం లేదు. నువ్వు డ్రైవ్ చెయ్యి" సస్యతో అనేసి తన స్కూటర్ వైపు అడుగులు వేసాడు విజ్జూ.

సస్య బేక్ సీటులో నిస్త్రాణగా పడివున్నట్లున్న స్నేహితురాలి వంకో క్షణం దిగులుగా చూసి కారు స్టార్టు చేసింది.

(ఇంకా ఉంది)



# దింపలేని బరువు

## ఇసుకపల్లి సుజాత

అర్ధరాత్రి పన్నెండు గంటలు కొట్టింది గోడగడియారం. వెంటనే "టక్...టక్" మన్న శబ్దం వినిపించింది.

స్ట్రీట్ లైట్స్ అన్నీ ఉన్నాయి కానీ ఏ ఒక్క బల్బుకూడా వెలగట్లేదు. అంతా చిమ్మ చీకటిగా ఉంది. గదిలో బెడ్‌లైట్ వెల్తురు కింద మంచంమీద ఇద్దరు పిల్లల్తో పడుకున్న సునీతకు మెలకువ రాలేదు.

మళ్ళీ "టక్...టక్" మన్న శబ్దం వినిపించింది.

ఒక్కసారిగా త్రుళ్ళిపడి లేచింది సునీత. అర్ధరాత్రి పూట చప్పుడు వినిపించినందుకు భయపడి మాత్రం త్రుళ్ళిపడలేదు సునీత. గాఢ నిద్రలోంచి ఒక్కసారిగా కలిగిన మెలకువ ఫలితమే ఆ త్రుళ్ళింత. నెమ్మదిగా మంచం మీంచి లేచి ఒక్కక్షణం కూర్చుంది. పిల్లలు లేచారేమోనని మెల్లిగా పక్కకి తిరిగి చూసింది. వాళ్ళు హాయిగా గాఢ నిద్రలో మునిగిఉన్నారు.

"అమ్మయ్య" అని గట్టిగా ఊపిరి పీల్చుకుంది.

తలుపు తీయటానికి కాబోలు లేచిలైట్ వేసింది.

భయంగా అటూ ఇటూ కలయచూస్తూ దడదడలాడుతున్న గుండెతో గజగజ వణుకుతున్న కాళ్ళతో అడుగులో అడుగువేస్తూ మాత్రం తలుపు తీయలేదు సునీత.

తాపీగా మంచం మీంచి లేచి తీరిగ్గా వెళ్ళి ఏ జంకూ గొంకూ లేకుండా అమాంతం తలుపు తీసింది సునీత.

కారణం?

ఆ సమయానికి ఇంటి కొచ్చేది తన భర్తేనని ఆమెకు బాగా తెలుసు. తలుపు తీయగానే దభాలున సునీతమీద తూలిపడ్డాడు మంగపతి. ఆ అదురుకి కిందపడకుండా తనను తాను సంబాళించుకుంటూ వాసన భరించలేక ముక్కు మూసుకుంది.

వెంటనే భర్త చేతిని తన భుజాలమీద వేస్కుని నెమ్మదిగా నడిపించుకుంటూ తీస్కెళ్ళి మంచం మీద పడుకోబెట్టి బూట్లు విప్పి మొహాన నీళ్ళుకొట్టి అన్నం తినిపించి దుప్పటికప్పి పడుకోబెట్టడం వంటి చర్యలు సినిమాల్లో నటించే పతివ్రతలకే సాధ్యమవుతాయి కాని నిజ జీవితంలో అలా చెయ్యటం కష్టం అని నూటికి నూరుపాళ్ళు నమ్మిన మనిషి సునీత.

అందుకే భర్త మీదపడగానే నెమ్మదిగా కింద పడకుండా పక్కకి తప్పుకుంది.

మంగపతే తూలుకుంటూ వెళ్ళి మంచంమీద పడ్డాడు. పదేళ్ళనుండీ ఇది అలవాటే అయినా రాను రాను సునీతకి మంగపతి వ్యవహారం చెడ్డ చిరాకు కలిగిస్తోంది.

"ఏ... య్- అన్నం పె-డ-తా--వా" అన్న మాటలు మడతపడిన మంగపతి నాలుక సందుల్లోంచి ఎలాగో తప్పించుకు బైటికొచ్చి పడ్డాయి.

ఆమె యాంత్రికంగా వెళ్ళి భోజనం వడ్డించింది.

* * * *

తెల్లారి లేవగానే మాత్రం

"హాయ్ సున్నీ కాఫీ పట్రావోయ్" అని విలాసంగా చేతిలో పేపర్ పట్టుకుని కుర్చీలో కూర్చుంటూ ఓ ఆర్డరిచ్చాడు మంగపతి.

చేతిలో కాఫీ కప్పుతో బైట కొచ్చిన సునీత

"సున్నీ ఏంటి? సున్నుండల్లాగా అలా పిలవద్దని ఎన్నిసార్లు చెప్పాను. అయినా రేపట్నుంచి మీకలా పిలవాల్సిన అవసరం ఉండదు లెండి" మంగపతి చేతికి కాఫీ అందిస్తూ కాస్త బెదిరించింది.

"ఏంటి.... ఏమైంది ఎందుకలా అంటున్నావ్" కాఫీ కప్పు అందుకుంటూ ఆశ్చర్య పొయ్యాడు మంగపతి.

"ఎందుకేంటి? సాయంత్రం మా పుట్టింటి కెళ్ళిపోతున్నాను."

"పుట్టింటికా" అదిరి పడ్డాడు.

"అవును మొదటి పెళ్ళాం ఉండగా రెండో పెళ్ళాన్ని నేనెందుకు?" ఎదురు ప్రశ్న వేసింది సునీత.

"మొదటి పెళ్ళామా?" నిషా పూర్తిగా దిగింది మంగపతికి.

పేపర్ కిందపడేసి కాఫీ కప్పు టేబుల్‌మీద పెట్టి అమాంతం కుర్చీలోంచి లేచాడు.

"నన్నూ నా మాటను కూడా ఖాతరు చెయ్యకుండా పదేళ్ళ నుండీ ఆ తాగుడు వెంట పడట్లేదూ మీరు. అది మిమ్మల్ని ఏ మందుపెట్టి లొంగ తీస్కుందో గానీ, అందుకే ఆ విస్కీ సీసాయే మీకు మొదటిపెళ్ళాం. నేనిప్పుడు వద్దన్నా మాత్రం ఆ పెళ్ళాం మిమ్మల్ని వదుల్తుందా" కోపంగానే అంది సునీత.

"అంత మాటనకు సునీతా నేను విన్నేను. నేనింక నుండీ ఈ తాగుడు మానేస్తాను" అన్నాడు మంగపతి అనునయంగా.

"ఈ మాటలు పదేళ్ళ నుంచి మీరంటూనే ఉన్నారు. నేను వింటూనే ఉన్నాను. కాని ఇటువంటి ఉపయోగం లేని మాటల్ని మాత్రం నేను చెప్పలేను. తెలీని చిన్న పిల్లలనైతే నయాన్నో భయాన్నో చెప్పి వాళ్ళని మంచి దారికి మళ్ళించగలం. కానీ అన్నీ తెలిసిన మీలాంటి పెద్దవాళ్ళకి ఎవరండీ సిగరెట్లు జబ్బులొస్తాయనీ తాగుడు అలవాటు చేస్కోకండి రోగాలొస్తాయనీ చెప్పించుకోవటానికి మీకు సిగ్గు లేకపోయినా చెప్పటమంటే మాత్రం నాకసహ్యం ఆవేశం ఆపుకోలేకపోయింది సునీత.

"సునీతా .... పెద్దా చిన్నా లేకుండా ఏంటా మాటలు. నీ కేమైనా బుద్ధుందా" అంటూ పట్టరాని కోపంతో చెయ్యెత్తి కొట్టబోయాడు. సునీత విసురుగా చెయ్యి అడ్డు పెట్టింది.

"ఆ మాట నేనే మిమ్మల్ని అడుగుదామనుకుంటున్నాను. అసలు చెయ్యెత్తి నన్ను కొట్టడానికి మీకేం హక్కుందని? మీరేమో రాత్రి తెల్లవార్లూ తాగి తందనా లాడి ఇంటి విషయాలు పట్టించుకోకుండా బలాదూరు తిరిగి రావటం తప్పులేదు గాని ఆ విషయమే నేను నిలదీస్తే తప్పయ్యిందా మీకు? భర్త కాబట్టి భార్య మీద ఇష్టం వచ్చినట్టు పెత్తనం చెలాయించినా ఆమె పడి ఉండాల్సిందే అన్న మీ భర్తల అహం ఉంది చూశారూ అది నేను భస్తే ఒప్పుకోను" ఉక్రోషంతో ఉడికి పోయింది సునీత.

ఇంక మాట్లాడటానికి మొహం చెల్లక చరచరా బైటికెళ్ళి పొయ్యాడు మంగపతి.

పిల్లలిద్దరూ ఓ మూల కూర్చుని జరుగుతున్నదంతా బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారే గాని వాళ్ళకేమీ అర్థం కావట్లేదు.

* * * *

పదేళ్ళ నుండీ వాళ్ళు ఆ ఇంట్లోనే ఉంటున్నారు. చుట్టుపక్కల వాళ్ళని మంగపతి ఎక్కడున్నారంటీ అనడిగితే తెల్లమొహం వేస్తారు గానీ మందుపతి ఎవరంటే అనడిగితే మాత్రం టక్కున సమాధానం చెప్పేస్తారు. మంగపతికి 'మందుపతి'గా అంత పేరుంది. పెళ్ళయ్యే నాటికి కూడా మంగపతికి ఈ దురలవాటున్నా ఎవ్వరికీ తెలీనివ్వకుండా దాచి పెళ్ళి చేసేశారు. ఆ విషయం ఒక్క సునీతకే కాదు సహజంగా ఎవరికైనా కోపం తెప్పిస్తుంది. మంగపతి వ్యవహారమేమీ మారకపోవటంతో ఆ కోపం అగ్నిపర్వతంగా మారి ఇప్పుడు బ్రద్దలవబోతోంది.

చిన్నప్పట్నుంచీ తనకంటూ కొన్ని భావాలను ఏర్పరచుకున్న వనిత సునీత. భర్త భార్య మీద కాస్త అధికారం చెలాయించటం తప్పు అని ఆమె అనదు. అది కాస్త ఎక్కువ పాళ్ళల్లో ఉన్నా ఫరవాలేదు సర్దుకుపోవచ్చునంటుంది. కానీ ఇంటినీ ఇంటి బాధ్యతలను సంసారాన్ని పట్టించుకోకుండా దుర్వ్యసనాల పాలయిన భర్తకి భార్య మీద

అధికారం చెలాయించే హక్కు లేదని బల్ల గుద్ది మరీ వాదిస్తుంది. అటువంటి మొగుడి గురించి జాలి సానుభూతి చూపటం శుద్ధ దండగ అని ఆమె అభిప్రాయం. సునీత పెద్ద చదువు చదివినా ఉద్యోగం చెయ్యకుండానే సంసారాన్ని నెట్టు-కొస్తోంది. సునీత పేరు మీద ఉన్న పొలాన్ని తనకు రాసివ్వమంటాడు మంగపతి. అలా చేస్తే ఆ పొలాన్ని అమ్మేసి అప్పులు తీరుస్తానంటాడు. సునీత తన చేతుల్తో ఆ పొలాన్ని ఇస్తే అమ్మనని మొండికేసింది. అందుకే తనకి రాసివ్వమని మంగపతి పట్టుపడుతున్నాడు.

కానీ ఆ పొలాన్ని అమ్మేది అప్పులు తీర్చటానికి కాదని సునీతకి తెలిసింది. అది స్వయంగా మంగపతి చెప్పలేదు. చెప్పడు. అతను మనసులో అనుకున్న-వన్నీ డైరీలో రాసే అలవాటుందతనికి. ఆ డైరీని పైకి కనబడనివ్వకుండా జాగ్రత్తగానే దాచాడు కానీ ఈ మధ్యనే పొరపాటున అది సునీత కంటపడింది.

ఆమె మనసు వికలమయ్యింది.

పొలం అతనికి రాసిస్తే ఈ దురలవాట్లతో మరింత పతనమవటం ఖాయం. ఒకవేళ రాసివ్వక-పోయినా రోజురోజుకీ దిగజారటం మాత్రం తప్పదు. అతనికి ఎవరు చెప్పినా వినే స్థితి దాటిపోయింది.

అలా ఆలోచిస్తుండగానే మంగపతి తలుపు తట్టాడు. పొద్దున వెళ్ళిన మనిషి అర్ధరాత్రి పన్నెండు దాటాక ఇంటికొచ్చాడు. ఏదో దృఢనిశ్చయం చేసుకున్న దానిలా లేచి తలుపు తీసింది. తూలుతూ మీద పడటం వగైరాలన్నీ మామూలే. కాకపోతే ఆ రోజు మాత్రం మంగపతికి స్వయంగా తనే అన్నం తినిపించింది సునీత.

మంగపతిని కూర్చోబెట్టి అంతకుముందే సిద్ధం చేసి ఉంచుకున్న కాగితాన్ని తెచ్చి సంతకం పెట్టమని భర్త చేతికిచ్చింది.

ఎందుకో ఆమె చేతులు వణికాయి.

"ఏ ...ఏ ... వి..టది" మంగపతి కాగితాన్ని అస్తవ్యస్తంగా పట్టుకుని అడిగాడు.

డోస్ ఎక్కువయినట్టుంది.

కాగితాన్ని సరిచేసి పెన్ను కూడా అతని చేతికిచ్చి-

"పొలం మీ పేర్న పెట్టమన్నారుగా అందుకే....

ఇంక మాట్లాడ లేకపోయింది.

కంటనీరు రాలేదు గానీ ఒక విధమైన నిర్లిప్తత విరక్తి మొదలైన భావాలన్నీ ఆమె మొహంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అబ్బ.... ఎ..నా...ళ్ళ..కి" అంటూ సంబరంగా సంతకం పెట్టి మంచం మీదపడి నిద్రపొయ్యాడు మంగపతి.

తెల్లారి లేచి చూసేసరికి సునీత పిల్లలు ఎవ్వరూ ఇంట్లో కనిపించలేదు. అయోమయంగా పెరట్లోకి వాకిట్లోకి వెళ్ళి వెతికాడు. కానీ ఎక్కడా వాళ్ళు కనిపించలేదు.

మొదటి భార్య (విస్కీసీసా)నే నెత్తి మీద పెట్టుకుని ఊరేగండి అని రెండవ భార్య (సునీత) విడాకులిచ్చి వెళ్ళిపోయిన సంగతి పాపం మైకంలో సంతకం పెట్టిన మంగపతి కేం తెల్సు? □






**ర**మేష్ వ్రాసిన వుత్తరం చదివి, దాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు. అతడ **అనేకసార్లు ఆమెతో** ఈ విషయం కదపాలని ప్రయత్నించి , అదే సమయంలో **మూడో** మనిషి ప్రవేశంతో విరమించుకున్నాడు. అలా కొన్నిసార్లు జరిగాక **యెప్పుడైనా** యింటికి వెళ్ళి మాట్లాడాలని నిర్ణయించుకున్నాడు గానీ చాలా **రోజుల** నుండీ రాధ పెళ్ళి సందర్భంగా తీరిక చిక్కలేదు.

రమేష్ నుండి లెటరు అందుకున్న సాయంత్రమే "డాక్టర్ విద్యా మీతో **మాట్లాడాలి.** మీ యింటికి యెప్పుడు రావచ్చును" అన్నాడు.

**ఆమె** కళ్ళెత్తి అతన్ని పరిశీలనగా చూసింది.

"ఏ ఆదివారంనాడయినా నేను ఖాళీగా వుంటాను."

"వచ్చే ఆదివారం రావచ్చునా?"

"తప్పకుండా."

"థాంక్స్".

విద్య వద్దకు బయలుదేరిన కృష్ణచైతన్య వద్దకు వచ్చి ప్రభాత "ఎక్కడకు **మావయ్యా**" అంది.

"డాక్టర్. విద్య యింటికి వెళ్తున్నాను".

"నేనూ వస్తాను."

"నేను పనిమీద వెళ్తున్నాను. ఈసారి యిద్దరం వెళ్దాం "

"నన్నేమో యీ రోజు ఫిల్మ్‌కు తీసుకువెళ్తానన్నావు" నిష్ఠూరం ధ్వనించిందామె స్వరంలో

**ఆమె** జూన్‌లో కాలేజీలో చేరినప్పటి నుండీ ఆమెలో క్రమంగా వస్తున్న **మార్పును** కృష్ణచైతన్య గమనిస్తూనే వున్నాడు. పూర్వం వున్నంత బెరుకు, **బిడియం** యిప్పుడామెలో తగ్గినాయి. అంతకుముందు యెక్కడికైనా వెళ్ళల్సి **వుంటే** కృష్ణచైతన్య చెప్పేవరకూ నిర్లిప్తంగా వుండేది. **అతడు** చెప్పాక అమ్మమ్మ వద్దకు **వెళ్ళి** "వెళ్ళనా?" అని అనుమతి **తీసికొనేది.** ఇప్పుడు తనకు తానుగా "**నేనూ** వస్తానన**డం**" నేర్చుకుంటోంది. అదీగాక రాధ పెళ్ళి చేసుకుని శరత్‌తో వెళ్ళాక **ఆమెకు అతని** వద్ద చనువు మరింత అధికమయ్యింది.

"రేపు తీసుకు వెళ్తాను" అన్నాడు నవ్వుకుంటూ.

ప్రభాత **అతని** వద్ద తీసుకుంటున్న స్వతంత్రానికి అతడెంతగానో సంతో**షి**స్తున్నాడు.

కృష్ణచైతన్య కారు యింటి ముందు పార్కు చేసి గేటు తీసుకుని వెళ్ళి కాలింగ్ **బటన్** నొక్కిన వెంటనే తలుపులు తెరచుకున్నాయి.

**అంటే** విద్య ఎదురు చూస్తోంది.

**తను** చెప్పే విషయం పట్ల ఆసక్తి కలిగి వున్నది అనుకున్నాడు లోపలకు **వెళ్తూ.**

"రండి" చిరునవ్వుతో ఆహ్వానించింది.

"ఇల్లు తేలిగ్గా కనుక్కున్నారనుకుంటాను." అంటూ లోపలకు వెళ్ళి టీతో పాటు బిస్కట్లు యిచ్చింది.

గదిని ఒక్క చూపుతో పరిశీలించి "మంచి టేస్టే" అనుకున్నాడు.

**"చెప్పండి కృష్ణచైతన్యగారూ!"** వచ్చిన విషయం గుర్తు చేసింది. **కృష్ణచైతన్య** నాంది వాక్యాలు పనిచెయ్యవనుకుని సూటిగా వచ్చిన విషయం **ప్రస్తా**వించాడు.

**అతడు చెప్పేదంతా** యెలాంటి సంచలనానికి లోను కాకుండా విని చివరకు-

**"ఐయాం సో... సారీ కృష్ణచైతన్యగారూ!"** అంది తేలిగ్గా.

**అతడు నిటారుగా కూర్చున్నాడు.**

**"మీరు నేను చెప్పిన విషయం ఆలోచించనైనా లేదు."**

**"అవసరం లేదండీ."**

**"అంటే.... సారీ మిమ్మల్ని వత్తిడి చేసి మీ చేత చెప్పించాలని కాదు."**

**"...."**

**"మీరే మాత్రం యోచించకనే నిర్ణయించుకుంటున్నారు.** కొంచెం **సమయం తీసుకుని ఆలోచించండి. అప్పుడుకూడా** మీరు కాదనే **అంటే నేను చెప్పగలిగిందేమీ లేదు కానీ ఆలో**చించమని ప్రార్థిస్తున్నాను."

**అతడు లేచి నుంచున్నాడు.**

**ఆమె నమస్కరించింది.**

**అతడు నిష్క్రమించాక యేకాంతం కలిగించిన చీకట్లో ఆమె నిస్సత్తువగా జారిపోయింది.**

ఆమె సృష్టి చేసిన వ్యామోహాన్ని నిస్సహాయంగా స్వీకరించింది.

మనసుతోనూ, జీవితం అందించిన చేదు సత్యాలతోనూ, అవి కలుగచేస్తున్న అలజడితోనూ పోరాటం.. .పోరాటం అలసిపోయింది.

బ్రతుకు భారమై, వొంటరితనం శాపమై ఆమెను వేధిస్తుంటే ఆ భారాన్ని తగ్గించగలిగే చల్లని స్నేహాన్ని కాంక్షిస్తోంది

* * * * *

కృష్ణ చైతన్యగారూ!

క్రొత్తగా వున్న దస్తూరినీ, సంబోధననూ గమనిస్తూనే క్రింది సంతకంకోసం వెతికాడు ఆ వుత్తరం విద్యనుండి వచ్చింది. ఆమె నాలుగు రోజులనాడే నెలరోజులు శెలవుపెట్టి స్వగ్రామం వెళ్ళింది. అప్పుడు మాట్లాడే అవకాశమే యివ్వలేదు. ఇప్పుడీ లెటరు

కృష్ణచైతన్యగారూ!

నేను లాంగ్‌లీవ్ పెట్టిన విషయం తెలుసుకుని మీరు నాతో మాట్లాడాలని ప్రయత్నించి విఫలమవటం గుర్తించాను. మన మధ్యనున్న స్నేహాన్నీ, మీ యందు నాకు గల గౌరవాన్నీ పురస్కరించుకుని వ్రాస్తున్నాను. నా జవాబు విని ఆ రోజు మీరు సంతుష్టులు కాలేకపోయారు అంటే మరి కొంత చెప్పాల్సిన బాధ్యత నామీద వుంది

జరిగిన కథ-13 : అక్క కూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ. రామస్వామి, ప్రభావతమ్మల పెద్ద కొడుకు కృష్ణచైతన్య. అతనికి ప్రభాతంటే అమితమైన అభిమానం. కృష్ణచైతన్య తమ్ముడు నందకిశోర్ తనో కన్నడ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు అన్నతో చెప్తాడు. కృష్ణచైతన్య చిన్ననాటి స్నేహితుడు శరత్. శరత్ రాధలు ఒకరి పట్ల ఒకరు ఆకర్షితులవుతారు. తన డిపార్టుమెంటు వారంతా అజంతా, ఎల్లోరా వెళుతూంటే రమేష్, ప్రభాతలను తమతో కూడా తీసుకెళ్ళిన కృష్ణచైతన్య అక్కడ వారికి డా. విద్యను పరిచయం చేసాడు. రాధ శరత్‌తో వెళ్ళడం చూసిన కృష్ణచైతన్య రాధకి ఇక పెళ్ళి చేయాలని తల్లితో చెపుతాడు. రమేష్ డా. విద్యను తను ప్రేమిస్తున్నట్లు కృష్ణచైతన్యకు ఉత్తరం రాసాడు. కృష్ణచైతన్య ప్రభాతకు ఎగ్జిబిషన్‌లో ఒక మంచి చిత్రాన్ని కొని తెస్తాడు. రాధ పెళ్ళి శరత్‌తో జరిగిపోతుంది.

చదువుకోసం కాలేజీలో చేరిన నాటినుండీ ప్రేమ, పెళ్ళి విషయమ్మై తోటి పిల్లలనుండి, హితులనుండి, సన్నిహితులనుండి విన్నపాలు వినడం నాకు అలవాటైపోయింది. జవాబు యెప్పుడూ స్పష్టంగానే వుండేది. ఈసారి అంతే జరిగింది. అందరిలాగే మీరూ అసంతృప్తి చెందారు

ప్రతి మొగ్గా రేకులు విప్పి విచ్చుకుంటుంది. సృష్టిలోని మాధుర్యాన్ని నింపుకుని పరిపూర్ణతను సాధించు కుంటుంది. నేను విరియని మొగ్గను. మొగ్గగానే రాలిపోయే జీవిని

ఈ శతాబ్దంలో, మెడికల్ సైన్సు యెంతగానో అభివృద్ధి చెంది యెందరో జీవితాల్లో వెన్నెల కురిపించింది. మనసుల్లోని చీకటిని పారద్రోలి వెలుగు నింపింది ఆయినప్పటికీ యీ సృష్టి, విధి మానవుని కన్నా, అతని సాధన, కృషికన్నా శక్తివంతమైనది. ఆ సృష్టి వైపరీత్యాలకు నేనొక వుదాహరణను మాత్రమే.

ప్రతి బాలికలా నేను.. యెలా చెబితే మీ కర్థమౌతుంది? నేను. . యుక్త వయస్కురాలిని కాలేకపోయాను

డాక్టర్లను సంప్రదించారు. మందులు, వైద్యం. యెన్నెన్నో గొడవలతో విసిగిపోయానే తప్పించి ఫలితం పొందలేక పోయాను. ఈ దేశంలో పేరు ప్రఖ్యాతులు గడించిన గొప్ప గొప్ప డాక్టర్లందరికీ నన్ను చూపించారు. అమెరికాలో వున్న అక్కయ్య క్రొత్తగా కనుగొనబడిన మందులను పంపింది. ప్రయోజనం లేకపోయింది. ఈ జీవితానికి నేను యింతేను. మోడుపోయిన మొక్కను. అది చిగురించదు,పుష్పించదు, ఫలించదు.

అమ్మ యేడ్చి యేడ్చి కుళ్ళిపోయింది. నేను? నేనేమీ కాలేదు. మనసు మాత్రం యెండిపోయింది. ఆ మనసులో వుండవలసిన సహజమైన వలపు తేమ యెండిపోయింది బంధువులు చాలాకాలం విచిత్రంగా చెప్పుకుని....చెప్పుకుని వారికీ ముచ్చట పాతబడిపోగా మానివేశారు

ఈ నిజాన్ని గుండెల్లోనే కప్పిపెట్టుకుని యెందరో సన్నిహితులను, మిత్రులను తిరస్కరించాను. ఈ కఠోర సత్యాన్ని విని నన్నెవరు పెండ్లాడుతారు? ప్రతి పురుషుడూ తన ప్రియ బాంధవిని తన పిల్లల తల్లిగా చూడగోరతారు. కొంతకాలం సుఖంగానే గడచినా క్రమేణా పిల్లలులేని కొరత వారి జీవితాలకు శాపంగా పరిణమిస్తుంది. తెలిసి తెలిసి యెవరి మనసుల్లో నిప్పులు కురిపించను? ఈ అందమైన శరీరం సృష్టికి పనికిరాదు. ఈ అద్భుత సౌందర్యం వెనుక దాగివున్న వేదను, విషాదాన్ని గమనించండి. చూపరులకు మిరుమిట్లు గొలిపే ఈ అందం లేకుండా ప్రకృతి సహజత్వాన్ని నేను కలిగివుంటే... ప్చ్. ..



జరుగని వాటి గూర్చి యోచన వ్యర్థం. ఈ చేదు నిజం నా జీవితంలో ఒక భాగమై నా బ్రతుకును నిరర్థకంగా సాగిపొమ్మని నిర్దేశిస్తోంది.

అప్పుడప్పుడు యీ యేకాంతం భీకర రూపం దాల్చి మనసును చిత్రవధ చేస్తుంది. అలాటి బలహీన సమయంలో, మనసు ఆ యేకాంతాన్ని చీల్చి చెండాడ గలిగే స్నేహాన్ని కాంక్షిస్తుంది. అలాంటి వొకానొక తరుణంలోనే మీకీ లేఖ వ్రాస్తున్నాను. నా మనసులోని భారం దిగిపోయింది. మీరు నా బాధలో భాగం తీసుకున్నారు కదా! అంచువలన మరలా నిశ్చలత్వానికి చేరుకుంటూంది.

మీ స్నేహితుడు నాతోపాటు నేను పంచి యివ్వగలిగే చేదును కూడా స్వీకరించను సిద్ధంగా వుంటారన్న విశ్వాసం మీకుంటే ఆయనకీ విషయం తెలపండి; లేదా, స్నేహితురాలిగా మీతో నా బాధ పంచుకున్నానని తలచి నా కోసం వొక్క క్షణం జాలిపడి వెంటనే మర్చిపోండి.

ప్రస్తుతం అమ్మ ఆరోగ్యం బాగాలేదు. అలవాటైన పనిలేక విసుగ్గా కూడా వుంది. మిమ్మల్ని గూడా విసిగించానేమోనని అనుమానంగా వుంది. అలాగైతే.... క్షమించండి.

విద్య

కృష్ణచైతన్య మనసు సానుభూతితో నిండిపోయింది. ఆమె వేదనను అర్థంచేసికుని ఆమె హృదయ భారాన్ని కొంత స్వీకరించాడు.

ఇప్పుడతడు చేసేది యేమీ లేదు. తన నిశ్చయాన్ని రమేష్ యిప్పటికే మరోలా భావించుకున్నాడు. ఇప్పుడు తాను క్రొత్తగా అతనికి తెలియజేయవలసింది యేమీలేదు. అయినా శాంతియుతమైన, సుఖప్రదమైన జీవితానికి బాటవేసికుంటాను" అన్న రమేష్ విద్యను స్వీకరిస్తాడా? ఏ నిర్ణయానికీ రాలేక అతడు తలభారంతో కణతలు నొక్కుకున్నాడు.

ప్రభాత కాలేజీలో చేరినప్పటినుండీ అతడు రోజూ ఆమెను కాలేజీ దగ్గర దింపి, సాయంత్రం వచ్చేటప్పుడు తీసికుని వస్తున్నాడు. ఈ రోజు అనివార్య కారణాలవల్ల అతనికి ఆలస్యం అయ్యింది. కాలేజీ ముగిసి చాలా సేపయ్యింది. లెక్చరర్లూ, విద్యార్థులూ వెళ్ళిపోయారు. ప్రభాత మాత్రం చెట్టుక్రింది కూర్చుని అతనికోసం నిరీక్షిస్తూనే వుంది. అతనితో గాకుండా ఆమెకు యింటికి వెళ్ళడం యిష్టంగాలేదు. క్షణాలు, నిమిషాలై గంటలక్రింద రూపొందుతుంటే ఆమెలో నిస్పృహతో పాటు ఆందోళన స్థానం చేసికుంది. ఆందోళన క్రమక్రమంగా అధికమౌతోంటే యూనివర్సిటీకి ఫోన్‌చేసింది. సమాధానంలేదు. ఎవ్వరూ రిసీవ్ చేసికోను లేరంటే ఆ సమయంలో మీటింగు, పార్టీల్లాంటివి యేమీ లేనట్టు? మరి మామయ్య?

ఇంటికి ఫోను చేసింది.

"హలో" – ప్రభావతమ్మ కంఠం.

"అమ్మమ్మా మామయ్య యింటికి వచ్చారా?" ఆమె కంఠం వణికింది.

ఆ విషయం ప్రభావతమ్మ దృష్టిని దాటలేదు.

"ఇంకా రాలేదు. నువ్వింకా అక్కడేం చేస్తున్నావు. వచ్చెయ్యి."

"అలాగేనని ఆమెతో అందిగానీ ప్రభాత యింటికి వెళ్ళే ప్రయత్నం యేమాత్రం చేయలేదు. "మామయ్య వస్తారు" అనుకుంది.

మరో అర్థగంట గడిచాక కృష్ణచైతన్య కారు వచ్చి ఆమె ముందు నిలబడింది. అతడు బాగా అలసిపోయినట్టున్నాడు.

ప్రభాత తలుపు తీసికుని యెక్కి అతని ప్రక్కన కూర్చుంది.

"ఇంకా నా కోసం చూస్తున్నావా?"

అతని కంఠంలోని మార్దవం ఆమె మనోభావాలమీద ప్రభావం చూపుతూ వుండగా "ఔ"నన్నట్లు తలవూపింది.

"ఈ రోజు నిజాం కాలేజీలో మీటింగేదో వుంటే వెళ్ళాను" సంజాయిషీ యిచ్చుకున్నాడు.

"అలాగైతే యింటికి వెళ్ళివస్తున్నావా?"

"సరాసరి యిక్కడికే వచ్చాను."

తను మామయ్యకోసం నిరీక్షించింది. అతడా విషయాన్ని గుర్తించడమే గాకుండా ముందుగానే వూహించాడు. అలాగే తన మనసులోని ప్రతి ఆలోచననూ గుర్తించగలడా?

అతి జాగ్రత్తగా కారు నడుపుతూ ప్రశ్నించాడు. "ప్రభా నిన్నొక ప్రశ్న అడగనా?"

"అడుగు మామయ్యా."

"పిల్లలు లేకుండా బ్రతకలేరా?"

ఏమాత్రం వూహించని ప్రశ్న కావడం చేత ప్రభాతకు కొంత వ్యవధి పట్టింది.

"చెప్పు ప్రభా."

"బ్రతుకు నిస్సారమై భారంగా మారిపోతుంది."

ఎంత యెదిగి పోయింది ప్రభాత! తను వూహించిన దానికన్నా యెంతో పెరిగిపోయింది. స్త్రీలోని భావాలు, ఆవేశాలూ, ఆశయాలూ యెంతో నిగూఢంగా వుంటాయి.

"ఒక స్త్రీని ఆరాధించిన వ్యక్తి ఆమె మాతృత్వానికి నోచలేదని తెలిస్తే ఆమెను చేపట్టలేడా?"

"ఆ విషయం ఆ వ్యక్తి జీవితాశయాల మీద, అతనికి ఆమెపట్ల వున్న ప్రేమ మీద, చుట్టూవున్న అనేక పరిసరాలమీద ఆధారపడి వుంటుంది. ఏది యేమైనా అతడు జీవితాంతమూ ఆరాధనలో బ్రతకలేడు మామయ్యా. ఆరాధన కేవలం వొక భావన మాత్రమే. నిజ జీవితంలో యెన్నో కావల్సి వుంటాయి. ఎన్నింటి మీదనో ఆధారపడి బ్రతుకుతాడు."

అతడు ప్రభాతను పరీక్షగా చూశాడు. అతని మనో నేత్రం మరేవో మనోహర దృశ్యాలను తిలకిస్తోంది. ఈనాటి చిన్ని ప్రభాత తన పిల్లల తల్లిగా యెనలేని మాతృత్వాన్ని నింపుకుని, ఆ మాతృత్వం ప్రసాదించి పవిత్రతతో నిండుగా పూసిన కొమ్మలా వుంది.

ఈ వూహ అతనికెంతో హాయిని కలిగించి ఆ రోజంతా కలిగిన మానసిక, శారీరక అలసటను పొగొట్టి అతనిలో నూతన చైతన్యాన్ని నింపాయి. ఆ చైతన్యం కలిగించిన వుత్సాహంలో అతనిలో యేవేవో కోరికలు విజృంభించాయి. తనకు అత్యంత సమీపాన కూర్చున్న ఆ ముగ్ధమనోహరను గుండెలకు హత్తుకుని మలబారు తోటల్లోకో, కాశ్మీరలోయల్లోకో పారిపోదాం అనిపించింది.

అతనిలో సంచలనాన్ని గుర్తించని ప్రభాత "ఎందుకీ ప్రశ్న వేశావు మామయ్యా?" అంది.

అతడు తన ఆలోచనలకు స్వస్తి చెప్తూ "యీరోజే మాతృత్వానికి నోచుకోని వొక స్త్రీనిగూర్చి తెల్సుకున్నాను. ఆమెలోని లోపానికి సౌందర్యం మేలి ముసుగును వేయగా, గాంభీర్యం అనే కవచాన్ని, చిరునవ్వు అనే ఆయుధాన్ని చేత బట్టుకుని ఆమె శాపంగా మారిన జీవితంతో పోరాటం సాగిస్తోంది."

ఆ స్త్రీ యెవరో తెలుసుకోవాలన్న కుతూహలాన్ని నొక్కి వేసిందామె.

ఎవరో ఆ స్త్రీ? బహుశాతనకు తెలియకపోవచ్చునామె. లేకుంటే మామయ్యే చెప్పదలచి వుండరు.

ఇంతలో యిల్లు రావడంలో యిద్దరి ఆలోచనలకూ అంతరాయం కలిగింది.

* * * * * * * *

కాలేజీలో చేరిన దగ్గరనుండీ ప్రభాతలో కలిగిన మార్పు ప్రభావతమ్మను కలవర పెట్టింది. పూర్వం రాధకు తోడులా వ్యవహరించే ప్రభాత యిప్పుడు స్వతంత్రంగా మనగలుగుతోంది. మామయ్యతో ఒంటరిగా బయటకు వెళ్ళడం మొదలయ్యాక అమ్మమ్మ దగ్గ అనుమతి తీసికోవడం మానివేసింది. "నేను వెళ్తున్నాను అమ్మమ్మా" అని మాత్రం తెలియజేస్తోంది.

ప్రభావతమ్మ దిక్కు తోచని దానిలా వుండి పోయింది. ఎదిగినవాడు, అన్నీ తెలిసిన వాడు అయిన కొడుకుతో యేమని చెప్పగలదు? చెప్పినా వింటాడా? "తప్పేముందమ్మా" అంటాడు. అతనికి తప్పేమిటో చెప్పలేక







సిగ్గుపడాలి. "లేకుంటే," ఔనమ్మా, ప్రభాత అంటే నాకిష్టం. నేనామెను పెళ్ళి చేసికుంటాను. అని కూడా అనవచ్చు. ఆ మాట ఏదో రోజైనా వినాలి అది నిక్కమని ఆమెకు తెల్సినప్పటికీ ఆ మాట వినను ఆమె జంకుతూనే వుంది. రామస్వామి గారు పట్టీ పట్టనట్టు గమనిస్తున్నారు. మొదట్లో యిచ్చిన సూచన, హెచ్చరిక గాక ఆయన మరలా ఆ ప్రస్తావన చేయలేదు. ఏ క్షణమైనా చేయవచ్చును. ఏమి జరుగనున్నదో!

చెట్టంత కొడుకును వదిలేసి చిన్నపిల్ల, అమాయకురాలైన మనుమ

రాలికేమని చెప్తుంది? సాటి స్త్రీగా, అమ్మమ్మగా తనకది న్యాయమేనా?

అందుకే ఆమె మౌనం దాల్చి జరిగేది గమనిస్తోంది. అవకాశం వచ్చినప్పుడు ప్రభాతకు అర్థం అయ్యేలా పరోక్షంగా మందలించసాగింది. మరి ప్రభాత అమ్మమ్మ చెప్పింది విన్నట్టే కనుపించేది. ఐతే మామయ్య వద్ద తన స్థానాన్ని బలీయం చేసికోను ఆమెకు అమ్మమ్మతో సంబంధం లేకుండా కావాల్సినంత అవకాశం వుంది. ప్రభాత రోజూ సాయంత్రం మామయ్యతో కలసి రావడం కోసమై చిన్న చిన్న త్యాగాలు చేయవలసి వస్తోంది. అతని టైమింగ్స్ కచ్చితంగా వుండవు. ఒక్కోసారి ఆలస్యంగా వస్తాడు ఎంత ఆలస్యమైనా ఆమె అతని కోసం యెదురు చూస్తూ వుంటుంది. కొన్నిసార్లు మధ్యాహ్నమే వస్తాడు. ఆ సందర్భాలలో ఆమె తన క్లాసులు యెగ్గొట్టేస్తుంది. అతడు అడిగితే "యీ రోజు లెక్చరర్ రాలేద"నీ, "లీజర్ పీరియడున్నా"యనో చెప్తుంది. ఈ విషయం కృష్ణచైతన్య పట్టించుకోలేదు గానీ ఆమె స్నేహితులంతా కనిపెట్టేశారు.

ఒకసారి విమల అడిగింది 'మీ అంకుల్ కోసం అలా పడిగాపులు కాచే బదులు నీ క్లాసు ఐపోగానే వెళ్ళవచ్చుగా."

"ఓహ్! నీకింకా తెలియదా విమలా! అంకుల్ అంటే యేమనుకుంటున్నావు?వరుసైన అంకుల్; మేనమామోయ్....మేనమామ" అంది ప్రియదర్శిని.

"మరి చెప్పవేం?" – మరొకరు.

"మీ యిద్దరికీ వయోభేదం చాలా వుంది కదూ!" విమలే తిరిగి ప్రశ్నించింది.

వాళ్ళంతా మామయ్యతో తన బాంధవ్యాన్ని ఖరారు చేస్తుంటే కాదని వాదించలేకపోయింది. ఏదో చెప్పాలని ప్రయత్నించిందే గానీ గొంతుకకు యేమో అడ్డుపడి మాటే రానీయలేదు. వారి హాస్యాలను మూగదానిలా వింటూ కూర్చుంది.

విమల, ప్రియదర్శిని, రోజ్‌లిన్, ప్రభాతలకు మంచి సన్నిహితం యేర్పడింది. ఆ నలుగురిలోనూ ప్రభాత, రోజ్‌లిన్ ప్రత్యేకంగా వుంటారు. ఒకరి పట్ల వొకరికి స్నేహ భావం, సదభిప్రాయం మెండు. రోజ్‌లిన్ గంభీర స్వభావురాలు. చామన ఛాయ., సన్నటి ముక్కు, పెద్ద కళ్ళతో ఆకర్షణీయంగా వుంటుంది. వాళ్ళ నాన్నగారేదో క్రిష్టియన్ మిషనరీస్ ఆర్గనైజేషన్‌లో పెద్ద పదవిలో వున్నారు. విమల, ప్రియదర్శినిల రూపానికన్నా ముందుగా ఆకర్షించేది. వారి చిలిపితనం. సదా సరదాగా వుంటారు. అల్లరి చేసినా బాగా చదువుతారని లెక్చరర్సు కూడా వారంటే యిష్టం నలుగురిలోనూ ప్రభాత వయసులో పెద్దది. వేషాలంకరణలో గూడా భేదం వుండటం వలన ఆమె మరింత పెద్దదానిలా అనిపిస్తుంది. దానికి తోడు మరింత పెద్దవాడైన, రీడరైన మామయ్యను కలిగి వుండటంచేత వారంతా ఆమె పెద్దరికాన్ని ఆమోదించారు. అయినా యెప్పుడు అవకాశం వచ్చినా మామయ్య పేరు చెప్పి గేలిచేయటం మాత్రం మానరు. ఈ విషయంలో విమల, ప్రియదర్శిని బాగా చురుకు. రోజ్‌లిన్ పైకేమీ అనకపోయినా చిరునవ్వుతో వారి అల్లరిని ప్రోత్సహిస్తుంది.

క్లాసులో వొకసారి ప్రభాత సిగ్గుతో చితికిపోయింది. ఇంగ్లీషు లెక్చరర్ విద్యార్థినులు వ్రాసిన ఎస్సైన్‌మెంట్సును కరెక్టు చేసి ప్రభాత వ్రాసినదాన్ని మెచ్చుకుని క్లాసులో అందరికీ చదివి వినిపించారు.

"ఉడ్ బి ఇంగ్లీషు ప్రొఫెసరైతే అందరం వ్రాయగలం" అంది విమల

ఆమె మెల్లగా గొణిగినప్పటికీ లెక్చరర్‌కూ, చాలామంది పిల్లలకూ వినిపించి పాస్ ఆన్ చేయబడింది. పిల్లలంతా ఫక్కుమన్నారు. లెక్చరర్ తలెత్తి "హూ యీజ్ హి?" అని ప్రశ్నించారు

ప్రభాతకు చిరుచెమటలు పట్టగా తడబడుతూ లేచి "మా మామయ్యండీ.....యూనివర్సిటీలో రీడర్" అంది.

ఆమె కంగారుకు మేడం లోలోన నవ్వుకుని ఆ మామయ్య పేరేమిటో అడిగి తెలుసుకున్నారు.

ఆ రోజు మొదలు అల్లరి పిల్లలు ప్రభాతను చూచి "మామయ్య" అనో "అరుగో... మామయ్య వస్తున్నారనో' టీజ్ చేయసాగారు. ఒకసారి కృష్ణచైతన్య ప్రభాత కోసం రెండు నిమిషాలు వెయిట్ చేయవల్సి వచ్చింది. ఒక పదిమంది పిల్లలు అతని కారు చుట్టూ మూగి "మామయ్య కార్లో వచ్చారు. అత్తయ్యేది?" అని స్లోగాన్సు మొదలుపెట్టారు.

కృష్ణచైతన్య తన నవ్వు ముఖాన్ని కిటికీలో నుండి బయటపెట్టి "కోడళ్ళు అల్లరి తగ్గిస్తే అత్తొస్తుంది" అన్నాడు.

అతని రియాక్షన్‌కు ఆ పిల్లలందరూ పరమానంద భరితులై స్లోగాన్సు అధికం చేశారు.

మెట్లు దిగివస్తున్న ప్రభాత వారి స్లోగాన్సు వింటూ అక్కడే ఆగిపోయింది. అప్పుడప్పుడు వాళ్ళంతా చేరి ఆమెను అల్లరి పెట్టినా పైకి కనుపించకుండా సంతసించిందేగానీ కష్టపెట్టుకోలేదు. వారేమో యేకంగా కృష్ణచైతన్యనే ఆటపట్టించారు. అతనికి కోపం వస్తే తననే తిడతాడు. స్లోగాన్సుకు నవ్వుకోనూ అతడేమైనా కాలేజీ విద్యార్థికాదే. "వాళ్ళంతా అల్లరిచేసే అవకాశాన్ని నువ్వెందుకిచ్చావు?" అని కోప్పడితే యేమి జవాబివ్వగలదు?

## స్త్రీ

**అత్త సాధించేదని**
**వాపోయేది ఆమె ఒకప్పుడు**
**అత్త హోదాలో ఆమే**
**కోడలిని వేధిస్తూంది ఇప్పుడు.**

**-కో. వేంకట పాపారావు**

# మౌనవిపంచి

ప్రభాతకు అడుగు ముందుకు పడటంలేదు. విద్యార్థినుల అల్లరి పుధృతమైంది.

"అత్తమ్మ కదలాలి."

"కదిలి రావాలి."

ప్రభాత తనతో వున్న ప్రియదర్శినిని అడిగింది "ప్రియా! నువ్వు నాతో రావే."

ప్రియదర్శిని యిల్లు గూడా కృష్ణచైతన్య వాళ్ళ కాలనీలోనే. ఆమె యెప్పుడూ బస్సులో వచ్చి వెళ్తుంది. కొన్నిసార్లు ఆమె ప్రభాతను సాయంత్రం యింటికి తిరిగి వెళ్ళేటప్పుడు తనతో రమ్మనమని కోరింది. ప్రభాతకు మామయ్యతో కలసి వెళ్తే లభించే ఆనందం ప్రియదర్శినిలో లభ్యంకాదని దృఢంగా తెలుసు. ఆమె నిరాకరణకు ప్రియదర్శిని కోపగించుకోలేదు. "అవున్లే... ఆ పడిగాపుల్లోనే నీకు ఆనందం వుంది" అంది హేళనగా.

ఇప్పుడు ప్రభాత ఆహ్వానాన్ని మన్నించటానికి ఆమె జంకింది. కృష్ణచైతన్యను రోజూ చూడటమూ, ప్రభాత చెప్తే అతన్ని గురించి వినడమేగానీ అతనితో పరిచయంలేదు. తమ వయసుకంటే పెద్దవాడు. రీడర్ పైపెచ్చు గాంభీర్యంగా వుంటాడు. అసలే ప్రభాత కూడా భయపడుతున్న సమయంలో. అతనితో కలసి వెళ్ళడమంటే ?

"అమ్మో" అంది.

"ప్లీజ్.... ప్రియా! నాకోసం... ప్లీజ్"

మిత్రురాళ్ళిద్దరూ వొకరి చెయ్యి మరొకరు పుచ్చుకుని ఆ నాలుగుమెట్లూ దిగి, మందగమనంతో కదలి ఆ కాస్త దూరాన్ని పూర్తి చేసి కారు వద్దకు వచ్చాక మిగిలిన పనిని చకచకా కానిచ్చారు.

గబగబా వెనుక తలుపు తీసి కూర్చున్నాక "వెళ్దాం మామయ్యా" అంది

కృష్ణచైతన్య కారు అద్దంలో ప్రభాతను స్పష్టంగా చూశాడు. ఆమె ముఖం యెఱ్ఱగా కందిపోయింది. ఆయాసంతో వగర్చుతోంది తను వుద్వేగంలో ప్రియదర్శినిని అతనికి పరిచయం చేయడం కూడా మర్చిపోయింది.

కారు వారి యింటికి చేరడానికి ముందు "ఇక్కడ ఆపితే నేను వెళ్తాను" అంది ప్రియదర్శిని.

"ఎక్కడికి వెళ్లాలో చెప్తే తీసికువెళ్తాను."

"అవుసరం లేదండీ. మా యిల్లు యిక్కడే వుంది. చాలా దగ్గర."

కృష్ణచైతన్య కారు స్లో చేస్తూ ప్రభాత యేమైనా చెప్తుందేమోనని చూశాడు. ఊహుఁ! ఆమె యీ లోకంలో లేదు.

ప్రియదర్శిని దిగి "థ్యాంక్యు" చెప్తున్నప్పుడుగానీ ఆమెలో కదలికలేదు.ఆమెకు నో మెన్షన్ చెప్పి కృష్ణచైతన్య కారును యింటి వైపుకు పోనిచ్చాడు.

ఇంతకాలంగా ఆమె పట్ల గాఢానురక్తుడైనప్పటికీ అతడెప్పుడూ పెదవి విప్పి ప్రకటించలేదు. ఆమె మనసును గూడా పూర్తిగా తెలుసుకున్నాక, అనుకూల వాతావరణం యేర్పడ్డాక యింట్లో చెప్పి ఆమెను వివాహమాడ నిశ్చయించుకున్నాడేగానీ తమ నీడన తలదాచుకున్న ఆ పిల్లతో ప్రేమ పూసలు చెప్పడం భావ్యం కాదనుకున్నాడు అయితే యీ రోజు ప్రభాత క్లాసుమేట్సు చేసిన ఆగడం అతనికో కిక్ యిచ్చింది. సర్వం మరిచి అతడు వారి అల్లరిని భరించి ఆనందించాడు. అతనిలో యెంత వుషారు కలిగిందంటే ప్రభాత కనుక తనతో తన మిత్రురాలిని కనుక వెంటేసుకుని రాకుంటే అతడు తన నిగ్రహాన్ని, నిశ్చయాన్ని సడలించి ఆమెతో యేదో చిలిపి సంభాషణ చేసేవాడే.

వారు యింట్లోకి ప్రవేశించేసరికి డ్రాయింగ్ రూంలోనుండి నవ్వుల కలకల వినిపిస్తోంది.

"అదిగో.... కృష్ణ వచ్చేశాడు" అంటోంది ప్రభావతమ్మ.

"ఎవరో" అనుకుంటూ డ్రాయింగ్ రూంలోకి అడుగుపెట్టాడు కృష్ణచైతన్య ప్రభాత హాయిగా వూపిరి పీల్చుకుని లోపలకు వెళ్ళింది.

లోపలకు వెళ్తూనే "యిన్నాళ్ళకూ" అంటూ మిత్రుని కుర్చీ వద్దకు వెళ్ళి అతని భుజాల మీదుగా చేతులు వేశాడు.

"బాగున్నావా కృష్ణా" రవి అతన్ని తన ప్రక్కన కూర్చుండబెట్టుతూ అడిగాడు

"బాగున్నాను కానీ, నువ్వొచ్చి యెంతసేపయ్యింది? అసలు హైద్రాబాద్ యెప్పుడొచ్చావు?"

రవి బదులిచ్చేలోపే "అమ్మా కాఫీ యిస్తావా?" అన్నాడు.

"నాకొద్దు ఆంటీ."

"అదేమిట్రా?"

"నువ్వు రాకముందే నేనూ, అంకుల్ తీసికున్నాం. కదా ఆంటీ?"

"ఒ. కె. నీ బిజినెస్ యెలా వుంది? ఈ మధ్య రమేష్ కలిశాడా?"

"అన్ని ప్రశ్నలకూ వొకేసారి జవాబివ్వడానికే ప్రయత్నిస్తాను. నా బిజినెస్ బాగానే వుంది. రమేష్ యీ మధ్యనే కలిశాడు ఊరెళ్ళి వచ్చినట్లున్నాడు పెళ్ళి వ్యవహారం మీద."

ఈ మాట వింటూనే లేచి వెళ్ళబోయిన ప్రభావతమ్మ కూర్చుని "నీకేమైనా విశేషాలూ తెలుసా?" అంది.

"నాకు వివరాలేమి చెప్పలేదు ఆంటీ. బహుశా మీరు త్వరలోనే శుభలేఖ అందుకుంటారు."

"ఏమిటో వాడికి, వీడికి సమయం రాలేదు." అంది నిరుత్సాహంగా. "వీళ్ళిద్దరి పెళ్ళి చింత బతికెలతో చెయ్యాలోయ్" అన్నారు రామస్వామిగారు.

కృష్ణచైతన్యకు కాఫీ తెచ్చిచ్చి తానూ కూర్చుంది ప్రభావతమ్మ. అంతవరకూ వాళ్ళు రవి బిజినెస్ గూర్చి మాట్లాడుకుంటున్నారు.

"ఆ విషయాలు తరువాతగానీ ముందు అమ్మకి సంగతి చెప్పు. పిల్లలెట్లా వున్నారు?"

"వాడి మాటకేంగానీ పిల్లలు కులాసానా? అమ్మా యెలా వుంది?"

"ఆఁ! అంతా కులాసానే"

"అమ్మాయినీ, పిల్లల్నీ గూడా తీసికు రాకపోయావా?"

"అమెరికానుండి మా చెల్లాయి ఇందిరా, ఆమె భర్తా వచ్చారు. అందువలన కుదరలేదు"

"ఇందిరకు పిల్లలెంతమంది?"

"ఇంకాలేరండీ."

"పెళ్ళయి పదేళ్ళు ఔతూందేమో!" స్వగతంలా అంది.

"కచ్చితంగా పదేళ్ళు."

ఆమె క్కావలసిన కుటుంబ యోగ క్షేమలు విచారించి అక్కడ్నుంచి వెళ్ళిపోయాక.

"నీ రూఫ్ గార్డెన్ యెలా వుంది కృష్ణా?"

హఠాత్తుగా మిత్రుడు వేసిన ప్రశ్నకు జవాబివ్వకుండా లేచి నిల్చున్నాడు. రవి అతన్ని అనుసరించాడు.

"పైకి వెళ్లాక ఇప్పుడు చెప్పు రవీ. అమెరికానుండీ వచ్చిన చెల్లెల్ని, బావమరిదిని వదిలి రావల్సిన అవుసరం యేమిటి?" అన్నాడు.

"ఎవ్వరూ రారు కదా!"

కృష్ణచైతన్య లేచి వెళ్ళి తలుపు గడియ పెట్టాడు.

**(ఇంకా ఉంది)**

# వారఫలం

**22-3-1985 శుక్రవారం మొదలు**
**28-3-1985 గురువారం వరకు.**

★ **మేషం :** వ్యవహారరీత్యా, వ్యాపారరీత్యా, క్రయ విక్రయరీత్యా సర్వానుకూలదాయకం. వారమంతా ఆనందదాయకమని గ్రహింప గలుగుతారు. ప్రయాణమూలకంగా మేలు గడింపనున్నారు. మీ ఆలోచనలు సత్ఫలదాయకములే. స్త్రీలకు : ఉద్యోగరీత్యా అనుకూలం.

★ **వృషభం :** రాజకీయంగా పొందిన అనుకూలతను సద్వినియోగం చేసికోండి. వృత్తియందు సాధించిన ప్రగతిని కాపాడుకోండి: శుభకార్య సన్నాహాలకు ఎలాంటి యిబ్బంది లేదు ముందుకు సాగిపోండి. స్త్రీలకు : కుటుంబరీత్యా యిబ్బందులు రాకుండా చూచుకోవాలి. చుట్టుప్రక్కల గమనించి మసలుకోవాలి.

★ **మిధునం :** ఏది మంచియో, ఏది చెడుగో, గమనించి మరీ మసలుకోవాలి. వృత్తియందు మీకు అనుకూలతగల సమయం. విద్యార్జనకు హఠాత్తుగా సదవకాశాలు లభించటం విశేషమేగా!నలుగురిలో మీ ప్రతిష్ఠ అతిశయించగల అవకాశా లుంటాయి. స్త్రీలకు : ధనధాన్య వస్తువాహన సంపత్తి కవకాశం. ప్రయాణాలుంటే జాగ్రత్త! వస్తువులు పోతాయేమో!

★ **కర్కాటకం :** ఆశించినంత ధాన్య సంపద లభ్యం కాగలదు. ఆరోగ్యరీత్యా కొంత మెరుగు కనిపిస్తుంది. వృత్తిరీత్యా పెంపు కనిపించ గలదు. ఉద్యోగ ప్రగతి ఆనంద సంధాయక మవుతుంది. మిత్ర సహాయం లభ్యం కాగలవారం. స్త్రీలకు :ఇటీవల పోగొట్టుకొన్న వస్తువులు లభ్యం కాగలవనే శుభ వార్త వింటారు.

★ **సింహం :** పెద్దలతో, అంతస్థుగలవారితో, ధనాఢ్యులైన బంధువులతో ముఖ్య విషయాలలో చర్చలు సాగింప గలరు. రాబడియందు కొంత పెంపు కనిపిస్తుంది. విలువైన వస్తువులు సేకరించుకో గలుగుతారు. వ్యాపారమందు తాత్కాలికమైన అవరోధాలను గూర్చి నిరుత్సాహపడకండి. స్త్రీలకు ధనలబ్ధి, నూతనోద్యోగ ప్రాప్తి.

★ **కన్య :** మీ యింట శుభం జరుగనున్నది. బంధు, మిత్ర సహాయం లభ్యం కానున్నది. 'కోర్టు' వ్యవహారం అనుకూలం కానున్నది. సన్నిహితుల వలన మేలు సంభవం కానున్నది. స్త్రీలకు : నూత్న వస్తుసేకరణకు, నూతన వ్యవహారమందు అనుకూలతకు సాయపడేవారం. కుటుంబానందానికి లోటులేదు.

★ **తుల :** ఉద్రేకపూరితం కాగల పరిస్థితు లుంటాయి. ఓర్మి అవసరం. సాహితీరంగాన కొందరకు, రాజకీయ రంగాన కొందరకు అనుకూలమున్నది. ఎంత శ్రమిస్తే అంత మేలు. స్త్రీలకు: నూతన వస్తువులు కొనగలగటం, ఇంట నూతనోత్సాహం, స్వల్పాదాయానికి అవకాశం గలవారం.

★ **వృశ్చికం :** వారమంతా ఉత్సాహజనకం, శుభవార్తా శ్రవణం, ఉత్తరాల మూలంగా అనేక విషయాల్ను గ్రహించటం, మిత్ర సందర్శనం, ఆరోగ్యమందభివృద్ధి. స్త్రీలకు: వస్తు సేకరణకు, వాదోపవాదా లందు విజయసాధనకు అనుకూలత గలదు.

★ **ధనుస్సు :** ద్రవ్యలబ్ధి, ఆరోగ్యమందభివృద్ధి, వ్యాపారమందు మేలు, వ్యవహార రీత్యా అనుకూలం. కుటుంబానందం, ఉద్యోగమందభివృద్ధి, నాట్యకోవిదులకు సదవకాశాలు లభ్యం కావటం గ్రహింపదగిన అంశాలు. స్త్రీలకు: హఠాత్తుగా మంచి మాట వినగలుగుతారు. ఒకవేళ కొందరకు ప్రయాణం తగలొచ్చు.

★ **మకరం :** వ్యవహారమందభివృద్ధి కనిపిస్తుంది. ఎంతో కాలంగా మరుగులో ఉన్న వ్యవహారం బయట పడగలదు. మీకు అనుకూలత కూడా చేకూరగలదు. లలిత కళాప్రియులకు ధనాదాయ మున్నది. స్త్రీలకు : నాట్య మందు ప్రావీణ్యత గలవారికి సదవకాశాలుంటాయి.

★ **కుంభం :** సజ్జన సాంగత్యం, ధనాఢ్యుల ప్రాపకం, రాజకీయరంగాన కొందరకు సర్వానుకూలత చేకూరగలదు. అప్పులు వసూలగుటకు అనుకూల సమయం. కొందరు దూర ప్రయాణాలు చేయగలుగుదురు, తద్వారా మీకు లాభించుట గమనిస్తారు. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి.

★ **మీనం :** పది మందిలో మంచి పేరు తెచ్చుకోగల అవకాశా లున్నాయి. మహా ప్రజ్ఞావంతులుగాన మీ మాటలకు యితరులు నిరుత్తరులు కాగలరు. లావాదేవీలందు మీకు అనుకూలమైన వారమే. స్త్రీలకు: ఉద్యోగ మార్పులు గాని, స్థల మార్పుగాని చెప్పదగిన అంశం, స్వల్పాదాయం కద్దు. ఆరోగ్య రీత్యా జాగరూకత వహించవలె.

**-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**

# వ్యక్తిగతం



రాజేంద్ర సేతియా (35) లండన్‌లో నివసిస్తున్న భారతీయుడు. ఈయన నడుపుతున్న ఈసల్ గ్రూప్ వ్యాపారసంస్థలు దివాలా తీయడంతో దాదాపు 238 కోట్ల అప్పులపాలై పోయాడు ప్రపంచంలో ఇంత పెద్ద ఎత్తున దివాలా తీసిన వ్యక్తి గతంలో ఎవరూ లేరు. ఈయన పేరు గిన్నెస్‌బుక్‌లో ఎక్కింది. ఈయనకి అప్పు పెట్టిన వాళ్లు ఒక్క లండన్‌లోనే కాక, ఢిల్లీ, లాగోస్, న్యూయార్క్‌లలో కూడా ఉన్నారు. జాతీయం చెయ్యబడిన భారతీయ బాంకులు కూడా అందులో ఉన్నాయి. ఒక్క పంజాబ్ నేషనల్ బాంక్ మాత్రమే రు. 140 కోట్లు పైగా అప్పు ఇచ్చిందట. సెంట్రల్ బాంక్ ఆఫ్ ఇండియా, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కొంత తక్కువ ఇచ్చాయి. ఈయనకి ఉత్తర లండన్‌లోని హెండన్‌లో 'వైట్ హవుస్' అనే రు. 28 లక్షల ఖరీదు చేసే ఓ ఇల్లు ఉంది. కానీ దాన్ని వదలిపెట్టి హాంప్‌స్టెడ్ దగ్గరున్న ఓ పల్లెటూర్లో అంతకన్నా మరింత విశాలమైన రు. 168 లక్షల ఖరీదైన నివాసానికి మారటానికి ఏర్పాట్లు చేసుకున్నాడట. వినోదం కోసం ఆయన పెట్టే ఖర్చు విపరీతంగా ఉంటుంది. ఈసల్ సంస్థ కోసం రు. 504 లక్షలు పెట్టి ఒక బోయింగ్ 707 విమానాన్ని కొని, అందులో బెడ్‌రూం, స్నానాల గదులకి బంగారు కొళాయిలు అమర్చడానికి, పడగ్గదుల్ని అత్యద్భుతంగా తీర్చిదిద్దటానికీ మరో రు. 84 లక్షలు ఖర్చు పెట్టారు. బాంక్‌ల వారికి పశ్చిమాసియా వినోద పర్యటనకి గతంలో ఒకసారి దానిని ఉపయోగించారట. ఇటీవల దానిని అమ్మకానికి పెడితే రు. 70 లక్షల కంటే మించి రాదని తేలింది. సేతియా ఆశావాది కాబట్టి శ్రీ రాజీవ్ గాంధీ కొత్త ప్రభుత్వం ఏర్పడగానే తన అదృష్టాన్ని పరీక్షించుకుందామని ప్రయత్నం చేశారు. కానీ ప్రణబ్‌ముఖర్జీని ఆర్థిక శాఖ నించి తీసి వేయడంతో, కొత్త మంత్రివర్గంలో సేతియా మిత్రులెవరూ లేకుండా పోవడంతో ఆ ప్రయత్నాలు ఫలించలేదు. అయినప్పటికీ 'సేతియా' తన విలాస జీవితాన్నేమీ తగ్గించుకోలేదనే అనిపిస్తున్నది. ఇటీవల ఆయన ఢిల్లీ వచ్చినప్పుడు ఒక రాత్రికి రు. 3000/- లు అద్దె చెల్లించి మౌర్య షెరటాన్ హోటల్‌లో ఉండి వెళ్లారు.... □



# బలి

ఆకుండి సాయిరామ్

ప్రచండంగా నిప్పులు క్రక్కుతున్న సూర్యుడి ధాటికి తట్టుకోలేక చెమటలు క్రక్కుతున్న ఆ బాలుడు వడివడిగా అడుగు లెయ్యసాగేడు....

మిక్కుటమైన ఎండకు ఆ లేతముఖం ఎర్రగా కందిపోయింది... నేలవేడికి ఆ తొమ్మిదేళ్ళ బాలుడి పాదాలు చురుక్కు మంటున్నాయి.....చెమటలు ముఖం మీంచి జారి ఆకుర్రవాడి ఛాతీపై, చేతులపై వున్న వీభూధి నామాలను చెరిపేస్తున్నాయి...

భుజాన వున్న చిరుగుల సంచీ, నడుముకి వున్న చీలికల పంచె ఆబాలుడు బిక్షగాడని తెలియజేస్తున్నాయి.....

గబగబా వల్లభపురం వేపు అడుగులు వేస్తున్న ఆచిన్నారి హృదయంలో వయసుకి మించిన ఆలోచనలు!–

అబాలకుడి పేరు కాళిదాసు!. .. వాడికి తల్లీ ,తండ్రీ వున్నారు. ..

కాళిదాసు తండ్రి దీక్షితులు......ఏడాదిక్రితం వాళ్ళు అక్కడకు చాలా దూరంలో వున్న గ్రామంలో వుండేవారు ... దీక్షితులు అక్కడ తలదానం పట్టే బ్రాహ్మడు!... యాచనకూడా అతని వంశపారంపర్య వృత్తే!–

కాని వాళ్ళ దురదృష్టం కొద్దీ హఠాత్తుగా ఓ రోడ్డు ప్రమాదంలో దీక్షితుల రెండు కాళ్ళూ పోయాయి......

"తలదానం పట్టే వాడు సరైన జపం చేసుకోవద్దూ.... బెడిసికొట్టింది..." అన్నారందరూ....

మరి ఆ వూళ్ళో అతనికి గింజలు పుట్టలేదు... భార్యా, కొడుకుతో వల్లభపురానికి చేరాడు....ఆ వూరికి క్రోసుదూరంలో చిన్న గుడిసెను నిర్మించుకొని, కొడుకు యాచించగా వచ్చిన దాంతో జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నాడు....

గతాన్ని ఆలోచిస్తూ నెమ్మదిగా వల్లభపురంలోనికి ప్రవేశించాడు కాళిదాసు....

వల్లభపురంలో ఇంచుమించు ఓ నూటఏభై గడప లుంటాయి... కాని అందులో యాచకుల కుప యోగ పడేవి ఓ పదిహేను మాత్రమే!–

అవూరి మున్సబు, కరణం, ప్రెసిడెంటు, మోతుబరుల ఇళ్ళకు వెళ్తూ తనకు వచ్చిన శ్లోకాలనూ, పద్యాలనూ గొంతుచించుకుని వల్లెవేశాడు.... కొంత మంది భిక్షం వేశారు.... కొంతమంది కసిరి పొమ్మన్నారు!–

యాచన పూర్తయ్యేసరికి ఓ తవ్వెడు బియ్యం.- కొన్ని కూరగాయలు అతని సంచిలోనికి చేరాయి.....

సంతృప్తితో వెనుదిరిగి గృహోణ్ముఖుడవబోతున్న వాడు రచ్చబండవద్ద సమావేశమైవున్న ఊరిపెద్దలను చూసి, దగ్గరగా వెళ్ళి వారి మాటలు ఆలకించసాగేడు.... .

చాల ఏళ్ళ తర్వాత ఆ సంవత్సరం వారు చెయ్యబోయే నూకాలమ్మ జాతర గురించి చర్చించుకునేందుకు అవూరి పెద్దలు సమావేశమయ్యారక్కడ!–

"ఈ కొత్త అమాశకి జాతర చేస్తే బాగుంటాది కామయ్యా......"అన్నాడో మోతుబరి.....

చాలామంది అలాగే సూచించారు......

ప్రెశిడెంటు కూడా "వచ్చే కొత్త అమాశకు జాతర చేద్దాము....ఈ సారి ఆడంబరంగా చెయ్యాల.... ఇప్పట్నుంచే పన్లు మొదలెట్టాల.....ఎక్కువ చందాలు వసూలుచేసి భారీ ఎత్తున చెయ్యాల....." అన్నాడు.....

"అవునయ్యా !.... బస్తీల నుంచి పెద్ద పెద్ద డ్రామాలను, బుర్రకథలు చెప్పేవోర్ని తీసుకురావాల..... తోలుబొమ్మలాట లెయ్యిం చాల.... .

ఇంకా కోడి పందాలు, పొట్టేళ్ళు పందేలు పెట్టిస్తే మహారంజుగుంటాది!....." అన్నాడో యువకుడు.....

అప్పుడే ప్రణాళికలూ, పథకాలూ వేసుకొని చందాల సూళ్ళ కార్యక్రమం మొదలెట్టారు!.....

ఇదంతా గమనిస్తున్న కాళిదాసు మనసు సంతోషంతో తొణికిసలాడింది......

వాడు జాతరల గురించి చాలా విన్నాడు గాని ఎప్పుడూ చూడలేదు!....జాతరలో పులి వేషాలూ తోలుబొమ్మలాటలూ, రక రకాల వింతలూ, విశేషాలూ వుంటాయని వాడికి తెల్సు..... తన అదృష్టం-కొద్దీ జాతర చూసే అవకాశం వచ్చినందుకు ఎంతో ఆనందించాడు....

పరుగు పరుగున గుడిసెకు చేరుకొని తల్లి-దండ్రులకు చెప్పాడు... జాతర జరిగితే తమలాంటి బిచ్చగాళ్ళ కడుపులకు కొన్ని రోజులపాటు నిశ్చింత అనుకున్నారు వారిరువురూ...!

* * *

కాళిదాసు ఎదురు చూసిన రోజు రానే వచ్చింది....!

ముందు రోజే చక్కగా ఉతికిన పంచె గుడ్డను కట్టుకున్నాడు...!

విభూధి నామాలను దండలపైన, నుదిటి పైన, ఛాతీ పైన, దిద్దుకున్నాడు! –

సంచీని భుజాన వేసుకున్నాడు!–

"అమ్మా....నాన్నా... వెళ్ళొస్తాను..." అంటూ బయటికి తుర్రుమన్నాడు!...

వాడికి మహా సంతోషంగా వుంది... జాతరలోని వింతలూ, విశేషాలూ తను ఈ రోజు చూడబోతున్నాడు!...

అలసిపోయినా ఆగకుండా పరుగుతీస్తూ వల్లభపురం చేరుకున్నాడు...

ఎటు చూసినా జనసందోహం!... ఎప్పుడూ నిర్మానుష్యంగా వుండే వల్లభపురంలో నేడు నిల్చోడానికి జాగాలేదు!...

రంగురంగుల, క్రొత్త బట్టలు ధరించి హడావుడిగా, బారులు తీరి సాగిపోతూన్న వేలాది జనం... అంత జనాన్ని ఒక్కచోట కాళిదాసు ఎప్పుడూ చూళ్ళేదు!–

శ్రావ్యంగా మ్రోగిస్తూన్న పిల్లనగ్రోవి టమ్మే-వాడినీ, వాడి వీపునున్న బుట్టలోని పిల్లనగ్రోవిలనూ ఆశ్చర్యంగా చూశాడు! –

అప్పుడే పిల్లనగ్రోవిని కొని మ్రోగిస్తున్న కుర్రాణ్ని చూసి, వాడి స్వరలహరి విని ఆనందించాడు....

మరికొంత దూరం వెళ్ళాడు, జనాన్ని తప్పించుకొని!–

అక్కడ... కరణం ఇంటి ముందు....కోయనృత్యం ప్రదర్శిస్తున్నారు!– ముందు కెళ్ళి పిల్లలున్న చోట నిల్చున్నాడు కాళిదాసు....

కొంతమంది కోయస్త్రీల వేషం, మరికొంత మంది కోయపురుషుల వేషంలోనూ వున్నారు...ఒక్కడు మాత్రం నాయకుడిలా బుర్రమీసాలూ చేతిలో దండం...

డప్పు వాయిద్యాలకు అనుగుణంగా నృత్యం చేస్తున్నారు...

ఝుజ్ఝనక...ఝుజ్ఝనక...

హాస్యగాడు నృత్యం చేస్తూ పొరపాటున పడిపోయినట్టు నటిస్తే పేద్దపెట్టున నవ్వేసేడు కాళిదాసు, అందరూ నవ్వడం చూసి....

ఆ ప్రక్కనే నాగినీ నృత్యం చేస్తూన్న బృందాన్ని కాసేపు చూశాడు...

వింతైన, రకరకాల ఆట బొమ్మల దుకాణాల ముందు నుంచొని ఒక్కో బొమ్మను గుర్తిస్తూ చూసి ఆనందించాడు!–

ధర్మాతులు భిక్షం వేస్తే స్వీకరిస్తూ ముందుకు నడవసాగేడు...దార్లోనే తోలుబొమ్మలాట, పులి-వేషాలు చూశాడు!–

బఠానీ లమ్మేవాడు కాసిన్ని కాళిదాసు చేతిలో వేశాడు!– కాళిదాసు ఆ దుకాణదారు మంచితనానికి జోహారులర్పించి, ఒక్కో గింజ తొక్క వలిచి తినసాగేడు!–

రంగుల రాట్నం ఎక్కిన పిల్లల్ని చూసి తను ఎక్కినంత సంబరపడ్డాడు! నూకాలమ్మగుడి దగ్గరవుతున్న కొద్దీ జనసమ్మర్దం ఎక్కువవుతోంది!... వచ్చేవారిని తప్పుకుంటూ దారి చేసుకు నడుస్తున్నాడు కాళిదాసు!–

కాసేపటికి – గ్రామం చివరన తాటాకులతో, కొబ్బరాకులతో నిర్మించిన నూకాలమ్మ గుడిని చేరుకున్నాడు.

ఆ ప్రదేశం – నిశ్శబ్దమన్నదే ఈలోకంలో లేదా అన్నట్టు అరుపులు, కేకలు, డప్పుల మోతలతో, సన్నాయి వాయిద్యాలతో అట్టహాసంగా వుంది... వుండండి జనం మధ్య త్రొక్కిసలాటలూ, కొట్లాటలూ!–

గుడి వెనక భాగానే 'సిరిమాను రథం' సిద్ధం చేయబడి వున్నది!–

నిట్టనిలువుగా – నాలుగుచక్రాల రథంపై – ఒక మ్రాను; దానిపై త్రాసు మాదిరి క్రిందికి పైకి చలిస్తూ సమాంతరంగా వుండే మరోమ్రాను.... దానిపై ఓ చివర – అమ్మవారు ఆవహించిన వ్యక్తి కాషాయంబరధారియ్యై ఓచేతో కత్తి, ఓచేతో వేపమండలూ పట్టుకొని ఆశీనుడై వున్నాడు...

కొంతమంది సమాంతరపు మ్రాను రెండో చివర బలమైన తాడు కట్టారు... అవసరమైనప్పుడు తాడును క్రిందికి లాగితే కాషాయాంచు ధారి పైకి పోవడం, తాడును పైకి వదలితే అతను క్రిందికి రావడం జరుగుతోంది!–

నూకాలమ్మ ఆవహించిన వ్యక్తి క్రిందకు వచ్చినప్పుడు ప్రజలు అతని పాదాలను కళ్ళకు అద్దుకుంటున్నారు!– తమ క్రొత్త బట్టలను, పసిపిల్లలను అతనికి తాకిస్తున్నారు!–

జనసమ్మర్దం వలన "సిరిమానురథం" దరికి చేరలేకపోతున్న వారు దూరం నుంచే తాము తెచ్చిన పళ్ళూ, ఫలాలూ రథం పైకి విసిరేస్తున్నారు.

కొందరు అకతాయిలు మధ్యలోనే పళ్ళను అందుకుంటున్నారు!–

కాళిదాసు ఉత్సాహంతో తన సంచీలోని అరటిపండును తీసి శక్తిదీరా విసిరేడు! అది కాషాయాంబరధారిని తాకడంతో వాడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు!

జాతరను చూస్తున్న కొద్దీ వాడిలో నూకలమ్మ తల్లిపై భక్తి భావం ద్విగుణీకృతమవుతోంది!





భారత రాష్ట్రపతి నుంచి అవార్డు నందుకుంటున్న డా. పెరుగు శివారెడ్డి

# ప్రముఖ నేత్ర వైద్యులు డా. పెరుగు శివారెడ్డి

డాక్టరు పెరుగు శివారెడ్డి ప్రముఖ నేత్ర శస్త్రచికిత్సా నిపుణులు. వీరికి భారతదేశంలో నే గాక విదేశాలలో కూడా మంచి గుర్తింపు ఉంది.

డాక్టరు శివారెడ్డి 1920 సెప్టెంబరు 12న జన్మించారు. జాతీయంగా, అంతర్జాతీయంగా పేరెన్నిక గలిగిన ఈయన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో అసిస్టెంట్ సర్జన్‌గా ఉద్యోగంలో ప్రవేశించారు. హైదరాబాదులో సరోజినీదేవి కంటి ఆసుపత్రి అధిపతిగా, హైదరాబాదు ఆఫ్తాల్‌యాలజీ ఇన్‌స్టిట్యూట్ ప్రొఫెసరుగా ఎనలేని కృషి చేశారు.ఈ నాటికీ కృషి చేస్తున్నారు. ఈ ఆసుపత్రిలోని 'అసాధారణమైన పిల్లల ప్రత్యేక వార్డు' వీరి కృషికి నిదర్శనం.

పల్లెలలో సంచార నేత్ర చికిత్సా శిబిరాలను 500 పైగా నిర్వహించి 1982 నాటికే ఒక లక్ష శుక్లాల శస్త్రచికిత్సలు చేసి రికార్డును సృష్టించారు. ప్రపంచ ఆరోగ్య సంస్థచే పొరుగు దేశాలలో కూడ నేత్ర చికిత్సా శిబిరాలను నిర్వహించేందుకు ఈయన నియమించబడ్డారు.

సరోజినీదేవి కంటి ఆసుపత్రి ఆవరణలో వీరు తమ స్వంత ఖర్చుతో నిరుపేదలైన నేత్ర వ్యాధిగ్రస్తుల వసతికై కట్టించిన సత్రం నిర్భాగ్యుల పట్ల వీరికి గల ఆదరణకి నిదర్శనం. గత నాలుగు దశాబ్దాలుగా వీరి వద్ద శిక్షణ పొందిన 500 మందికి పైగా పోస్ట్ గ్రాడ్యుయేట్లు దేశ, విదేశాలలో ఉన్నారు.

జాతీయ, అంతర్జాతీయ పత్రికలలో వీరివి రెండు వందల వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

1973 లో 'క్రయో' పై వీరు చేసిన కృషికి అఖిల భారత ఆఫ్తాల్‌యాలజీ సొసైటీ నుండి స్వర్ణ పతకాన్ని పొందారు.డా. బి. సి. రాయ్ జాతీయ అవార్డు (1982) తో సహా అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డులను డా. శివారెడ్డి అందుకున్నారు. అంతర్జాతీయంగా అమెరికా ఆఫ్తాల్‌యాలజీ అకాడెమీచే 1982 లో గౌర వింపబడిన మొట్ట మొదటి భారతీయ నేత్ర వైద్యులు ఈయన. నేత్ర వైద్యంలో అసాధారణ కృషి చేసి అంతర్జాతీయ సంస్థ నుంచి ప్రపంచ అవార్డు పొందిన, వారిలో ఈయనే తొలి భారతీయ నేత్ర వైద్యులు. ఈయన సేవలకుగాను 1970 లో 'పద్మశ్రీ', 1977 లో 'పద్మభూషణ్' ఇచ్చి భారత ప్రభుత్వం ఈయనను సత్కరించింది. శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ ఆయనకు 1978 లో డి. ఎస్. సి. గౌరవ పట్టాన్నిచ్చింది.

రష్యా, అమెరికా, జర్మనీ, జపాన్ వంటి అనేక దేశాలను ఆయన విస్తృతంగా పర్యటించారు.

1969 నుంచి వరుసగా భారత రాష్ట్రపతులకు డా. శివారెడ్డి గౌరవ నేత్రవైద్యులుగా కూడా ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నేత్రవైద్యం విషయంలో సలహాదారుగా ఉన్నారు.

(జ.వి.)

# బలి

నెమ్మదిగా గుడిలోనికి జనాన్ని తప్పుకుంటూ వెళ్లాడు! – "ప్రజల్ని చల్లగా కాపాడే నూకాలమ్మా! – ఎటువంటి కష్టాలూ, ఇబ్బందులూ రాకుండా లోకమంతా సుఖశాంతులతో బ్రతికేట్టు చూడమ్మా...." పెద్ద మనసుతో చేతులు మోడ్చి ప్రార్థించాడు!–

అమ్మవారి ఘటాలు ఊరంతా తిరిగి రావడంతో కోలాహలం పెరిగింది!–

ఘటాలను మోస్తున్న స్త్రీలు ఎంతలా ఊగినా, తూగినా, నృత్యం చేసినా ఆ ఘటాలు తొణకకుండా వుండటం కాళిదాసు నెంతో ఆశ్చర్యపరచింది.... నూకాలమ్మపై భక్తి భావాన్ని పెంపొందించింది....

కొద్ది క్షణాల్లో, భక్తిభావంతో అరుస్తూ ప్రజలు తలా ఒక చెయ్యి వెయ్యడంతో రథం కదిలింది...:- సాఫీగా నడవసాగింది!–

"ఆ రథాన్ని ఊరి ఈ చివరినుంచి అటు పొలిమేర వరకూ తీసుకెళతారని తెల్సుకున్నాడు కాళిదాసు!–

ఊళ్లోని మిగిలిన వింతలూ, గారడీలూ, పౌరాణిక వేషాలు చూశాడు.... ఎన్నడూ పొందనంత ఆనందంతో నిండివున్నాడు వాడు

వాడికేమాత్రం అలసటా, చికాకూ అన్పించలేదు....చూసినవే మళ్ళీ మళ్ళీ చూస్తున్నాడు!–

వాడి వీపునున్న సంచికూడా భిక్షతో నిండి కాస్త బరువెక్కింది!–అప్రయత్నంగా నడుస్తూనే మళ్ళీ గుడి దగ్గరకొచ్చాడు!–

అప్పటికే చాలామంది జనం అక్కడున్నారు!– అందరి చేతుల్లోనూ కోళ్ళు వున్నాయి!–

ఆశ్చర్యంగా అడిగాడో కుర్రాణ్ని. "అందరూ కోళ్ళను ఎందుకుతెచ్చారు?"

"నూకాలమ్మకు బలి ఇస్తారు!....అంటే పీక తెగ్గోస్తారు!...." నాకే తెల్సు అన్నట్లు గొప్పగా చెప్పాడు ఆ కుర్రాడు "అదుగో.... గుళ్లోపల మేకపోతు వుంది చూడూ!.... దాన్ని కూడా దేవతకు బలిఇస్తారు!...."

"అయ్యో!.... వాటి పీకలు తెగ్గోస్తే చచ్చిపోవూ!– ఎందుకు వాటిని చంపేయడం?...."

జాతరచేస్తే అందరూ కోళ్ళను బలిఇస్తారు మరి!.... దేవత బలికోరుతుందట!...." అన్నాడా కుర్రాడు!–

"జాతరచేస్తే మాత్రం!– ఆ జీవుల్ని ఎందుకు చంపేయడం...." చల్లని దేవత అనుకున్న నూకాలమ్మ తల్లిపై వాడికి పట్టరానికోపం ముంచుకొచ్చింది!–

అందరి చేతుల్లోనూ కాళ్ళు విరిచి కట్టబడి బందీల్లా వున్న కోళ్ళను చూస్తే వాడికి జాలివేసింది!–

నెమ్మదిగా గుళ్లోకి ప్రవేశించాడు!–

గుళ్లో పూజారి ఒక్కడే వున్నాడు!– చింపిరిజుత్తూ, బుర్రమీసాలూ, ముఖం నిండా బొట్లూ....

## రెండు గుండెల ఘనుడు!

ఆఫ్రికా మాంగూటా గ్రామానికి చెందిన అర్థర్ పోలాస్కన్ అనే ఆయనకు వో అదనపు గుండె వుందట. అందరికిలా ఆయనకు ఎడమ పక్క వున్న గుండె కాకుండా మరో గుండె కుడి భాగంలో కూడా వుందట. ఈ రెండు గుండెల పోలాస్కన్ను పరీక్షించిన డాక్టర్లూ, వారితో పాటు విజ్ఞాన శాస్త్రం కూడా ఆశ్చర్యంతో ఎగిసి పడ్డారట. అనక ఆ పోలాస్కన్ను నింపాదిగా పరీక్షించి "య్యస్" అని అనుకున్నారట.

## భర్తను కొట్టిన భార్య!

ఫిల డల్ఫియాకు చెందిన ఆర్నాల్ కజాన్ అనె వొహాయన భార్య ఎలియా కజాన్ అనే ఆవిడ గర్భం ధరించి రివాజుగా పది నెలలూ మోసి, ప్రసవ వేదనా నంతరం ఎట్ట కేలకు బిడ్డను కని, తన నింత కష్ట పెట్టినది తన భర్తే నన్న కోపంతో ఆ దుర్మార్గుని వల్లే యీ కడుపురాడం, ప్రసవ వేదన పడడం, పిల్లని కనడం జరిగాయని, బిడ్డను చూడ వచ్చిన అతన్ని బేసిను పెట్టి తల వాచేలా కొట్టిందట. ఆ కోపంతో అతను కోర్టుకు వెళ్ళి, అనక తన భార్య యిచ్చిన సారీ సంజాయిషీలకు సంతృప్తుడై తన కేసు వాపసు తీసేస్కున్నాడట.



## ఒకే అమ్మాయిని పెళ్ళాడిన అన్నదమ్ములు!

కొచ్చిన్‌లో గోవిందన్, రామన్ అనే యిద్దరు అన్నదమ్ములు తమ పరస్పరానురాగానికి అంతు లేదని చూపే విధంగా జానకి అనే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నారట. ఆమె కూడా భర్త ద్వయంతో ఎంతో పొందికగా, ప్రేమగా కాపురం చేస్తోందట. ఆమెకు వీరిరువురి వలనా పిల్లలుకూడా ఉన్నారట. ఈ అపూర్వ విచిత్ర దంపత్రయం అక్కడివారి ఆశ్చర్య ఆనందాలను పొందుతోందట.

## డాక్టరు నిర్లక్ష్యం!

కోయంబత్తూరు సింగనల్లూరు అనే విభాగంలో దేవరాజ్ అనే వో 13 ఏళ్ళ కుర్రాడు తన పన్ను బాధ భరించలేక ప్రభుత్వ ఇ. ఎస్. ఐ. ఆసుపత్రికి వెళ్ళి ఎడమ పక్క దంతం బాధ చెప్పుకుంటే అక్కడి డాక్టరు వుత్సాహంతో ఎగిరి గంతేసి, పేషెంటు చెప్తున్నా వినక, కుడిపక్క నున్న నిక్షేపంలాంటి దంతం పీకి చేతిలో పెట్టాడట. దాంతో వున్న పన్ను బాధతో పాటు, పోయిన పన్ను బాధ తోడై, తిక్కరేగి అతను తన పరిస్థితిని పోలీసులకు రిపోర్టు యిచ్చాడట.

## చావు సూట్ల కోసం క్యూ!

చనిపోయాక క్రిస్టియన్ మతాచారం ప్రకారం మగవానికి చక్కని సూటు తొడిగి, శవపేటికలో పెట్టి ఖననం చేస్తారట. బ్రిటనులో యీ డెత్ సూటు ఎంతో చక్కగా కుట్టే వో దర్జీవానికి గిరాకీ పెరిగిందట. మాంఛెస్టర్స్ నగరానికి చెందిన టిన్‌ఫోర్డ్ అండ్ బ్రొత్స్ టెయిలరు కంపెనీలో యీ చావు సూట్లు కుట్టించుకోవడానికి ఉత్సాహవంతులైన కాటిక్కాళ్ళు జాపుకున్న వారు క్యూలో నిల బడుతున్నారట. □

మెళ్ళో దండలూ.... రౌద్రంగా కన్పిస్తున్నాడు.... కళ్ళు మూసుకొని ఏవో మంత్రాలు పఠిస్తున్నాడు!–

గుళ్ళో ఓ మూల బలిష్టమైన మేకపోతు కట్టి-వేయబడి వుంది!– దాని నుదుట పెద్ద కుంకుమ బొట్టూ, మెళ్ళో వేపాకు దండలూ....

ఆ ప్రక్కనే నిట్టునిలువునా అమర్చబడిన కత్తి....పైనకత్తి మెనకు ఒక నిమ్మకాయ గుచ్చబడి, పసుపు కుంకుమలతో నిండి భయం గొల్పించేలా వుంది!–

"పాపం.... ఆ కత్తితో వాటి మెడలు తెగ్గోస్తారు కాబోలు" అనుకున్నాడు కాళిదాసు బాధగా!–

బలికోరే నూకాలమ్మా దేవత?.... ఆ నోరులేని జీవాన్ని చంపే ఈ మనుషులు భక్తులా?....- పట్టరాని కోపం వచ్చింది వాడికి!–అంతవరకూ నూకాలమ్మ దేవతపై వాడికున్న భక్తిభావం తుడిచి-పెట్టుకుపోయింది!

దీనాతి దీనంగా చూస్తున్న మేకపోతు కనుకొలనుల్లో నీరు.... "కొద్దిసేపట్లో తన ప్రాణాలు పోతాయని తెలిసి దుఃఖిస్తోంది...."

ఆ మేకపోతు మానసిక సంఘర్షణను తన మనసులోనే చిత్రించుకుంటున్నాడు కాళిదాసు!– దాన్ని చూస్తున్న కొద్దీ వాడిలో బాధ ఎక్కువవు-తోంది.... ఏదో తెలియని ఆవేదన వాడి హృదయాన్ని కలవరపరుస్తోంది!–

అంతలో.... ఆ చిన్ని మెదడులో....మెరుపు....

ఆ మేకపోతు ప్రాణాలు పోకుండా తను కాపాడితే.... ఆలోచన క్రమంగా నిశ్చయంగా మారి రూపం దిద్దుకుంది!–

## బలి

నెమ్మదిగా ముందుక నడిచాడు.... మేకపోతు దగ్గరకు!–

మరు నిముషం– అంతవరకూ బందీగా వున్న మేకపోతు కాళిదాసువలన తాడునుంచి విడుద-లైంది!.... ఆ అవకాశం కొసమే ఎదురు చూస్తున్న దాన్లా రివ్వున బయిటకు దూసుకుపోయింది!–

పారిపోయిన మేకపోతును చూసి గాభరాగా గుడిలోని కొచ్చారు ముగ్గురు వ్యక్తులు....

అంతవరకూ మంత్రాలు పఠిస్తున్న పూజారి అప్పుడే కళ్ళు విప్పి చూశాడు....

అందరూ క్షణంలో జరిగింది ఆకళింపు చేసు-కున్నారు....

"బలి పశువును విడిచిపెట్టేస్తావురా దొంగ-నాయాలా...." భయంగా నిల్చొని చూస్తున్న కాళిదాసు మీద కొచ్చారు వాళ్ళు, బూతులు తిడుతూ!....

తడబడుతూ వెనక్కి అడుగు వేశాడు కాళిదాసు....

మరో అడుగు వెనక్కు వేశాడు....

అంతే!.... వెల్లకిలా పడ్డాడు....

"అమ్మా...." హృదయ విదారకరంగా కేక వెలువడింది!–

నిట్టనిలువుగా వున్న కత్తి కాళిదాసు వీపులోంచి దూసుకొని పైకి వచ్చింది.... ఎర్రటి రక్తం ఎగచిమ్మింది....

కొన్ని రక్తపు చుక్కలు నూకాలమ్మ విగ్రహం పై పడ్డాయి....

క్షణాల్లో కాళిదాసు దేహం నిర్జీవమైపోయింది!–

హటాత్తుగా జరిగిందానిక నలుగురూ శిలా ప్రతిమలై పోయారు....

మరు నిముషం పూజారి, ఆ ముగ్గురూ అరచు-కుంటూ బయటకు పరుగెత్తారు!–

"నూకాలమ్మ మనిషిని బలి తీసుకుంది.... మనిషిని బలి తీసుకుంది...." అరిచాడు పూజారి!–

క్షణంలో ఊరంతా గుప్పుమందీ వార్త....

జనం తండోప తండాలుగా వచ్చేశారు.... ఒకర్ని తోసుకుంటూ ఒకరు గుళ్ళోకి ప్రవేశించారు....

పూజారి జరిగింది చెప్పేడు....

"నూకాలమ్మకు ఏదైనా అపచారం జరిగితే నరబలి తీసుకుంటుంది....ఈ కుర్రాడు అమ్మవారి బలి పశువును విడిచి పెట్టేశాడు....దాంతో ఆగ్రహం చెందిన అమ్మవారు వాణ్ణే బలి తీసుకుంది.... అదుగో చూడండి!.... అమ్మవారి నాలుకపై కుర్రవాడి రక్తపు చుక్క...."

కొంతమంది కాళిదాసుపై జాలి కురిపిస్తే, మరి కొంతమంది వాడు చేసిన పనికి కోపగిస్తూ ఖర్మ అన్నారు....

చాలామందికి మాత్రం నూకాలమ్మపై భక్తి విశ్వాసాలూ, నమ్మకమూ మరింత పెరిగి-పోయాయి....

కానీ– నిర్జీవంగా పైకి చూస్తున్న కాళిదాసు కళ్ళల్లో, తను ఎలాగైతేనేం ఆ మూగజీవిని రక్షించానన్న ఆనందం ప్రతిఫలించడం ఎవరికి కన్పించలేదు!.... □

# ఉచిత కానుక!

## గ్లూకోన్-డి ® యొక్క తక్షణ శక్తితోపాటుగా




## ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్ని, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్ళరసం, పాలు, తేనీరు, కాఫీ, లేదా మంచినీళ్ళలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

HTB-GLL-9686







స్టాకు పరిమితం, నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం గ్లాక్సో

**తక్షణ శక్తి కోసం – గ్లూకోన్-డి ®**



# సినిమా విశేషాలు

_జి.వి.జి.

## కోడి రామకృష్ణ దర్శకత్వంలో "ఉదయం"

ప్రతి ఉదయం కొన్ని సంఘర్షణలు సృష్టి స్తుంది ఏవో సమస్యలు తెస్తుంది వాటిని పరి ష్కరించడానికే మళ్ళీ ఉదయమే ఉదయిస్తుంది

దుర్మార్గులు, దుష్టులు సమాజం మీద కప్పిన చీకటి తెరలను చీల్చి నవయుగానికి నాంది పలికే ఉదయం ఉంటుంది, వస్తుంది. ఈ ప్రాతిపదికతో తయారవు తూన్న చిత్రం, అన్నారు కోడి రామకృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో టి. గోవిందరెడ్డి సమర్పించే రవికిరణ్ మూవీస్ "ఉదయం" చిత్రంలో శారద, భానుచందర్, రజని, శరత్‌బాబు, రాజీవ్, రాజేంద్ర ప్రసాద్, రాజా, ఎం వి. ఎస్. హరనాథరావు, వీరభద్రరావు, హరనాథరావు, శ్యామలరావు, జ్యోతి లక్ష్మి, జయమాలిని, అనూరాధ వగైరా నటవర్గం నగ్నముని కథ. ఎం. వి. ఎస్ హరనాథరావు సంభాషణలకర్త. చంద్రశేఖర్ స్వరకల్పనలో సి నారాయణరెడ్డి గీతాలు రాశారు విజయ్ ఛాయ, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, తోట యాదు శిల్పం, బాబు సాహసాలు, రావుశ్రీ సహదర్శకత్వం, సురేష్ కూర్పు, పొన్నతోట రఘురాం నిర్వహణతో హెచ్ ఎం రెడ్డి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ "మార్చి 1 నుంచి 15 వరకు ఫస్ట్ షెడ్యూల్ పూర్తి చేశాం విశాఖపట్నం, అరకులోయ, రాజమండ్రి ప్రాంతాలలో ఏప్రిల్ 1 నుంచి 15 వరకు రెండో షెడ్యూల్ జరుగుతుంది. దీంతో షూటింగ్ ముగుస్తుంది" అని తెలిపారు నిర్మాత ద్వారంపూడి నరసారెడ్డి.

## "మా పల్లెలో గోపాలుడు"లో కోతలరాయుడు

సిత్తరాంగీ, నా సిత్తరాంగీ! పిత్త పరిగెల సిత్తరాంగీ!" అంటూ హనుమంతు (గొల్లపూడి) కుప్పిగంతులు వేస్తూ వచ్చాడు ఏదో ఆలో చిస్తున్న చిత్రాంగి (వై. విజయ) "ఔనుగాని, మర్దీ అమెరికా వూరు ఎంత దూరం?" అని అడిగింది అమాయకంగా

"వమెరికా, వమెరికా... అదెంతపాటి దూరం? ఆ మెరక దాటితే అదే వమెరికా" లంకలకోడేరు గట్టిక్కి గట్టిగా అరిత్తే, వమెరికా మునసబు పలుకుతాడు" అన్నాడు హనుమంతు

చిత్రాంగి ముఖం చాటంతయింది. "వమెరికా మునసబు నీకు తెలుసేటి?"

హనుమంతు ఠక్కున జవాబిచ్చాడు "తెలడం యేటి మేమిద్దరం ఒకే పడవకి తెడ్డేసేవాళ్లం"

"వమెరికా మునసబు తెడ్డేత్తాడేటి?"

"నువ్వు సూడలేదు గాని, సూత్తే అదిరిపోయే దానివి"

ఆశ్చర్యంగా నోరావలించి చూస్తుండిపోయింది చిత్రాంగి.

కోడి రామక్రిష్ణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్ గోపాలరెడ్డి నిర్మించిన భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మా పల్లెలో గోపాలుడు" చిత్రం ఏప్రిల్ విడుదల

"దేవాలయం"లో విజయశాంతి, శోభన్‌బాబు,

"నాలుగిళ్ళ చావిడి"లో చంద్రమోహన్, దేవిశ్రీ

## "మహారాజు"లో అహంకారి

పెట్టె పుచ్చుకుని ఆగ్రహంతో గుమ్మం బయటకు వచ్చిన రఘు (ఈశ్వరరావు)కు లలిత (సుహాసిని) అడ్డొచ్చింది "రఘూ! ఏమిటిది చిన్నపిల్లాడిలా? ఆ పంతాలేమిటి? సొంత అన్నయ్య కోపంలో నాలుగు మాటలంటే, ఇల్లు వదలి వెళ్ళిపోతావా? లోపలికి పద," అంది

రఘు తీక్షణంగా చూశాడు 'అహ! ఊరికే నటించకు. వదినా! నువ్వొచ్చాకే అన్నయ్య ఇలా మారిపోయాడు 'మీ తమ్ముణ్ని మీరు చదివించారు అతనా రెండు చేతులా సంపాదిస్తున్నాడు మీ కివ్వకుండా దాచుకుంటున్నాడు,' అని అన్నయ్యకు బాగా నూరి పోశావు అన్నయ్యకీ – నాకూ చెడగొట్టావు ఇప్పుడు నీకు సంతోషంగా ఉందా? ఇంకా ఇక్కడుంటే నా గౌరవం మట్టి గొట్టుకు పోతుంది నే వస్తాను,' అంటూ వేగంగా వెళ్ళిపోయాడు

"ఆడపిల్లలే నయం"లో జయసుధ, మురళీకృష్ణ



గుమ్మం బయటకు వచ్చిన రాంబాబు (శోభన్ బాబు) బిన్నవదనంతో తన భార్య లలిత వంక చూశాడు 'లలితా! రెక్కలొచ్చిన పక్షి గూట్లో ఉండలేదు ఎగిరిపోతుంది వాడి కోసం నే పెట్టిన ఖర్చులన్నీ డైరీలో రాసుకున్నాడట మరి నేను చూపించిన ప్రేమ అభిమానం మనసులో రాసుకోవటం మర్చిపోయాడా? అసలు లలితా! వాణ్ని ఆరేళ్ళ వయసు నుంచీ నా భుజాల మీద - వద్దు వద్దులే ఆ విషయం చెప్పినందుకేగా వాడు నన్ను కాదనుకుని వెళ్ళిపోయాడు? అదంతా నా గొప్ప కోసం చెప్పానా? అసలు వాడు నన్ను నన్ను ఆ తర్వాత నోరు పెగలక బాధతో స్తంభానికి వాలిపోయాడు

విజయ బాపినీడు స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించే రాశి మూవీ క్రియేషన్స్ మహారాజు చిత్రానికి ఎం నరసింహారావు నిర్మాత

బి.మరిడేశ్వరరావు ప్రొడక్షన్స్
ఎం.ఎస్.రామానుజం &
ఆర్.వి.రామమోహనరావు
సమర్పించు

# ఆడపిల్లలే నయం!










దర్శకత్వం
వేజెళ్ళ సత్యనారాయణ
నిర్మాత
బి.మరిడేశ్వరరావు
నిర్వహణ
ఎస్.ఎస్.అశోక్‌కుమార్ B.Sc.

నైజాం ప॥గో: బి.మరిడేశ్వరరావు & కో. సీడెడ్: శ్రీకృష్ణ ఎంటర్ ప్రైజెస్.

---




మణివణ్ణన్ ఆర్.రామకృష్ణంరాజు (బోసుబాబు) సంగీతం ఇళయరాజా కె.రామరాజు

జీడిపప్పులు !



ప్రకృతి



వాటిని పెంచుతుంది.

ఇప్పుడు ఆంప్రో
కమ్మటి బిస్కట్లుగా
మారుస్తోంది.



# కరకరలాడే, కమ్మటి, రుచికరమైన




ఆంప్రో®

# కాజు-కుక్కీస్

ఆంప్రోవారి కాజు - కుక్కీస్ ! మన్నికైన జీడిపప్పులతో, ఎన్నికైన బిస్కట్ ముడి పదార్థాల మేలైన కలయిక ! ప్రతి ముక్కా పసందుగా ఉండేట్లు, పనితనమంతా జోడించి ఎంతో ప్రేమతో తయారు చేసినవి !

. వీటితో ప్రతి సందర్భమూ పండుగగా మారుతుంది !

# వేసవి కోసం సఫారి.

INTERNATIONAL FILM STAR: KABIR BEDI



ఈ వేసవికోసం రకరకాల స్టైల్స్. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. సఫారికోసం అత్యుత్తమమైన సూటింగ్ శ్రేణిని విమల్ మాత్రమే మీకు అందిస్తుంది.

A) ఆఫీసుకోసం 'కార్పొరేట్ సఫారి' హాయికి హాయి, హుందాకి హుందా...

B) ఈ సఫారి మామూలు వాటికన్నా కొంచెం వైవిధ్యం గలది...మరి కొంచెం లూజ్‌గా, మీకు హాయినిచ్చే సఫారి.

C) ఈ వేసవికి ఫుల్ స్లీవ్ సఫారి.

D) చైనీస్ కాలర్ కల్గిన ఈ సఫారి సరికొత్తది. నూటికి నూరు పాళ్ళు మీకు ఆహ్లాదం, హుందా సమకూర్చుతుంది.

E) సాయంత్రాలకోసం చక్కని సఫారి.

VIMAL®
A RELIANCE PRODUCT

# పాలిరిచ్ సూటింగ్స్


B


C


D


E

Mudra:BRI:2242 TEL

"ఎక్సిక్యూటివ్ ఎక్సలెన్స్ & ఫేషన్ సీన్ సమ్మర్ '85' బుక్‌లెట్ కోసం ఈ కూపన్‌ని పంపండి:
ఎడ్వర్‌టైజింగ్ డిపార్ట్‌మెంట్,
రిలయన్స్ టెక్స్‌టైల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్
382 330.



## రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అనురాగబంధం"

"ప్రేమ, ఆప్యాయత, అనుబంధం - వీటితో పెనవేసుకుని చిత్ర విచిత్ర సంఘటనతో సాగిపోయే ప్రేమ కథా చిత్రం." అన్నారు ఎన్. రామలింగేశ్వర రావు ఈయన "కిరాయి కోటిగాడు, కంచుకాగడా" అనంతరం నిర్మించే పై చిత్రంలో జయసుధ, సరిత, శరత్‌బాబు, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, వేలు, కె. కె. శర్మ, చిడతల అప్పారావు, మమత, కృష్ణవేణితో పాటు రాష్ట్రపతి అవార్డులందుకున్న మాస్టర్ విమల్, మాస్టర్ సురేష్‌లు నటిస్తున్నారు ఫిబ్రవరి 26 నుంచి ఏప్రిల్ 10 వరకు ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తి చేసి, మేలో విడుదల చేస్తాం." అన్నారు సమర్పకులు నందిగం దేవీవరప్రసాద్ చక్రవర్తి. కథకు మద్దిపట్ల సూరి, పూసల సంభాషణలు సమకూర్చారు రాజన్ - నాగేంద్ర స్వరకల్పనలో వేటూరి, గోపి గీతాలు రాశారు పి. చెంగయ్య ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, పి. నాగేశ్వరరావు సహకార దర్శకత్వం. సత్యం - నాగేశ్వరరావు కూర్పుతో అనిల్‌కుమార్ దర్శకుడు



"మాయలాడి"లో పద్మనాభం, జయమాలిని

## 1985లో "ఉగాది వెలుగు" సన్మానితులు

"మద్రాసు తెలుగు సంగీత, నాటక, సాహిత్య, నృత్య ఐక్య అకాడమీ ఆదర్శాలలో ప్రధానమైనది జాతీయ సమైక్యతాభావం అంచేత, వివిధ కళలలో, రంగాలలో రాణిస్తున్న తెలుగు ప్రముఖులను గౌరవించడం ఈ ఐక్య అకాడమీ ముఖ్యోద్దేశ్యంగా పెట్టుకున్నా- తెలుగు కళలకు, సంస్థలకు ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రోత్సాహం అందజేస్తున్న కొందరు ఆంధ్రేతరులను కూడా ఈ ఉగాది నుంచి సత్కరించడం జరుగుతోంది." అన్నారు నిర్వహణ సారథి శ్రీ టి. వి కె శాస్త్రి అందుకు అకాడమీకి చెందిన ఒక ఉన్నత స్థాయి సంఘం ఈ నిష్ణాతులను ఎంపిక చేసింది వితరణశీలి శ్రీ పి వి జి రాజు ప్రముఖ న్యూరో సర్జన్ డాక్టర్ ఎన్ కళ్యాణరామన్ లాస్‌ఏంజెలిస్‌లోని హృదయ చికిత్సా నిపుణుడు డాక్టర్ వి. గునుపాటి వి చెల్వపిళ్ళ అంతరిక్ష యాత్రికుడు శ్రీ రాకేష్‌శర్మ నాగాలాండ్, మణిపూర్, త్రిపుర గవర్నర్ జనరల్ కె వి. కృష్ణారావు ప్రముఖ జ్యోతిష్య శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ ఎన్ భారతి, సుప్రసిద్ధ కవి డాక్టర్ దాశరథి, ప్రముఖ కవి శ్రీ కరుణశ్రీ, విఖ్యాత రచయిత్రి శ్రీమతి కె రామలక్ష్మి, ఆధునిక నవలాకర్త శ్రీ యండమూరి వీరేంద్రనాథ్, నాదస్వర విద్వాన్ శ్రీ టి ఆ పళనిస్వామి, బహుభాషా గాయకుడు, రచయిత శ్రీ పి బి శ్రీనివాస్, లలిత సంగీత గాయని శ్రీమతి రావు బాలసరస్వతి, చలన చిత్ర సంగీత దర్శకుడు శ్రీ పి. ఆదినారాయణరావు కూచిపూడి నర్తకీమణి శ్రీమతి జి బాల, కూచిపూడి నర్తకీమణి కుమారి సరళ భరతనాట్య కళాకారిణి శ్రీమతి చిత్రావిశ్వేశ్వరన్, ప్రముఖ చిత్ర కారులు శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి, శ్రీమతి విజయలక్ష్మి, తెలుగు సంస్కృతి, కళల సముద్ధార కులు శ్రీ జలగం వెంగళ రావు, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, చలనచిత్ర ప్రముఖులు శ్రీ డి వి ఎస్ రాజు, ప్రముఖ నటుడు, రచయిత శ్రీ కొంగర జగ్గయ్య, సీనియర్ చలనచిత్ర నటుడు శ్రీ గుమ్మడి, సురభి నాటక సంస్థ సారథి శ్రీ బాబారావు, ప్రముఖ తమిళ రంగస్థల నటుడు శ్రీ ఆర్. ఎస్ మనోహర్, చలనచిత్ర నటీమణి కుమారి జయప్రద, హరికథా ప్రముఖుడు శ్రీ ఎన్ పి సాంబమూర్తి. జాతీయ సమైక్యతకు తమ కళ ద్వారా నిస్వార్థంగా, నిర్విరామ కృషి సల్పుతూన్న ప్రముఖ సంగీతకారులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి ఎస్. జానకి గార్లకు కూడా గౌరవ సత్కారం



SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్ తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.
హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

"రగిలే గుండెలు"లో మోహన్‌బాబు, రాధిక

# "రగిలే గుండెలు"లో మండే విషయం

దేవునికి అర్చనచేసి వస్తున్న శారద(ప్రభ) మంటపం వద్ద ఇద్దరు అమ్మలక్కలు మాట్లాడుకోవడం విని నిలువునా కొయ్యబారి పోయింది.

"యేటో, వదినా! పున్నెంకొద్దీ మొగుడు, దానం కొద్దీ బిడ్డలు— అంటారుగాని, మన పెదబాబు చేస్తున్న పని చూస్తుంటే— ఈ శారదమ్మ చేసే పూజలకు ఏం ఫలితం దక్కిందన్న అనుమానం వస్తుంది సుమా!"

"నిజమే... మన పెదబాబు ఏనాడైనా మరో ఆడదాని వైపు చూశాడా? ఆ లక్ష్మి వచ్చి పనిలో చేరింది. ఇతగాడు దాని మోజులో పడి పోయాడు."

"ఇందులో ఆతగాడి తప్పేం ఉంది? అతగాడి డబ్బూ అదీ చూసి ఆ లక్ష్మి ఇతగాడ్ని గేలం యేసి లాగింది."

"అది గేలమేస్తే మాత్రం! తమ్ముడికి చేద్దామనుకుంటున్న పిల్లతో అతగాడు..."

ఇక వచ్చేవన్నీ 3–డి సినిమాలే కదండి!

ఒక 3–డి కళ్లజోడు ఇవ్వండి!



వాళ్ళిద్దరూ ఆవేశంతో నిలుచోనున్న శారదను చూడగానే చల్లగా జారుకున్నారు. శారదకు దేవుడు, దేవాలయం సర్వం గిర్రున తిరుగుతున్నట్లనిపించింది. ఇంతలో ఆమె వద్దకు మేస్త్రి (సాక్షి) వచ్చి, "నిజ్జే కాదమ్మా. ఊరంతా ఈ విషయమే చెప్పుకుంటున్నారు... అమ్మా, అయ్యగారు మచ్చలేని శ్రీరాముడే అయినా ఆ లక్ష్మిమాత్రం మాయలాడి శూర్పణఖ లాగ దాపురించిందమ్మా. అయ్యగారి ఉప్పుతిని బ్రతుకుతున్న నాకే చాలా బాధగా ఉంది. బాబుగార్నే దైవంగా భావించే మీరెలా భరించగలరమ్మా?" అన్నాడు.

అంతే. ఆవేశంగా శారద బయలుదేరింది.

మోహన్‌బాబు ప్రధానపాత్ర నిర్వహించి, నిర్మించిన లక్ష్మి ప్రసన్న పిక్చర్స్ "రగిలే గుండెలు" చిత్రానికి సెన్సార్‌వారు 'యు. ఎ' సర్టిఫికేట్ ఇచ్చారు. అందరూ చూడదగిన ఈ చిత్రాన్ని పెద్దల అనుమతితో మాత్రమే పిన్నలు చూడొచ్చని ఈ సర్టిఫికేట్ అర్థమట. మార్చిలో విడుదలయ్యే ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## కృష్ణ, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో ఎం ఎస్ రెడ్డి చిత్రం "పల్నాటి సింహం"

"ఫిబ్రవరి 6 నుంచి 10 వరకు ఆర్టిస్టు లందరితో మంగళగిరిలో పతాక సన్నివేశాలు చిత్రీకరించాం," అన్నారు ఎం.ఎస్. రెడ్డి. ఈయన "రాళ్ళలో కూడా కౌర్యాన్ని రగులు గొలిపే— రాణకెక్కిన రణచరిత్ర— ధర్మదీక్షకు నాందియై దారిజూపి— పట్టేతిని పగతుర మట్టు బెట్టి" అనే ఇతివృత్తంతో భారీ ఎత్తున నిర్మించిన కౌముదీ పిక్చర్స్ "పల్నాటి సింహం" ఏప్రిల్ విడుదల. కృష్ణ, జయసుధ, రాధ, శారద, అన్నపూర్ణ, సూర్యకాంతం, సత్యనారాయణ, జగ్గయ్య, శివకృష్ణ, నూతన్‌ప్రసాద్, చలపతిరావు ప్రభృతులు పాల్గొన్నారు. కథ, మాటలను పరుచూరి సోదరులు సమకూర్చారు. వేటూరి, రాజశ్రీ గీతాలకు చక్రవర్తి స్వరకర్త. వి.ఎస్.ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు.

## జి. సత్తిరాజు నిర్వహణలో "ధర్మపీఠం దద్దరిల్లింది"

"స్క్రిప్ట్ పకడ్బందీగా తయారైంది," అన్నారు జి. సత్తిరాజు. ఈయన నిర్వహణలో జి. రామమోహనరావు దర్శకుడుగా జి. సూర్యనారాయణరాజు నిర్మించే గణపతి పిక్చర్స్ వారి చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, ప్రభాకరరెడ్డి, గొల్లపూడి మారుతీరావు ప్రభృతులు పాల్గొంటారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. సమర్పణ : హరిహరరాజు.

## అస్తమయం

తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఇటీవల ఇద్దరు ప్రముఖులను కోల్పోయింది. ఒకరు నిర్మాత డి.బి.ఎన్; మరొకరు నటుడు, నిర్మాత చలం.

"సినిమాలు తీయడం కాసుల కోసమే. కాని, కాస్త కళాత్మకంగా, ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దాలని తాపత్రయ పడే వారిలో నేనూ ఒకడ్ని. నే తీసిన చిత్రాలవల్ల ఆ పరిపూర్ణమైన తృప్తిని పొందగలిగాను. ఇప్పుడు నా చిత్రాల నెగెటివ్ హక్కులన్నీ అమ్మేసి, బాకీలు తీర్చేసి, చేతులు తుడుచుకున్నాను. ఇక ఆ పైవాడి దగ్గర్నుంచి ఎప్పుడు పిలుపొస్తుందా అని ఎదురు చూస్తున్నాను," అన్నారు ఆయాసంగా డి.బి.



డి.బి. నారాయణ

నారాయణ ఆర్నెల్ల క్రితం. చాలా కాలంగా బ్రోంకైటిస్‌తో ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నది. సతీ వియోగం పొందినప్పట్నుంచి వాళ్ళ కాంపౌండ్‌లో ఓ మూల చిన్న పాకవేసుకుని, కాలం గడుపుతూ వచ్చారు. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషల్లో చిత్రాలు తీయడమే కాక "అన్నదమ్ములు" చిత్రానికి కథ సమకూర్చారు కూడా. ఈయనకు నలుగురు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు. వారిలో కొందరు పోస్టు గ్రాడ్యుయేట్స్. పెద్దమ్మాయి డాక్టరు.



"ఎప్పుడూ ఏదో ఒక కొత్తదనం, మార్పు కోసం ప్రయత్నించడమే నా లక్ష్యం. కథల్లోనూ, కథనంలోనూ, పాత్రల్లోనూ వైవిధ్యం చూపాలని నా తపన. అందుకే వేజళ్ళగారి డైరెక్షన్‌లో "ఎవరికీ సిగ్గు లేదు" అనే సినిమా తీయాలనుకుంటున్నాను. మన అభిరుచికి అనుగుణంగా పిక్చర్ తీస్తే, అది హిట్ అయినా... కాకపోయినా ఇది మన చిత్రం అని చెప్పుకునేంత తృప్తయినా మనకు మిగులుతుంది...ఇప్పుడొస్తున్న కొన్ని సినిమాలు చూస్తుంటే. చాలా సంతోషం కలుగుతోంది. చాలా చిత్రాలను చూస్తుంటే, అంతకు రెట్టింపు బాధ కలుగుతోంది. మనం ఎటు పోతున్నాం? ఒక పథకం, పద్ధతీ లేకుండా ఎందుకీ విధంగా హడావిడిగా లెక్కలేనన్ని చిత్రాలు తీసి దేశం మీదికి వదలడం అనే బాధ. ఇలాంటి బాధలూ, సంతోషాలూ ఈ సినిమా జీవితంలో మామూలే," అన్నారు చలం నెల క్రితం వేకువ జామునే మా ఇంటికి వచ్చి. "మట్టిలో మాణిక్యం"గా చిత్రసీమలో "నా చెల్లెలు" చిత్రం ద్వారా ప్రవేశించి "సంబరాల రాంబాబు" అయిన చలం "సత్తెకాలపు సత్తెయ్య". తన మొదటి భార్య పేర రమణ చిత్ర పతాకంలో తొమ్మిది చిత్రాలు తీశారు. ఈయనకు ఇద్దరు పుత్రులు, ఒక పుత్రిక. పుత్రులిద్దరూ ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. పెద్దకొడుకు రవిశంకర్ పేరుమోసిన క్రికెట్ క్రీడాకారుడు కూడా

□

రాజమండ్రిలో జరిగిన శ్రీ సారథీ స్టూడియోస్ "శిక్ష" ఔట్‌డోర్ షూటింగ్ సందర్భంగా గోపాలరెడ్డి, సుహాసిని రేలంగి నరసింహారావు, పి. శశిభూషణ్, శరత్‌బాబు,



# కొత్త సీరియల్ ప్రారంభం!

# పడమటి సంధ్యారాగం

(ఆదూరి సావిత్రి)

## చలినీ చీకటినీ చీల్చుకుంటూ వచ్చి, ఇందుకూరు స్టేషన్‌లో ఆగింది రైలు....

సాయంత్రం నాలుగింటికి రావలసిన రైలు రాత్రి ఏడింటికి వొచ్చింది. మబ్బులు దట్టంగా కమ్ముకుని ఉండటం మూలాన బాగా రాత్రయినట్లనిపిస్తోంది.

సన్నగా వర్షం పడుతోంది....
ప్లాట్‌ఫాం మీద నిలబడి చుట్టూ చూశారు ఛాయ, రాజీవ్....

వెలివేయబడినట్లుగా... ఊరుకు దూరంగా ఒంటరిగా ఉన్నది స్టేషన్. అయినా ఆత్మ విశ్వాసం చెక్కు చెదరనట్లు లైట్ల వెలుతురుతో గంభీరంగా ఉంది...

అక్కడ జనం ఎక్కువ మంది దిగలేదు ఒక టీ స్టాల్ ముందు అయిదారుగురు నిలబడి టీ తాగుతున్నారు

టీ తాగుదాం అంటూ అటుకేసి నడిచాడు రాజీవ్

తనూ వెళ్ళి అతని వెనక నిలబడింది ఛాయ

ఏ ఊర్నుంచి వొచ్చారు? ఎక్కడికి వెళ్ళాలి? గాజు గ్లాస్‌లో పోసిన టీ రాజీవ్‌కిస్తూ వెనకాలే నిలబడ్డ ఛాయను కుతూహలంగా చూసి అడిగాడు టీ కొట్టతను

'నిమ్మలూరు నుంచొస్తున్నాం ఇందుకూరు ఊళ్ళో వెళ్ళాలి రిక్షాలు దొరుకుతాయా?" అన్నాడు రాజీవ్

ఇక్కడికి ఊరు నాలుగు మైళ్ళుంది అదుగో బయట బస్సుంది ఎక్కండి రైలు దిగిన జనాన్ని ఊళ్ళోకి జారెయ్యటానికే ఆ బస్సు "అన్నాడతను స్టేషన్ వెలుపల ఆగి ఉన్న బస్సులో ఎక్కే సరికి చచ్చినంత పనయింది ఛాయకి రాజీవ్ గుంపులో జొరబడి, ఆమెకు చెయ్యందించి పైకి లాగాడు

బస్సులో జనం క్రిక్కిరిసి పోయి ఉన్నారు కొందరు డోర్‌లో వ్రేలాడుతున్నారు

కిందికి దిగండయ్యా ఇంకో ట్రిప్పులో ఒద్దురు గాని బస్సు కదిలిందంటే




కిందకు జారి చస్తారు అనక మా పీకలకు చుట్టు కుంటుంది అని అనుస్తున్నాడు కండక్టరు

ఎవరూ అతని మాటలు లెక్క చెయ్యటల్లేదు

ఈదర గాలి చంపుతుంటే ఈ చలిలో, చినుకుల్లో ఇక్కడెవ దేదుస్తాడు మళ్ళీ త్రిప్పుదాకా? మేం సద్దుకుంటాం గానీ లాగించ వయ్యా డ్రైవరూ అని లోపలి జనం గొడవ చేస్తున్నారు

బస్సు కదిలింది నాలుగు మైళ్ళు పోవటానికే అర గంట పైచిలుకు పట్టింది

ఎయిర్ బ్యాగ్ భుజానికి తగిలించుకుని బస్ స్టాండులో దిగాడు రాజీవ్

ఇక్కడ ఏ హోటల్ బావుంటుందండీ? తనతో పాటు దిగిన ఓ పెద్దమనిషి నడిగాడతను

కల్పనా హోటల్ కాస్త బెటరు ఆ ఎదర సందులోకెళ్ళి ఓ పదడుగు లేస ఎడమ వేపుకు తిరిగితే మొగదలె ఉంది హోటలు అన్నాడా వ్యక్తి

చీర కుచ్చెళ్ళు కొద్దిగా పైకి పట్టుకుని నడుస్తోంది చాయ బురద మూలంగా వేళ్ళు నేలకు అంటుకు పోతున్నాయి ముని వేళ్ళతో నొక్కిపట్టి, పడిపోకుండ బ్యాలన్స్‌గా నడుస్తోంది అసహనాన్ని అణుచుకుంటూ

రోడ్డంతా గుంటలు వాటిలో నిండిన మురికి నీళ్ళు ఇరు పక్కలా, కంపు కొడుతున్న పెంట పోగులు

ఒళ్ళంతా రోగాలతో కుళ్ళి పోయిన వేశ్యలా ఉన్నదా రోడ్డు ఆ కాస్త దూరం

నడిచి హోటల్ చేరుకునే సరికే ఎన్నో మైళ్ళు నడిచినంత ఫీలింగ్ కలిగింది వాళ్ళకి.

కౌంటర్లో, ఎర్రగా, పొట్టిగా ఉన్న నలభయ్యేళ్ళ మనిషి కూర్చుని ఉన్నాడు.

రూం కావాలని అడుగుతున్న రాజీవ్ వేపు విచిత్రంగా చూశాడతను. అతని చూపులు ఛాయ మీద పడ్డాయి. ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు....

తన మీద అనుమానం, రాజీవ్ మీద ఈర్ష్య అతని చూపుల్లో పసిగట్టిన ఛాయకు ఒళ్ళు జలదరించింది.

ఈ ఊళ్ళో ఉన్న హోటల్స్‌లో ఆడవాళ్ళెవరూ 'రూం' తీసుకుని ఉండటం ఎప్పుడూ జరగదని అతని ముఖం చూస్తుంటేనే తెలుస్తోంది.

"ఇక్కడ కాలేజీలో లెక్చరర్ పోస్ట్‌కు ఇంటర్వ్యూ వచ్చింది నాకు. ఎవరూ తెలిసిన వాళ్ళు లేక పోవటం మూలాన హోటల్‌లో ఉండాల్సొచ్చింది. వీడు మా తమ్ముడు." అప్రయత్నంగా సంజాయిషీ ఇచ్చింది ఛాయ.

"అలాగామ్మా! ఇదిగో బాబూ తాళం." అంటూ రాజీవ్‌కు తాళం చెవి ఇచ్చి "ఒరేయ్ బాలూ.... ఈ లగేజ్ పట్టుకుని, వీరిని రూం నెంబర్ ఫదిలోకి తీసుకెళ్ళు." అని కుర్రాడికి పురమాయించి "వెళ్ళండమ్మా, భోజనం కూడా రూంకే పంపిస్తాను." అన్నాడతను ఛాయతో నమ్రతగా...

రూంలోకి తొంగిచూసి, ఒక అడుగు వెనక్కి వేసింది ఛాయ. నల్లగా.. పెద్ద పెద్ద గుంటలతో.. రకరకాల మరకలతో అసహ్యంగా ఉన్న గోడలు, వాటికి మంచి కాంబినేషన్ ఇస్తున్నట్టున్న, మంచం మీద పరవబడ్డ దుప్పటి.. గచ్చు పెళ్ళ లూడిపోయిన నేల...

"దుప్పటి మార్చు." అన్నది ఛాయ.

"వర్షంకదా. చాకలి బట్టలు తేలేదమ్మా." వినయంగా అన్నాడు బాలూ.

"సరే. భోజనం ఉందా? వర్షమని అదీ మానేశారా?"

"ఉందమ్మా. వేడి వేడిగా ఉంది. క్షణంలో తెస్తా." అంటూ కింద కెళ్ళాడు కుర్రాడు...

భోజనంలో కూర కలుపుకుని కెవ్వుమన్నాడు రాజీవ్.

"కారం అక్కా." అన్నాడు మంచినీళ్ళు గడగడా తాగేశాడు.

పచ్చడి కలుపుకున్న ఛాయకు నసాళం అంటింది.

పెరుగు అనబడే మజ్జిగలాంటి ద్రవంతో ఎలాగో భోజనం అయిందనిపించారు.

ఇహ పడక సమస్య...

మంచంమీద పడుకుందామంటే పరుపులు బాగోలేదు. కింద నేల బాగోలేదు.

బ్యాగ్‌లో నుంచి, ఇస్త్రీ చీరలు తీసి, మంచం మీదున్న దుప్పట్లను మూలకు విసిరి, వాటిని పరిచింది ఛాయ...

ఫాన్ చెడిపోయినట్టుంది. ఢమఢమలాడుతూ పిచ్చెక్కించేంత శబ్దం చేస్తోంది.

ఆ మోత భరించలేక దాన్ని ఆపేస్తే... అవకాశం కోసం పొంచి ఉన్న శత్రుసైనికుల్లా మీదకురికాయి దోమలు...

"అక్కా.. ఈ అడవిలో ఉద్యోగం రాకున్నా ఫర్వాలేదే. వచ్చిందంటే.... నీతో పాటు నేను కూడా..." అంటూ అర్థోక్తిలో ఆపాడు రాజీవ్.

"బావుంది. ఉద్యోగమొస్తే ఇలా హోటళ్ళలో ఎందుకుంటాం? శుభ్రమైన ఇల్లు తీసుకుని ఉంటే ఎక్కడైనా బాగానే ఉంటుంది." అన్నది ఛాయ.

ఏ అర్ధరాత్రికో నిద్రపట్టింది వాళ్ళకి.

ఉదయం ఆరింటికి మెలకువ వచ్చింది ఛాయకు. రాజీవ్ ఇంకా నిద్రపోతున్నాడు.

లేచెళ్ళి కిటికీ దగ్గర నిలబడి ప్రకృతి సౌందర్యాన్ని చూడబోయింది ఛాయ...

ఎదురుగా పెద్ద పెంటకుప్ప.. రాత్రి పారేసిన విస్తళ్ళకోసం కుక్కల







కొట్లాట... కోళ్ళు కాళ్ళతో కెలుకుతూ రొడ్డంతా విరజిమ్ముతున్న చెత్త. ఇంకా....." ఇహ చూడలేక కిటికీ మూసేసి బాత్రూంలో కెళ్ళి పంపు తిప్పితే నీళ్ళు రాలేదు. విసుగ్గా బయట కొచ్చిందామె

తలుపుమీద టకటకాశబ్దం...

బకెట్‌తో నీళ్ళు పట్టుకుని నిలబడ్డాడు బాలూ.

"కరెంటు లేదమ్మా, నీళ్ళు రావటల్లేదు" అంటూ రెండు బకెట్ల నీళ్ళు తెచ్చి బాత్రూంలో పెట్టాడు.

"ఇక్కడనుంచి కాలేజీ ఎంత దూరం?" అన్నది ఛాయ.

"రెండు మైళ్ళుంటుంది. కాలేజీకి బస్సుంది." అన్నాడు బాలు.

స్నానం, టిఫినూ పూర్తయ్యాక కాలేజీకి బయలుదేరిందామె.

ఒకటే ఎకనామిక్స్ లెక్చరర్ పోస్ట్.

ఇంటర్వ్యూకి ముప్పై మంది అభ్యర్థులు హాజరయ్యారు. అందులో ఒకతను ఆల్మోస్టాల్.. ఆ ఉద్యోగం తనదే నన్నంత ధీమాగా ఉన్నాడు. అతని గురించి అంతా గుసగుసలాడుకుంటున్నారు.

ఆఖరుకు... ఈ మారుమూల ఊళ్ళోకూడా తనకీ ఉద్యోగం దక్కేలాలేదు.

తను గోల్డ్ మెడలిస్ట్!

"డబ్బు, రికమండేషన్ కావాలి గానీ.. బోడి గోల్డ్‌మెడలెవరిక్కావాలి?" విరక్తిగా అనుకుంది చాయ.

తనకు తండ్రి లేడు ఉన్న ఒక్క తమ్ముడు రాజీవ్‌నీ, తల్లినీ పోషించాల్సిన బాధ్యత తనదే వాడు ఉద్యోగస్థుడై ఆమె బాధ్యత స్వీకరించాకే తనకి నిశ్చింత.

ఛాయను పిలిచారు.

ధరల విధానం గురించి అడిగితే తడుముకోకుండా చెప్పింది...

"సంపాదన విపరీతంగా పెరిగేకొద్దీ ఆహారంమీద పెట్టే ఖర్చు తగ్గుతుంది. విశదీకరించండి." అన్నాడొకాయన.

అర్థంలేని ప్రశ్న!

"సంపాదన పెరిగేకొద్దీ ఆహారంమీద పెట్టే ఖర్చు, తగ్గాలని ఎక్కడుంది? కొంచం తినొచ్చు. కానీ.. అది ఖరీదైన తిండి అయితే ఖర్చెలా తగ్గుతుందీ?

ఐమీన్... లేనివాడు రెండు రూపాయల ఖర్చుతో గిన్నెడు జొన్నకూడు తింటే.. ఉన్నవాడు రెండు రూపాయలతో యాపిల్ కొని తినొచ్చు.

క్వాంటిటీ తగ్గి, క్వాలిటీ పెరిగింది. ఖర్చేం తగ్గలేదు గదా?

అఫ్‌కోర్స్! కొందరి విషయంలో సంపాదన పెరిగేకొద్దీ, ఆకలి చచ్చిపోతుంది. సంతోషం, డబ్బు బలం కారణాలు కావచ్చు. అలాంటప్పుడు మీరన్నట్లు ఖర్చు తగ్గొచ్చు." అన్నదామె.

"మీక్లాస్‌లో కౌరవుల్లాగా వందమంది స్టూడెంట్స్ ఉంటారనుకోండి. మీరు అటెండెన్స్ వేస్తుంటే మాది మాదంటూ ఒకేసారి లేచి గొడవ మొదలెడతారు. ఎలా మానేజ్ చేస్తారు? ఇలాగే మిగిలినవి కూడా...."

"నేను మెంటల్‌గా, ఫిజికల్‌గా ఆరోగ్యంగానే ఉన్నాను అంచేత, కొందరికి వేసి కొందరికి ఆపను. మీరు కూడా ఆటవిక జాతికి చెందినవారు కాదని.. మర్యాద తెలిసిన వాళ్ళనీ నాకు బాగా తెలుసు . సో... కూర్చోండి వరసగా వేస్తాను." అని నచ్చ చెపుతాను

ఇంకాగోల చేస్తే హెడ్డుకు రిపోర్ట్ చేస్తాను. మరీ మించిపోతే .

కానీ అంతదాకా రాదు. నా క్లాసను కంట్రోల్ చేసుకోగల కెపాసిటీ నాకుందనే నా నమ్మకం. ఇలాగే మిగిలినవి కూడా..." అంటూ తనూ ఆపేసింది ఛాయ

ఇలా ఇంకొన్ని ప్రశ్నలతో ఇంటర్వ్యూ ముగిసింది. వచ్చేస్తుంటే విజయ అనే లెక్చరర్ పరిచయ మయింది కాకతాళీయంగా. అంతా విని "మీకే ఈ జాబ్ వస్తుంది చూడండి. డామ్ ష్యూర్" అన్నదామె

"థాంక్స్ అన్నది చాయ.

* * * * * *

కొన్ని రోజులు గడిచాక నిజంగానే పోస్టింగ్ ఆర్డర్స్ వచ్చాయి చాయకు, ఇందుకూరు కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్‌గా అపాయింట్ చేసినట్టు.

విజయ ఇల్లు చూసి పెట్టింది. తల్లి అన్నపూర్ణమ్మనూ, రాజీవ్‌నీ తీసుకుని ఇందుకూరు వచ్చేసింది ఛాయ. తను జాయినయి, రాజీవ్‌ని కూడా బి ఎ. లో చేర్పించింది.

తనున్నది రెండు గదుల పోర్షన్. ముందర వరండా. వెనక విశాలమైన పెరడు. పెరట్లోనే బావి ఉన్నాయి. మేడమీద ఒక గది ఉంది. ఇల్లు చాలా నచ్చింది చాయకు.

"మేడమీద గదిలో సుధీర్ అనే అతను ఉంటున్నాడు. పంచాయితీరాజ్‌లో జె. ఇ. గా పని చేస్తున్నాడు. మంచివాడే మాకు దూరపు చుట్టంకూడా." అన్నది విజయ.

ఆమె భర్త లాయరు పేరు రజనీకాంత్. సరదాగా, కలుపుగోలుగా ఉంటాడు. ఛాయా వాళ్ళందరినీ వచ్చిన రోజు తనింటికే భోజనానికి పిలిచింది విజయ.

"ఊరుగాని ఊర్లో వాళ్ళ కుటుంబం తోడుగా దొరికింది. నయంగదూ?" అన్న తల్లి మాటలకు నవ్వి వూరుకుంది ఛాయ

* * * * * * *

"ఈ రోజు మీరు బి. ఎ. క్లాస్ తీసుకుంటారా? చాలా అసాధ్యులు వాళ్ళు. ఇదే మొదటిసారిగదా మరి...." అన్నాడు హెడ్.

"పర్లేదు సార్. దానికే వెడతాను." అన్నది ఛాయ.

ఆమె వెళ్ళేసరికి క్లాస్‌లో కొందరు దరువేస్తున్నారు. ఒకడు పాడుతున్నాడు.

పక్కనుంచి వస్తూ కిటికీలో నుంచి తొంగి చూసిన ఛాయ నుద్దేశిస్తూ "సూడు పిన్నమ్మా, పాడు మేడం... కిటికీగుండా సూత్తా ఉన్నదీ.." అని పాడాడో విద్యార్థి.

అంతా గొల్లున నవ్వారు.

సాధ్యమైనంత మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూ క్లాస్‌లోకి అడుగు పెట్టిందామె...

సూటిగా పాఠంలోకి ఎంటరవకుండా జనరల్ నాలెడ్జి గురించి హ్యూమరస్‌గా చెప్పసాగింది.

"మేడం కథలు చెబుతోందిరోయ్. పాఠం కాదు," అంటూ డెస్క్‌ల మీద తలపెట్టుకు నిద్రపోతున్న మిగిలినవాళ్ళని కూడా లేపి శ్రద్ధగా విన్నారు స్టూడెంట్స్...

"ఫర్లేదు. నాట్ బ్యాడ్," అంటూ తనను తనే అభినందించుకుంది ఛాయ.

* * * * * *

మేడమీద గది కిటికీల్లో నుంచి పెరట్లోకి చూసిన సుధీర్ చూపులు బావి దగ్గర ఆగిపోయాయి....నీళ్ళు తోడుతోంది ఛాయ.

"తనకలాంటి భార్య దొరికితే బాగుండును. జలజలా పారే సెలయేరులా లేదామె. ప్రశాంతమైన సరస్సులా ఉంది. తనకలా ఉంటేనే ఇష్టం.

తన తరపున ఆమెనెవరడుగుతారు?

తనే వెళ్ళి అడిగేస్తే?

పళ్ళు రాలగొట్టొచ్చు.

ఒక మగాడు హటాత్తుగా ఎదురేగి "నిన్నే పెళ్లాడుతా".... అని సినిమా ఫక్కీలో రాగం తీస్తే ఏ ఆడపిల్లా వరించదు.

సమయం కలిసిరావాలి. గ్రహాలు అనుకూలంగా ఉన్నప్పుడు చూసి ఆమెతో మాట కలపాలి." అనుకున్నాడు సుధీర్.

"ఛాయా ఇహ చాల్లే. అలా ఒదిలెయ్యి. రాజీవ్ తోడుతాడు." లోపల్నుంచి అన్నపూర్ణమ్మ కేకేసింది.

ఛాయా! బానే ఉంది పేరుకూడా!

"ఓ వీరాంజనేయా. ఆమె నా ఛాయ అయేలా చూడు తండ్రి. నా మొదటి బిడ్డకు నీ పేరెట్టుకుంటాను." అని మొక్కుకోబోయి "ఔనూ... ఆయన బ్రహ్మచారి గదా. ఇలా జంటలు కలిపే పని అప్పగిస్తే ఆగ్రహిస్తాడేమో", అనుకుని ఆగిపోయాడు సుధీర్.

అతని చూపులామెను లోపలి గుమ్మం వరకూ సాగనంపాయి.

ఆ రోజునుంచి ఆమె పెరట్లో కొచ్చినప్పుడు వీలైనప్పుడల్లా ఓపికగా అటు చూస్తూంటాడతను.

ఎపుడో ఒకప్పుడామె తల పైకెత్తదూ? ఒక్కసారి చూస్తే... అప్రయత్నంగానైనా చెదురు, మదురుగా చూడక మానదు.

"తన మొహం అలాటిది!" అనుకున్నాడు సుధీర్.

* * * * * *

ఆదివారం విజయ ఆహ్వానం మీద వాళ్ళింటికెళ్ళింది ఛాయ.

అక్కడ రజనీకాంత్‌తో పేకాడుతున్న వ్యక్తిని పరిచయం చేస్తూ "ఇతను సుధీర్. మీ మేడమీద గదిలో ఉంటాడు. ఈమె ఛాయ. నీ కింది పోర్షన్‌లో ఉంది" అన్నది విజయ.

"నమస్కారమండీ," అతి వినయంగా చేతులు జోడించి కొంటెగా చూస్తూ అన్నాడు సుధీర్.

ఇతనికి తను తెలుసా! "నమస్తే", అన్నది తడబడుతూ ఛాయ.

అక్కడున్నంత సేపూ చనువుగా ఏదో ఒకటి మాట్లాడుతూ, కవ్విస్తూ ఆమెకు సన్నిహితంగా రావటానికి ప్రయత్నించాడతను. విజయకతను కజిన్ అవుతాడు. అంచేత ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదు ఛాయ. తరువాత జరిగిన కొన్ని కొన్ని సంఘటనల ప్రభావం వల్ల ఛాయ ఆలోచనల్లో చోటు చేసుకోగలిగాడు సుధీర్.

విజయ దగ్గర అతనికి చనువెక్కువ.

ఓ రోజు....

"నువ్వు ఛాయను ప్రేమిస్తున్నావు గదూ?" అన్నది విజయ అతనికి కాఫీ ఇచ్చి, ఎదురుగా ఉన్న కుర్చీలో తీరికగా కూర్చుంటూ.

"నా ప్రవర్తన అలాగే వుందా?" అన్నాడు సుధీర్.

"కనీసం... నాకు బాగా అర్థమవుతోంది."

"ఏం లాభం? అసలు వ్యక్తి... ఆమె ఏం పట్టించుకోటంలేదు."

"నువ్వు అడక్కపోయావా?"

"ఆ సందర్భం రావటంలేదు. అయినా.... జులాయి వెధవ అనుకుంటుందని భయం. అందుకే బయటపడలేకపోతున్నాను."

"నేను హెల్ప్ చేయనా?"

"నిజం?!"

"ప్రామిస్."

"థాంక్స్! థాంక్స్ ఫరెవ్వర్!" ఉద్వేగంగా అన్నాడు సుధీర్.

* * * * *

అది బి. ఎ. సెకెండియర్ క్లాసు....

పాఠం చెపుతోంది ఛాయ....

"ఈ రోజు కథ చెబుతానన్నావు గదా మేడం?" అన్నా డొక స్టూడెంట్ లేచి నిలబడి.

"మీరు'అనటం నేర్చుకోండి. ఎవర్నిబడితే వాళ్ళని 'నువ్వు' అని సంబోధించటం సభ్యతకాదు. ఇక్కడ ఇది తప్పుగా అనిపించకపోవచ్చు. కానీ... మరో ప్రాంతంలో ఈ అలవాటు ప్రాణాంతకంగా పరిణమిస్తుంది..."

ఛాయ మాటలు పూర్తికాకుండానే ఒక విద్యార్థి నేరుగా వచ్చేసి క్లాసులో కూర్చున్నాడు.

అతన్ని ఉద్దేశిస్తూ "ఇలా క్లాసులో జొరబడటం అనాగరికత అనిపించుకుంటుంది." "మే ఐ కమిన్," అని అడిగి రావటం మర్యాద. ఇదే అలవాటు చొప్పున ఏ ఇంటర్వ్యూకో వెళ్ళినప్పుడిలాగే దూసుకెడితే.... మెడబట్టి గెంటుతారు.

మీరు బి. ఎ. చదువుతున్నారు. ఆ మాత్రం మానసికంగా పరిణతి చెందకపోతే ఎలా?....

బ్రెయిన్ కత్తిలాంటిది. దాన్ని పదును పెట్టుకుని చక్కగా ఉపయోగించుకోవటం... నిర్లక్ష్యంగా వదిలేసి, తుప్పు పట్టించుకోవటం మన చేతుల్లో వుంటుంది...." పాఠంతో పాటు ఇలాంటివెన్నో చెప్పి, వాళ్ళలో మార్పు తేవాలని తహ తహలాడేది ఛాయ. ఆమె టీచింగ్ కెపాసిటీ, మాట తీరూ ఆ కాసేపూ వాళ్ళను మెస్మరైజ్ చేసినా "మళ్ళీ మామూలే"

క్లాసయ్యాక స్టాఫ్ రూంలో కెళ్ళి కూర్చుంది ఛాయ. విజయ కూడా అక్కడే ఉంది.

కొత్తగా చేరిన నందగోపాల్ అనే తెలుగు లెక్చరర్ ధుమ ధుమలాడుతూ ఛాయ వెనకాలే వచ్చాడు. అతని ముఖం ఎర్రగా కంది ఉన్నది....

"ఛీ, ఛీ, ఇంత మారుమూల ప్రాంతంలో ఉన్న కాలేజీకి లెక్చరర్‌గా రావటం నా దురదృష్టం. ఇక్కడ స్టూడెంట్స్‌కు పాఠం చెప్పటంకన్నా... పది గొర్రెల్ని కొని కాసుకోవటం మేలు. అవమానం లేకుండా బ్రతకవచ్చు." అంటూ గొణుగుతున్న అతన్ని చూసి "ఏం జరిగింది?" అన్నాడు బాటనీ లెక్చరర్ కూల్‌గా.

"నేను తెలుగు పాఠం చెబుతున్నానండీ, సంధులూ, సమాసాలూ అంటూ ఏదో కాస్త గ్రామరు ఏడవాలిగదా. సగం చెప్పానో లేదో ....

"ఏమిటో నీ గోల నందులూ ..." అంటూ ఒకడు రాగం అందుకుంటే మిగతా వాళ్ళు కోరస్... దరువులు. ఒకడు రైలింజన్‌లా కూస్తూ లేచి నిలబడ్డాడు. మిగతా వాళ్ళంతా వాడి వెనకాల ఒకళ్ళ చొక్కాలొకళ్ళు పట్టుకుని "చుక్...

# బ్లేజ్ ప్రస్తుతము ఇండియాకు అందిస్తున్నది విశ్వకోవకు చెందిన పరిమళాలను

ఇది ప్రపంచ విఖ్యాతి పొందినది
ఈ రహస్యము నాకే తెలుసు కదా.

దీప్తి నావల్






క్రొత్త **బ్లేజ్** పెర్ఫ్యూమ్స్

## సీయన్స్

సరిక్రొత్త బ్లేజ్ పరిమళాలు ఇదిగో ఇవే రెండు
ప్రపంచ కోవకు చెందిన సరిక్రొత్త పరిమళాలు
సీయన్స్ మరియు ట్రాన్స్ అందరికి అందుబా
టులోయుండే ధరకే లభిస్తాయి.

## ట్రాన్స్

# ఇంద్రుని గాథల అంతర్యం

## ధర్మపథం




— ఎం.ఎం.ఎ. వెంకటరమణయ్య

మన పురాణాల్లోని గాథలు చాలా విచిత్రంగా కనబడతాయి. వాటిని విని, ఇప్పటివారు, అవి అసత్యాలని ఆక్షేపించడం కూడా ఉన్నది కానీ, వాటిలోని అంతర్యాన్ని గ్రహిస్తే, గాథలు సబబుగానే ఉన్నట్లు అర్థమవుతుంది.

పూర్వం పర్వతాలకు రెక్కలుండేవని గాథ. ఆ పర్వతాలు ఎగిరి గ్రామాల మీదా, నగరాల మీదా పడి వాటిని నాశనం చేస్తూ ఉండేవట. దీన్ని తెలుసుకొని యింద్రుడు వజ్రాయుధం పూని వాటి రెక్కలను ఛేదించాడు. అందువల్ల అవి ఉన్న చోటు నుండి మరి కదలలేకపోయాయి. హిమవంతుని పుత్రుడగు మైనాకుడు మాత్రం ఎలాగో తప్పించుకొని, తనకు వజ్రాయుధపు దెబ్బ తగలకుండా సముద్రంలో మునిగి అక్కడనే స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. ఇదీ ఆ గాథలోని విషయం

దీనిలోని అంతర్యమేమిటంటే— ఇంద్రుడు వర్షాధిదేవత మేఘాలు అతని చేతిలో ఉన్నవి. ఆయన వాటి చేత ఉరిమిస్తాడు. పిడుగులు పడజేస్తాడు. పరిసరాలలోని ఉన్నత ప్రదేశాల మీదనే సామాన్యంగా పిడుగులు పడతాయి కొండలపై అవి పడి, వాటి పార్శ్వభాగాలను ముక్కలు చేస్తాయి. ఇదే పర్వత పక్షచ్ఛేదన. పిడుగే వజ్రాయుధం. మైనాక పర్వతం సముద్రంలో మునిగి ఉన్నందున దాని మీద పిడుగుపడే అవకాశం లేకపోయింది.

ఇంద్రధనుస్సు కూడా ఇటువంటిదే! వాన తుంపర పడుతున్నప్పుడు దానిపయి సూర్య కిరణాలు ప్రసరించినప్పుడు వానిలోని వివిధ వర్ణాల వల్ల సూర్యునికి ఎదురు దిక్కున రంగు రంగుల ధనురాకారం ఏర్పడుతుంది వర్షానికి సంబంధించి ఉన్నందున దానికి ఇంద్రధనుస్సనే పేరు వచ్చింది.

శ్రీకృష్ణుడు తన యాగాన్ని నిలిపి వేయించినందుకు కోపం వచ్చి, ఇంద్రుడు వారంరోజులు రాళ్ళ వాన కురిపించగా, యశోదానందనుడు, గోవర్ధనగిరిని ఎత్తి, దాని క్రింద గోపాలక కుటుంబాలను, పశువులను నిలిపి, కాపాడినట్లు మరొక గాథ ప్రసిద్ధంగా ఉన్నది కదా! దీని అంతర్యం కూడా తెలుసికోదగినదే!

వర్షాకాలంలో కారుమేఘాలు వ్యాపించి కొన్ని చోట్ల వారం, పదిరోజులపాటు ఎడతెగకుండా వడగళ్లతో వానలు కురియడం వింతయేమీ కాదు. గొల్లల నివాసాలు చిన్న చిన్న కుటీరాలేగాని, భవనాలు కావు. అట్టి వానల వల్ల ఇళ్లు కూలిపోనూ వచ్చు. జలమయాలూ కావచ్చు. అట్టి స్థితిలో గోపకులందరూ దారీ, తెన్నూ తెలియక శ్రీకృష్ణణ్ణే ప్రార్థించారు, తమ్మూ, గోవులనూ కాపాడాలని: ఆయన వాళ్ళకు ధైర్యం చెప్పి; ఆలోచించి, చేరువనున్న గోవర్ధన పర్వత గుహలలో వారినీ, గోవులనూ చేర్చి కాపాడాడు. వర్షాలు వెలిసిన తర్వాత వాళ్ళందరూ తిరిగి తమ తమ ఇళ్లను చేరుకున్నారు. మనం పురాణ గాథలను నిరసించకుండా, వాటి అంతరార్థాన్ని గ్రహిస్తే, వాటి ఔచిత్యం తేట పడుతుంది ★

# పడమట సంధ్యారాగం

చుక్ చుక్ అని శబ్దం చేసుకుంటూ బయటకెళ్ళిపోయారు. నేనొక్కణ్ణి క్లాసులో ఏం యేడుస్తాను? ఇంత అనాగరికపు మనుషుల్ని నా సర్వీసులో ఎక్కడా చూడలేదు!

నేను క్లాసును సరిగ్గా కంట్రోల్ చెయ్యటం లేదని ప్రిన్సిపాల్‌గారు నస.. .

ఏం కంట్రోల్ చేస్తామండీ? ఒకళ్ళా ఇద్దరా? ఒక్కో క్లాసులో వందమందికి తక్కువలేరు. కాస్త అనారోగ్యం మనిషయితే వాళ్ల ధాటికి ఢామ్మని చచ్చూరుకుంటాడు."

ఉక్రోషంతో ఎగిరెగిరిపడుతున్న నందగోపాల్ని చూస్తూ నవ్వాపుకోలేకపోతోంది చాయ

మిగతావాళ్ళు "ఇలాంటివిక్కడ మామూలే" అన్నట్లు మౌనంగా ఉండిపోయారు.

"ఇంపార్టెంట్ క్వశ్చన్స్ పెట్టివ్వు మేడం " అని స్టూడెంట్స్ వెంటపడుతుంటే "ఆ ఇంపార్టెంట్‌వి అయిదో పదో చదువుకెళ్ళి, తీరా అవి రాకపోతే ఫెయిలయి కూచోటమెందుకు? ఇంత తీజరుంది. మేం చెపుతాం. అన్నీ చదువుకుంటే.. ఏదొచ్చినా ఈజీగా రాయొచ్చుగా?" అని నచ్చచెప్పబోయిన ఛాయను వెర్రిదాన్ని చూసినట్లు చూశారు వాళ్ళు.

ఉట్టప్పుడంతా ఉల్లాసాగా తిరగటం...పరీక్షలు దగ్గరకొస్తుంటే ఆదరాబాదరా రాత్రింబవళ్ళు చదవటం... పరీక్షల టైంలో భయం. కంగారు... టెన్షన్... మెదడు ఎంప్టీ వెసెల్‌లా తయారయి... వచ్చిన ప్రశ్నే మర్చిపోవటం, ఒకదాని కింకొకటి రాయటం... కాపీల కోసం ఎదురు చూడటం... అవి కొట్ట నివ్వకుండా అడ్డుపడే ప్రిన్సిపాల్‌ని ఛడామడా తిట్టుకోటం. మళ్ళీ సెప్టెంబరు కోసం ఎదురు చూడటం...

ఇదంతా వాళ్ళ కలవాటయిన పాత కథ.

ఛాయ చెపుతున్న కొత్త కథ వాళ్ళ మనసుల్లో దూరేది కాదు.

రాజీవ్ మీద ఈ ప్రభావం పడకుండా వెయ్యి కళ్ళతో కాపాడుకొనేదామె

(ఇంకా ఉంది)

**sharp**

## మోనోబ్లాక్ పంపులు ఉపయోగించుట వలన మీరు పొందు పొదుపు సొమ్ముతో మీకు కావలసిన నిడుపునకు పైపు కొనండి.

Sharp Industries
COIMBATORE
TESTED

షార్ప్‌తో మీరు యెంతో పొదుపు చేస్తారు. మీకు కావలసిన నిడుపు పైపును ఉచితంగానే పొందినట్లవుతుంది. ఇది నిజంగా కల గాదు సుమా!

### మీరు పొదుపు చేయుటకు షార్ప్ యెలా సహాయపడుతుంది?

మీరు తక్కువ చెల్లిస్తారు... పోటీ నమూనాల ధరలు యింత కంటే 20% నుండి 75% వరకు అదనం పలుకుతూంటే! మీరు రు 1000 + స్థానిక పన్నులు మాత్రం చెల్లించండి అమర్చుటకు ప్రత్యేకమైన శ్రద్ధ తీసికోనవసరంలేని పంపును మీరు పొందగలరు. ఇది నడుపుటకు అయ్యే ఖర్చులలో 20% ఆదా యిస్తుంది.

అంతా పొదుపే .... షార్ప్ ఆధునిక సాంకేతిక నైపుణ్యం యొక్క ఫలితం కావడం వలననే

### షార్ప్ యెందుకంత తక్కువ బరువు గల పంపు?



షార్ప్ బరువు 10 కేజీలు మాత్రమే ఇది యితర నమూనాల కంటే దాదాపు మూడు రెట్లు తక్కువ. మేము కాస్టింగ్ పనులు చేయము దానికిబదులు షీట్ మెటల్ ఉపయోగిస్తాం వైండింగ్ కాయిల్‌ను మేము సులభం చేస్తాం దీనికి బదులు కాంపాక్ట్ సర్క్యూట్‌ను "బి" క్లాస్ ఇన్సులేటర్‌తో అమరుస్తాం.

### తక్కువ బరువు పని తనమునకు లోపం తెస్తుందా?



లేదు 8 మీటర్ల సక్షన్ లిఫ్ట్ శక్తితో 30 మీటర్ల మొత్తం యెత్తునకు నీరు తోడు శక్తిగలిగి అయిదవ అంతస్థునకుకూడా నీరు నివ్వగలదు

### తక్కువ బరువు యెలా లాభదాయకం?



పొదుపులు.... వాడిన సామగ్రి మరియు నడుప ఖర్చులద్వారా

సౌకర్యం....మీ వంట గది నుండి కూడా మీరు షార్ప్ పని చేయునట్లు చేయగలరు కుదిమట్టం షార్ప్‌నకు మిక్కిలి తక్కువ స్థలం చాలు దీనిని మరొక చోటికి సులభంగా తీసికొనిపోవచ్చు. నిజంగా శబ్దం లేనిది

Jaisons/SI/22/84 TEL

**షార్ప్-తక్కువ బరువుగలిగి అధిక పొదుపు నిచ్చునది**

మీ షార్ప్‌ను మా అధికారం పొందిన డీలర్ల ద్వారానే పొందండి

సేల్సు బ్రాంచి 136, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్–500 003 ఫోన్ 75960




**sharp Industries**
కాళప్పట్టి,
కోయంబత్తూరు–641 061.
ఫోన్ 87296/33854
తంతి SHARP TOOLS

ఊరంతా నిద్రాదేవి ఒడిలో మునిగిపోయి సేద తీరుతున్న వేళలో పత్రికలోని ప్రకటన మరోసారి చదివింది మహేశ్వరి. అప్పటికి మహేశ్వరి ఆ ప్రకటన చదవటం నూటొక్కసారి. కొన్ని సమస్యలకి, కొన్ని బాధలకి పరిష్కారం చూపే ఆ ప్రకటనని మహేశ్వరి వదలకుండా చదువుతూనే వుంది. వారం రోజుల-నుంచి చదువుతున్న ఆ ప్రకటనకి సంబంధించిన తుది నిర్ణయం ఈ రోజే తీసుకోవాలని నిర్ణయించు-కుంది. అందుకే అర్ధరాత్రి దాటిపోయినా నిద్ర-పోకుండా ఒంటరిగా ఒక్కతే అలా కుర్చీలో కూర్చుని ఆలోచిస్తూనే వుంది. అనారోగ్యంలో వున్న తల్లిని, వయస్సు పెద్దదైపోయిన తండ్రినీ చూశాక తను తీసుకోబోతున్న నిర్ణయం సరి అయినదే ననుకుంది. అలా చేస్తేనైనా కృంగి, కృశించి పోతున్న తల్లి, తండ్రుల మనసుల్లో సంతోషం కలుగుతుందేమో-ననుకుంది. తన ఊహలని, కలలని శిధిలంచేసి, ప్రకటన మరోసారి చదివి, ఆ పత్రిక అడ్రస్ కవరు మీద వ్రాసి బాక్స్ నెంబర్ వేసింది. తన వయసు వ్రాయకుండా వివరాలన్నీ కాగితం మీద వ్రాసి ఆ కాగితం కవరులో పెట్టి అతికించేసింది. అతికించిన కవర్ని వైపు రెండు క్షణాలు అలాగే చూసింది మహేశ్వరి ఆమె కళ్లల్లోంచి జారిన రెండు కన్నీటి బిందువులు కవరుమీదపడి క్రిందికి జారిపోయాయి. వారం రోజులనుంచి మహేశ్వరి మనసులో రేగుతున్న తుఫాను ఆరోజుతో ఆగిపోయింది. సుడిగుండాల వలయంలో చిక్కుకున్న ఆ చిన్నారి మనసు ఒడ్డుకు చేరుకుంది

ఈ విషయం తెలిస్తే అమ్మా, నాన్నా తనని క్షమించరు. ముఖ్యంగా తల్లి, తండ్రుల కోసమే తానీ పని చేస్తుందని చెబితే వారు నమ్మరు. నమ్మకముగా వారి అసమర్ధతకి వార్లో వారే కృంగిపోతారు. కన్నవాళ్ల మీదున్న తన బరువు దించుకోడానికి, వాళ్ల మనసులో తీరని సమస్యగా నిలిచిపోయిన తను, ఇన్నాళ్లకయినా, ఈ విధంగానైనా వాళ్ల సమస్యని పరిష్కారం చేయగులుగుతున్నా ననుకుంది.

భగవంతుడా ఎప్పుడూ ఏ పనీ ఎవరికి చెప్పకుండా చేయని నేను ఈనాడు స్వతంత్రించి ఓ నిర్ణయం తీసుకుంటున్నాను. దీనివల్ల నాతల్లి తండ్రుల మనసులకి ఏ బాధా కలిగించకు. ఇక నుంచయినా అమ్మా, నాన్నా తినే ఆ పూట ముద్దల అన్నంలో ఏ ముద్దలోనూ వారికంట కన్నీరు పడకుండా చూడు స్వామి' ఎదురుగా వున్న ఏడుకొండలస్వామి పటానికి రెండు చేతులు జోడించింది మహేశ్వరి. ఆమెకి సరిగ్గా వారం రోజుల క్రితం జరిగిన సంఘటన మదిలో మెదిలింది.

"మహీ- ఓ- మహీ" గట్టిగా పిలుస్తూ చెక్కగేటు తీసుకుని లేడి పిల్లలా గెంతుతూ అణువణువూ ఆనందంలో నాట్యం చేస్తుంటే చేతిలో శుభలేఖ పట్టుకుని, వంటగదిలో నున్న స్నేహితురాలి దగ్గరికి వెళ్లి గట్టిగా కౌగలించుకుని గిర్రున త్రిప్పింది సుకన్య.

సుకన్య చర్యకి ఊపిరాడక ఉక్కిరి బిక్కిరయింది. మహేశ్వరి.

"ఏమిటే, దేనికీ సంతోషం.బలవంతాన తన చుట్టూ బిగించి వున్న సుకన్య చేతులని తీస్తూ అంది.

"మరి.. .. మరో చుట్టూ చూసి మహేశ్వరి మెడలో రెండు చేతులువేసి చెవిలో రహస్యంగా చెప్పి. అంతవరకూ కనిపించ నివ్వకుండా వుంచిన శుభ-లేఖని మహేశ్వరికి చూపించింది.

"అలాగా" సంతోషం అని పంచదార డబ్బాలోని గుప్పెడు పంచదార తీసి స్నేహితురాలి నోట్లో-పోసింది మహేశ్వరి.

"మా సుకన్య త్వరలో పెళ్లి కూతురు కాబోతున్న-దన్నమాట." సిగ్గుపడుతూ తలవంచుకున్న సుకన్య చుబుకాన్ని పట్టి పైకెత్తుతూ అంది మహేశ్వరి.

"సిగ్గుల మొగ్గయి తలవూపింది సుకన్య.

"మహేశ్వరి, సుకన్య స్నేహితురాళ్ళు. వాళ్ల స్నేహం, స్కూళ్లదీ క్లాసుల్లోదికాదు. ఐదు సం.ల క్రితం మహేశ్వరి వుండే ఇంటికి రెండిల్లవతల ఇంట్లోకి కొత్తగా వచ్చేరు. సత్యనారాయణ లాయరుగారు. వారి పెద్దమ్మాయి సుకన్య. మహేశ్వరి కంటే నాలుగేళ్ళు చిన్నది. చదువు అంటే ఇష్టం లేక ఇంటర్‌లో ఆపేసింది సుకన్య. ఇరవై నాలుగ్గంటలూ చిరునవ్వు చెదరని ముఖంలో, ఏ బాధలూ, బాధ్యతలూ తెలియని అమాయకత్వంలో. ఎప్పుడూ వస పిట్టలా వాగే సుకన్య అంటే ఎంతో ఇష్టం మహేశ్వరికి. మహేశ్వరికి వున్న ఒకేఒక స్నేహితురాలు సుకన్య.

సుకన్య వివాహం అని తెలియగానే మన స్పూర్తిగా సంతోషించింది మహేశ్వరి. పీట వాల్చి అలా కూర్చుని అన్ని విషయాలు చెప్పవే అప్పుడు చూసి వెళ్లిన వారేనా" నెలరోజుల క్రితం సుకన్య పెళ్లి చూపులకి వచ్చి వెళ్లిన వారిని గుర్తు చేసు-కుంటూ అంది మహేశ్వరి. "అవునే ఆ సంబంధమే అన్ని విధాలా మీ సంబంధం మాకు నచ్చింది. ముహూర్తాలు పెట్టుకోవచ్చుని వాళ్ళు ఉత్తరం వ్రాశారు. అప్పట్నుంచీ ఇంట్లో ఒకటే హడావుడి. దూరంగా వున్నవాళ్లకి శుభలేఖలు పంపించటం కూడా జరిగిపోయింది. ఇంకో వారం రోజులే వుంది పెళ్లి. నువ్వు తప్పకుండా రావాలి మహీ" పీట మీద కూర్చుని అంది సుకన్య.

"ముద్దుగా, బొద్దుగా ముద్దబంతి పూవులా వున్న సుకన్య నుదుట ముద్దు పెట్టుకుంటూ అలాగే అంది మహేశ్వరి.

'ఎవరమ్మా వచ్చింది' ప్రక్కగదిలోనుంచి నీరసంగా అడిగింది అన్నపూర్ణమ్మ. "తల్లి మాట విని' రావే అమ్మ పిలుస్తుంది" అంటూ సుకన్య చేయి పట్టుకుని తల్లిమంచం దగ్గరికి తీసుకెళ్లింది మహేశ్వరి.

"ఏమ్మా బావున్నావా" ఆప్యాయంగా పలుకరించింది అన్నపూర్ణమ్మ.



# ఎవరు చూడని దేవుడు!

పి: ఇందుమతి

"బావున్నానండి."

"అమ్మకి చెప్పవే" మౌనంగా నిలబడ్డ స్నేహితురాలిని మోచేత్తో పొడుస్తూ అంది మహేశ్వరి.

"మరేనండి పిన్నిగారు... మరో సిగ్గుతో చెప్పలేక పోయింది సుకన్య.

"వసపిట్టలా వాగే సుకన్య నోటికి తాళం వేసినట్టుగా, మాట్లాడక పోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది. అన్నపూర్ణమ్మకి.

"ఇప్పుడే ఇలా సిగ్గుపడితే రేపు పెళ్ళిపీటల మీద ఎలా కూర్చుంటావే పిచ్చి తల్లీ" అని "అమ్మా సుకన్య పెళ్ళంట. శుభలేఖ ఇవ్వడానికి వచ్చింది" తల్లితో అంది మహేశ్వరి.

"అలాగా అమ్మా సంతోషం" నెమ్మదిగా మంచంలోనుంచి లేచి కూర్చుంది అన్నపూర్ణమ్మ సిగ్గు దొంతరలు ముఖంలో దోబూచులాటుతుంటే తలవంచుకుని నిలబడ్డ సుకన్యని చూసి ఇలా సిగ్గుపడే రోజు తన మహి జీవితంలో ఎప్పుడు వస్తుందా అని ఆలోచిస్తోంది అన్నపూర్ణమ్మ. కొన్ని క్షణాల తర్వాత. ప్రక్కనే వున్న పడక్కుర్చీలో కూర్చుని జానకి రామయ్యగార్కి, అన్నపూర్ణమ్మకి వెళుతున్నానని చెప్పిగేటు వరకూ వెళ్ళి గేటు దగ్గరినుంచి "మహీ తప్పకుండా రావాలి సుమా" అని హెచ్చరించి వెళ్ళిపోయింది సుకన్య.

"ఏమండీ" కనుమరుగైపోయిన సుకన్యనుంచి దృష్టి మరల్చి జానకీరామయ్యగారిని పిలిచింది అన్నపూర్ణమ్మ.

"ఏమిటి పూర్ణా" తల త్రిప్పి భార్యావైపు చూశారు.

"మన మహీకంటే నాలుగేళ్ళు చిన్నది కదండీ సుకన్య"

"చిన్నదైతేనేం కలవారి బిడ్డ" భార్యా మనసులో బాధని అర్థం చేసుకుని అన్నారు.

"ఏమండీ మన మహీకి మనం చనిపోయేలోపలైనా వివాహం చేయగల మంటారా" అన్నపూర్ణమ్మ గొంతులో ప్రతి ఫలించిన వేదనకి కలత చెందారు జానకీరామయ్యగారు. బాధగా భార్యా వైపు చూశారు. వయసుకంటే ముందే బాధలూ, పరిస్థితులూ, బాధ్యతా వార్ధక్యాన్ని తెచ్చిపెట్టాయి అన్నపూర్ణకి దిగులుతో కృంగి, కృశించిన శరీరం. మానసిక వేదనకి పూర్తిగా నెరిసిపోయిన తలా, ముడుతలు పడ్డ ముఖం. ఆ ముఖంలో ఎప్పుడూ కన్పించే దీనత్వం, అన్నింటికీ మించి కూతురి పెళ్ళిచేయలేక పోతున్నా మనే దిగులూ కొట్టొచ్చినట్లు కన్పడుతోంది.

"తప్పకుండా చేయగలం అన్నపూర్ణా "నువు నిశ్చింతగా వుండు" భార్యాకి ధైర్యం చెప్పారు. భార్యాకి ధైర్యం చెప్పడానికి అలా అన్నాడె కాని, కూతురి పెళ్ళి చేయుటమనేది తనకి అసాధ్యం రెండు పూటలా భార్యా, బిడ్డకి కడుపునిండా తిండి పెట్టలేని తను, కట్నాలూ, కానుకలూ పోసి కూతురి పెళ్ళి ఎలా చేయగలడు. తన మహీ పెళ్ళికోసం అప్పు అడగని



మనిషంటూ ఎవరూ లేరు. అడిగిన ప్రతి ఒక్కరూ తీసుకున్న అప్పు తీర్చగలిగే శక్తి తనకి లేదని ముఖం త్రిప్పేసుకున్నారు ప్రతిక్షణం కుమిలిపోవటం తప్ప తనేమీ చేయగలిగే స్థితిలో లేదు.

"ఇంకెన్నాళ్ళు ఇలా ధైర్యం చెబుతారండి. గుండెలో కొండంత బరువు పెట్టుకుని నిశ్చింతగా ఎలా వుండగలను" అంది అన్నపూర్ణమ్మ

అన్నపూర్ణమ్మ మాటలని కాదనలేక పోయారు జానకీ రామయ్యగారు.

"ఏమండీ మన ప్రాణాల్ని తీసుకునైనా సరే దాని మెళ్ళో తాళి కట్టేవాడెవడైనా ఉంటే తీసుకురండి" "మనసులో బాధని భరించలేక ఆవేశంగా అంది అన్నపూర్ణమ్మ. ఆమె ఆవేశం వెనుక వున్న ఆవేదనని అర్థం చేసుకుని కదిలిపోయారు జానకీ రామయ్య-గారు.

పూర్ణా ఏమిటా మాటలు" అరవై సంవత్సరాలు దాటిన జానకీరామయ్యగారు వణుకుతున్న స్వరంతో కోపంగా గద్దించారు.

"కట్నాలూ, కానుకలూ ఎలాగూ సమర్పించుకోలేం. అందుకే ప్రాణాల నయినా సమర్పించుకుంటామని చెప్పండి" రెండు చేతుల్లో ముఖం దాచుకుంది అన్నపూర్ణమ్మ.

"అన్నపూర్ణా నీకేమైనా పిచ్చి పట్టిందా" జానకీ రామయ్యగారిలో సహనం నశించి పోయింది.

"పిచ్చి పట్టినా బావుండేదండీ హాయిగా అడవులు పట్టుకుని తిరిగేదాన్ని. కన్నకూతురికి పెళ్ళి చేయలేక పోతున్నామని పడే మానసిక క్షోభకంటే అదేం ఎక్కువ కాదు. "ఏడుస్తూనే అంది. "అమ్మా ఏమిటమ్మా ఈ మాటలు" అంతవరకూ తన గురించే వాళ్ళు పడుతున్న" బాధలకి మౌనంగా మనసులో బాధ పడుతున్న మహేశ్వరి వంటింట్లోంచి బయ-టికి వచ్చింది.

"ఇంకేం చేయాలే తల్లీ నీ జీవితాన్ని కన్నీటి-మయం చేస్తున్నామే కాని, నీ మనసుకి ఏనాడైనా సంతోషాన్ని కలిగించామా చెప్పు తల్లీ. అమ్మా ఇంకా చదువుకోవాలని ఉందంటే చదివించే స్థోమతలేక పదవ తరగతితోటే ఆపేశాం. ఊరి విడిచి ఏదైనా ట్రయినింగ్‌కి వెళ్లాలని వున్నా ఈ ముసలి తల్లి తండ్రులకి దిక్కెవరూ లేరని ఆగిపోయావ్. అందరి తల్లితండ్రుల్లా నీ పెళ్ళిచేసి నిన్ను అత్త-వారింటికి పంపించలేక బాధ పడుతున్న తల్లి తండ్రులని చూసి వాళ్ళకో సమస్యగా మారిపోయానే అని బాధపడుతున్నావ్. బాధలూ, కన్నీళ్ళే తప్ప నీ జీవితానికీ, మనసుకీ ఏనాడైనా సంతోషం వున్నదా చెప్పు తల్లీ. చెప్పమ్మా. మీ నాన్నగారు చేసిన మాష్టారు ఉద్యోగంలో నీకేమీ మిగల్చలేక పోయారు. నలుగురి కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసేసరికి మీ నాన్నగారి ఒంట్లోని రక్తమంతా ఆవిరైపోయింది. మన పరిస్థితి అర్థం చేసుకుని, నీ అందం, గుణం మెచ్చి, మన పరువూ ప్రతిష్టా, మంచితనం తెలుసుకుని ఏ ఒక్కడైనా నీ మెడలో తాళి కట్టకపోతాడా అని

# "ఎదురుచూడని దేవుడు"

ఇన్నాళ్ళూ ఆశించాను ఆ ఆశ నెరవేరలేదని నాకు తెలిసిపోయిందమ్మా. మాష్టారి కుటుంబమంటే మనుష్యులకే కాక ఆ భగవంతుడికి కూడా దయ-లేకుండా పోయిందమ్మా. అమ్మా మహీ మమ్మల్ని క్షమించమ్మా క్షమించు" ఆయాసం ఎక్కువై పోవటంలో ఆగిపోయింది అన్నపూర్ణమ్మ. నీరసానికి ఆమె శరీరం సన్నగా కంపిచింది.

"అమ్మా నీ కెన్నిసార్లు చెప్పాను. నా పెళ్ళి గురించి ఆలోచించవద్దని. నాకు పెళ్ళంటే ఇష్టం లేదమ్మా. పెళ్ళి చేసుకోక పోయినా బ్రతక వచ్చమ్మా" బాధగా అంది మహేశ్వరి. పెళ్ళి చేసుకోవాలనే కోరిక మహేశ్వరిలో లేదు.

"తప్పమ్మా తప్పు అలా అనకూడదు. నీ పెళ్ళి చూస్తేనే మా మనసులు శాంతిస్తాయమ్మా అప్పటి వరకూ మాకు మనశ్శాంతి ఉండదు."

'ఏ శుభలేఖ వచ్చినా, ఏ పెద్ద మనిషి వచ్చి మంచీ, చెడూ అడిగినా ఇంట్లో ఇలా జరుగటం తినే ఆ కాస్త భోజనం తినకుండా ఆకలి లేదంటూ పస్తు పడుకోవటం అలవాటై పోయింది ఆ ముగ్గురికి

"తన మూలంగా తల్లి తండ్రులు పడుతున్న బాధని చూడలేక ఒక్కొక్కసారి ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది. మహేశ్వరికి కాని పెళ్ళి కాబోయే ఆడపిల్ల ఆత్మహత్య చేసుకుందని తెలిస్తే తను ఏ తప్పు చేయకపోయినా నలుగురూ నాలుగు రకాలుగా కథలల్లి ప్రచారం చేస్తారు ఆ కథలు విన్న అమ్మా నాన్నా కూతురి చావుకు తమ అసమర్థతే కారణమని ఆ క్షణంలోనే గుండె పగిలి మరణిస్తారు. తన బ్రతుకే కాకుండా తన మరణం కూడా వారికి మనశ్శాంతిని కలుగజేయదని తెలుసుకుని ఆ ప్రయత్నం విరమించుకుంది మహేశ్వరి. తనకి ఆ కోరిక లేకపోయినా తల్లి తండ్రులకోసం ఎలాగైనా వివాహం చేసుకోవాలనిపించింది మహేశ్వరికి.

తను ఎవరినీ ప్రేమించక పోవటంవల్ల ప్రేమించిన వాడు వచ్చి పెళ్ళి చేసుకుంటాడనే ఆశలేదు మహేశ్వరికి.

తామేమీ కట్నాలూ, కానుకలూ ఇచ్చుకోలేక పోవటంవల్ల ఏ పెళ్ళిళ్ళ పేరయ్యా తమ ఇంటికి రాడని తెలుసు.

అందుకే ఆ రోజే పత్రికలో వెలువడిన ఓ ప్రకటన మహేశ్వరిని ఎంతగానో ఆకర్షించింది.

మునిగిపోతున్న వాడికి చిన్న ఆధారం దొరికినట్లు, మృత్యు ముఖంలో వున్నవాడికి ఆరోగ్యం చేకూరినట్లు. బాధామయమైన మహేశ్వరి మనసుకి పన్నీటి జల్లులా కనిపించింది

వివాహ వేదికలోని ఆ ప్రకటనలో అతడు అందరిలా డిగ్రీ కావాలంటూ అడుగలేదు. ఉద్యోగం అడుగ లేదు. బిజినెస్ పెట్టుకోవడానికి ఆర్థిక స్థోమత కావాలంటూ కూడా అడుగలేదు.

కేవలం, చనిపోయిన తన మొదటి భార్యా ముగ్గురి పిల్లలకి తల్లి ప్రేమను అందించగలిగి, తనని భర్తగా ఆదరించే ముప్పై సంవత్సరాలు దాటిన స్త్రీ కావాలని, వితంతువు అయినా ఫరవాలేదని వ్రాశాడు.

తను వితంతువు కాకపోయినా, ముప్పై సంవత్సరాలు దాటిన స్త్రీ కాకపోయినా, ఆ పిల్లల్ని కన్న తల్లిలా చూసుకోగలదు. అతడిని భర్తలా గౌరవించగలదు. ముఖ్యంగా తన తల్లిదండ్రుల సంతోషం తనకి కావాలి. అనుకుంది మహేశ్వరి. పాతకాలంనాటి గోడ గడియారం టంగ్ మని గంట కొట్టటంతో ఆలోచనల్లోంచి ఉలిక్కిపడింది మహేశ్వరి. తలఎత్తి గడియారం వంక చూసింది. ఒకటిన్నర, చాలా రాత్రి అయిపోయిందే అనుకుంటూ మంచినీళ్ళు తాగి వచ్చి తల్లి ప్రక్కన పడుకుంది మహేశ్వరి. అలసిన ఆమెను నిద్రాదేవి లాలనగా తన ఒడిలోకి తీసుకుంది.

* * * *

అంత త్వరగా అతడి దగ్గరినుంచి ఉత్తరం వస్తుందని ఊహించని మహేశ్వరి వారం రోజుల తర్వాత తన పేరు మీద వచ్చిన కవరుని ఆతృతగా అందుకుంది.

మహేశ్వరిగార్కి,

నేను పంపిన ప్రకటన చదివి మీరు వ్రాసిన ఉత్తరం చేరినది. విషయాలు తెలిశాయి. నేను ఇక్కడి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో లెక్చరర్‌గా జాబ్ చేస్తున్నాను. నాకు ఇద్దరు బాబులూ, ఒక పాపా ఉన్నారు. వాళ్ళు ముగ్గురూ పదేళ్ళలోపు వారు. అయిదేళ్ళ క్రితం బస్ యాక్సిడెంట్‌లో నా భార్యా ఈ లోకం విడిచి వెళ్ళిపోయింది. అప్పటి నుంచీ నా పిల్లల్ని మా అత్తగారే పెంచుతుంది. ఆవిడకి ఇప్పుడు వయస్సు ఎక్కువ అవటంలో పిల్లల్ని చూచే ఓపిక తగ్గిపోయింది. అందుకే వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. వారికి పోయిన తల్లిని తిరిగి తీసుకురాలేక పోయినా ఆ తల్లి స్థానంలో మరో తల్లిని పెట్టి ఆ లోటు తీర్చాలనుకున్నాను. పిల్లల తల్లిగానే కాకుండా నా భార్యగా మిమ్మల్ని అనురాగంతో చూసుకోగలను. మీరు మా యింటికి వస్తే పూర్తిగా అన్ని వివరాలు తెలుసుకుని నేను మీకు నచ్చితే వివాహం చేసుకో వచ్చును. మీరు వస్తారని మీ రాకకోసం ఎదురు చూస్తుంటాను –

ఇట్లు,

జయరామ్.

ఉత్తరం మడిచి కవరులో పెట్టింది మహేశ్వరి.

తనకి నచ్చటం, నచ్చకపోవటం అంటూ ఏదీ లేదు.

అతడు ఎలా వున్నా, ఎలాటి వాడైనా అతడిని వివాహం చేసుకోడానికేసిద్ధపడింది తను.

❝



ప్రెషర్ కుక్కర్స్ డీలర్‌నైన నేను, ఏది భద్రతగల కుక్కర్లో ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను.

**అయితే వాటి అన్నింటిలోను** అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్. కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా.

## న్యూ ప్రెస్టీజ్ ఎంత భద్రమైనదో చూడండి

**100% SAFE**

నూటికి నూరు పాళ్ళుభద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్' పూడుకొనిపో యినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది.




ఇది కుక్కర్‌కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణ మించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ **అయితే**, మితిమీరి ఏర్పడిన సీటి ఆవిరి జి.ఆర్.ఎస్‌ను బయటకు నెట్టుతుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది. గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో లోపలికి నెట్టండి.



అంతే, ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ **అయితే** ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది- సర్వదా. ❞

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు







**ప్రెస్టీజ్**

ttk తయారి.

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3B TEL 85

అతడి ఉత్తరాన్ని బట్టి అతడు మంచి వాడేనని మనస్సులో మారుమూల ఎక్కడో చెబుతుంది.

అది మాత్రం నిజమేననుకుంది మహేశ్వరి.

అదృష్టవశాత్తూ అతడి ఊరు తమ ఊరికి దగ్గరే. కేవలం గంటన్నర బస్ ప్రయాణం. ఉదయం వెళ్ళి సాయంత్రానికి తిరిగి రాగలదు.

కాని అమ్మా, నాన్నకి ఎలా చెప్పటం, చెప్పకుండా వెళ్ళాలంటే బాధనిపిస్తుంది. చెబితే ఆ రెండో పెళ్ళి వాడినా మేము ఉన్నా మనుకున్నావా చచ్చా మనుకున్నావా అంటుంది. ఆ ఆవేశంలో అమ్మ ఏదైనా అఘాయిత్యానికైనా పాల్పడవచ్చు. అమ్మకి పట్టుదల ఎక్కువ. చేసుకోకపోతే తన గురించి ఇంట్లో బాధలూ, కన్నీళ్ళూ తప్పవు. ఇప్పుడెలా చేసుకున్నా, చేసుకోకపోయినా అమ్మకి బాధే. కొన్ని క్షణాలు అలాగే ఆగిపోయింది. తన తల మీద పడే తలంబ్రాల కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూచే అమ్మ, తనలోని అసమర్థతకి అనుక్షణం కుమిలిపోయే నాన్న జ్ఞాపకం రావటంతో ఏది ఏమైనా సరే తానీ పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంది. ముందు అమ్మా నాన్నకి తెలియనివ్వకుండా తన తల మీద అక్షింతలు పడ్డాక నెమ్మదిగా నచ్చచెప్పవచ్చులే అనుకుంది. అలా అనుకున్నాక స్థిమితపడ్డ మనసుతో ఫలానా రోజు వస్తున్నానంటూ జయరామ్‌కి ఉత్తరం వ్రాసి ప్రక్కింటి కుర్రవాడితో పోస్టుకి పంపించింది మహేశ్వరి.

## "ఎదురుచూడని దేవుడు"

మహేశ్వరి బయలుదేరి వెళ్ళే రోజు రానే వచ్చింది. ఇంతవరకూ ఉత్తరాల సంగతి అమ్మా, నాన్నకి తెలియనివ్వకుండా జాగ్రత్తపడింది. ఈ రోజు ప్రయాణం సంగతి తెలియనివ్వకుండా జాగ్రత్తపడితే, అదృష్టంవల్ల అతడు ఈ వివాహానికి ఒప్పుకుంటే ఆ తర్వాత అమ్మా నాన్నకి నెమ్మదిగా చెప్పుకోవచ్చులే అనుకుంది. ఆ అభిప్రాయంతో చకచకా లేచి నీళ్ళు పెట్టుకుని స్నానం చేసింది. ఉప్మా చేసి తల్లీతండ్రికి పెట్టి వెంటనే వంట మొదలు పెట్టింది మహేశ్వరి. త్వరత్వరగా వంట ముగించేసి తల్లి ప్రక్కనే వచ్చి కూర్చుంది.

సన్నగా పుల్లలా వున్న తల్లి చేతిని ఆప్యాయంగా తన చేతిల్లోకి తీసుకుని వెళ్ళమంటుందో, వద్దంటుందో తెలియని సందేహాల మధ్య "అమ్మా ప్రక్క ఊరిలో నా స్నేహితురాలి పెళ్ళి వుంది. వెళ్ళి సాయంత్రం లోపల వచ్చేస్తానమ్మా" అంది.

"ఏమిటమ్మా స్నేహితురాలి పెళ్ళికి ఒక్క దానివీ మరో ఊరు వెళ్ళి వస్తావా వద్దమ్మా వద్దు. ఆడపిల్లవి ఒంటరిగానా, అసలే రోజులు బాగా లేవు" ఒంటరిగా కూతురిని పంపించటం ఏ మాత్రం ఇష్టంలేదు అన్నపూర్ణమ్మకి.

"అమ్మా నేనెప్పుడూ ఇలా ఎక్కడికీ వెళతానని అడగ లేదు కదమ్మా, అమ్మా ప్లీజ్ ఈ ఒక్కసారికి



"స్టీలంస్టీల్‌ప్లాంట్" ప్రాంగణంలో ఇటీవల జరిగిన వివిధభాషల నాటిక పోటీలలో "సేలంలో ఉన్న తెలుగు సంఘం "లేపాక్షి"చే ప్రదర్శింపబడిన "మాజీ ఎం. ఎల్. ఏ" నాటికలో ఒక సన్నివేశం. ఈ నాటిక ఉత్తమనటుని బహుమతి గెలుచుకున్నది.

పంపించమ్మా, సాయంత్రంలోపు తిరిగి వచ్చేస్తాను మా అమ్మ మంచిది. నన్ను తప్పకుండా పంపిస్తుంది కదమ్మా" తల్లి మెడ చుట్టూ రెండు చేతులువేసి గారంగా అంది మహేశ్వరి.

"పరిస్థితులు అర్థం చేసుకున్న కూతురిలో ఎప్పుడూ ముభావం, గంభీరమూ తప్ప అల్లరి తనం చూడని అన్నపూర్ణమ్మ ఎంతో ఆశ్చర్యపోయింది "పోనీలే పూర్ణా స్నేహితురాలి పెళ్ళి చూడాలని దానికి ఉత్సాహంగా ఉంది కాబోలు, దాని ఉత్సాహాన్ని కాదనకు" అన్నారు జానకి రామయ్యగారు

"సరే వెళ్ళమ్మా వెళ్ళి పెందరాడి వచ్చేసెయ్ ఆలస్యం అయితే నీకోసం ఎదురు చూడటమే తప్ప అక్కడికి రాలేరు మీ నాన్నగారు" భర్త మాటని కాదనలేక, కూతురి ఉత్సాహాన్ని పాడు చేయటం ఇష్టంలేక చివరికి ఒప్పుకుంది అన్నపూర్ణమ్మ ఒప్పుకుందే కాని ఆమె మనసంతా అన్య మనస్కంగానే వుంది.

ఎకువ బయట తిరిగే అలవాటులేని కూతురు పరాయి ఊరెళ్ళి క్షేమంగా వస్తుందా ఎంత సాయంత్రం లోపు వచ్చేస్తానన్నా, వేళకి బస్‌లు దొరుకుతాయా, ఆ దొరికిన బస్‌లు మార్గమధ్యంలో చెడిపోకుండా, ఉంటాయా, మహీ వచ్చేసరికి చీకటైపోదుగదా. ఆ తల్లి మనస్సులోని ఊహలు ఎక్కడెక్కడికో ఎగిరిపోసాగాయి.

తన ప్రయాణానికి అంత త్వరగా అనుమతి దొరికినందుకు మనసులో మురిసిపోయింది మహేశ్వరి వెంటనే దుస్తులు మార్చుకోడానికి వంట గదిలోకి వెళ్ళింది. గబగబా చీర విప్పి తనకున్న మంచి చీరల్లోని ఓ రోజ్‌కలర్ చీరతీసి కట్టుకుంది మ్యాచింగ్ బ్లౌజ్ వేసుకుంది. తలంటుకున్న పొడవాటి కురులను జడ అల్లి చివర రబ్బర్ బాండ్ పెట్టింది. రెండు చేతులనిండుగా గాజులు వేసుకుని నుదుట ఎర్రని బొట్టు గుండ్రంగా పెట్టుకుంది కళ్ళకి సన్నగా కాటుక పెట్టి అందమైన తన రూపాన్ని అద్దంలో చూసుకుని తృప్తిగా నిట్టూర్చింది చేతిలోకి చిన్న పర్సు తీసుకుని తల్లి తండ్రికి వెళ్ళొస్తానని చెప్పి బయలుదేరింది మహేశ్వరి

* * * *

కాలింగ్ బెల్ మ్రోగటంతో వెళ్ళి తలుపు తెరిచింది వంట మనిషి రంగమ్మ

ఎదురుగా కొంగు భుజాల చుట్టూ కప్పుకుని అందం, అణుకువా, సంస్కారం గల యువతిని చూసి "ఎవరమ్మా నీవు, ఎవరు కావాలి ఆప్యాయంగా అడిగింది రంగమ్మ "జయరామ్‌గారి ఇల్లు ఇదేనాండి వారు లోపల ఉన్నారా?" తలుపు తెరిచి యాభై సంవత్సరాలు దాటిన వితంతు స్త్రీని చూసి అడిగింది మహేశ్వరి.

మృదు మధురమైన ఆమె కంఠస్వరాన్ని లోపల



# LOANS



**HURRY UP !!!**

**Register your name by remitting Rs. 35/- and avail Loans.**

## AVAILABLE LOANS EVEN WITHOUT MORTGAGE / PLEDGE / GUARANTORS, THROUGHOUT INDIA.

1. A simple interest, at the fixed rate of 21% per annum shall be charged, on debit balance, for all types of loans.
2. Loans may be sanctioned within a period of 15 days from the date of receipt of completed loan documents.
3. **LOANS SHALL BE GIVEN FOR THE FOLLOWING PURPOSES :** (i) Construction of House, Hotel, Theatre, pumpset House, Poultry & Piggery Sheds, Industrial Premises etc.; (ii) Purchase of Vehicles i.e. Truck, Taxi, Auto-Rickshaw, Bus and Two-wheeler etc.; (iii) Land Development, Crop Loans, Purchase of Electric Motors, Diesel/Electric Pump-sets, Tractors, Power Tillers and Harvesters etc.; (iv) Sinking of New Well; (v) Dairy, Poultry and Piggery Farming; (vi) Development or Establishment of an Industry; (vii) To Develop and to Start any Business/Contractorship; (viii) Loans for Film Industry; (ix) Marriage; (x) Personal Loans; (xi) To Purchase Old Vehicles, Machineries, Factories, Plants, Houses, Theatres etc. and for their Repairs; (xii) To Redeem Old Debts (Loans); (xiii) For Working Capital; (xiv) To Purchase of Plots, Estates, Agricultural Lands and other Properties.
4. Repayment period may be allowed to the maximum of 10 years by monthly / Quarterly / half-yearly / yearly instalments.
5. **ELIGIBILITY TO APPLY FOR LOAN**—Only Registered members are eligible to apply for loan.
6. **HAVE YOU REGISTERED YOUR NAME UNDER LOAN SCHEME ?**—If not please hurry up and do not miss this golden opportunity and get your name registered by remitting a sum of Rs. 35/- (Rupee thirty five only) towards registration fee.

**NOTE**—The necessary details and guidance for raising loan and loan documents shall be sent to our registered members only as per usual procedure.

**Send immediately your amount (Rs. 35/-) by M.O. / I.P.O. / Bank Draft towards Registration Fee to :**




## SATNA SYNDICATE BANKER

**SATNA – 485 001 (M.P.)** Ph. 3007

Registered with Govt. of India and No. assigned as A / 31639 / 81

**an indigenous banker ....the name you can trust.**

● **For Agency Details remit Rs. 10/—** ●

మెచ్చుకుని ఉన్నారమ్మా ఇక్కడ వుండండి. బాబు గారిని పిలుస్తాను." లోపలికి వెళ్ళింది. రంగమ్మ.

**చుట్టూ పూల తోట మధ్య పొందికగా ఉన్న పొదరిల్లులా వున్న అందమైన ఆ డాబా ఇంటిని ఆశక్తిగా చూస్తుండి పోయింది. మహేశ్వరి.**

**కాలేజికి సెలవుపెట్టి మహేశ్వరి కోసం ఎదురు చూస్తున్న జయరామ్ రంగమ్మ చెప్పిన కబురు విని చదువుతున్న పేపర్ ప్రక్కన పెట్టేసి బయటికి వచ్చాడు.**

**గుమ్మంలో పచ్చని ఛాయలో, చక్కని ముఖ కవళికలో, సన్నగా, సుకుమారంగా జాజి తీగలా వున్న అందమైన ఇరవై రెండు సంవత్సరాల యువతిని చూసి షాక్ తిన్నాడు జయరామ్. ఆ షాక్‌లో నుంచి త్వరగా కోలుకో లేక పోయాడు.**

**చూసిన వెంటనే ఎదుటి మనిషిలో గౌరవం ఆత్మీయతా భావం వెలువడేలా చేసే ఈ చిన్నారి సౌమ్యమూర్తేనా మహేశ్వరి అంటే.**

**ముప్పయి సంవత్సరాలు దాటిన ఏ వి[illegible]కంతు స్త్రీయో అనుకున్నాడు తను. తను కోరు[illegible]న్నది కూడా అలాటి స్త్రీనే.**

**ఓమైగాడ్, తన ఊహకి, వాస్తవానికి ఎంత తేడా.**

**ఒక వేళ ఈమె మహేశ్వరియేనా లేక మ[illegible]రెవరైనా అమ్మాయి. తన అడ్రస్ పొరపాటు పడి తన ఇంటికి వచ్చిందా అదే అయి వుంటుందిలే అనుకున్నాడు.**

అతడు అనుకుంటున్నది అబద్ధం అ[illegible]న్నట్లుగా "నమస్కారమండీ నా పేరు మహేశ్వరి నేను వ్రాసిన ఉత్తరం మీకు చేరినదనుకుంటాను." [illegible]కర్తవ్యం మరచి తన వైపు ఆశ్చర్యంగా చూస్తున్న నలభై సంవత్సరాల వ్యక్తిని జయరామ్‌గా [illegible]భావించి అంది మహేశ్వరి.

"నమస్తే లోపలికి రండి" సందేహాలన్ని ప్రక్కకి నెట్టి సాదరంగా లోపలికి ఆహ్వానించాడు. జయరామ్.

అతడి వెనుక అడుగులు వేసింది. మహేశ్వరి.

"కూర్చోండి. డ్రాయింగ్ రూమ్‌లోని సోఫాని చూపెడుతూ అన్నాడు.

సోఫాలో కూర్చుని గోడలకి తగిలించి వున్న అందమైన ప్రకృతి దృశ్యాల ను చూడసాగింది మహేశ్వరి.

మహేశ్వరి ఎదుట ఉన్న మరో సోఫాలో కూర్చుంటూ అన్నాడు జయరామ్.

"మహేశ్వరిగారూ అన్ని వివరాలు తెలిసే మీకు ఇష్టమని మీరు ఈ వివాహానికి అంగీకరిస్తున్నారా"

అంత చిన్న వయస్సులో మహేశ్వరి తన లాంటి రెండో పెళ్ళి వాడిని కోరుకోవటంలో ఉన్న కారణమేమిటో అర్థం కాలేదు జయరామ్‌కి.

అవునండి అన్ని వివరాలు తెలిసే మీకు ఇష్టమైతే మిమ్మల్ని వివాహం చేసుకోవాలనుకుంటున్నాను." తెల్లని రంగులో, అక్కడక్కడా నెరిసిన వెంట్రుకలో [illegible] బలంగా ఉం[illegible]ది, తెల్లని లాల్చీ పైజామా

## "ఎదురుచూడని దేవుడు"

☆☆☆☆☆☆☆☆☆☆☆☆☆☆ ☆☆☆☆

[illegible] తన్న [illegible] దృశ్యాన్ని మరొసారి మనసులో జ్ఞాపకం చేసుకుంటూ తలవంచుకుని అన్నది మహేశ్వరి. మహేశ్వరి మనసులో ఓ నిర్ణయం తప్ప నునుసిగ్గులూ, కలవరపాట్లూ లేవు.

"స్వచ్ఛతతో కూడిన నిర్మలమైన ఆమె ముఖంలో అమాయకత్వమే తప్ప మరో భావం కల్పించలేదు జయరామ్‌కి.

బస్ ప్రయాణానికి చెదిరిన ఆమె తలనీ అలసినట్లుగా వున్న ఆమె ముఖాన్ని చూసి,

"మహేశ్వరిగారూ ముందుగా వెళ్ళి ముఖం కడుక్కుని రండి అన్ని విషయాలూ తర్వాత మాట్లాడుకుందాం" మహేశ్వరితో అని రంగమ్మ అంటూ పిలచాడు జయరామ్.

"అమిటి బాబూ" చీర కొంగుకి చేతులు తుడుచుకుంటూ వచ్చింది. రంగమ్మ.

"రంగమ్మా మహేశ్వరి గారికి బాత్ రూమ్ చూపించు" అన్నాడు

"ఇలా రామ్మా" అంది రంగమ్మ.

ప్రయాణపు బడలిక, బస్‌లో ఒత్తిడివల్ల చికాకుగా ఉన్న మహేశ్వరికి చల్లని నీటితో ముఖం కడుక్కోవాలనిపించడం వల్ల మౌనంగా రంగమ్మ వెనుకనే వెళ్ళింది.

"ఇదుగో ఇదేనమ్మా బాత్‌రూమ్ లోపల సోప్, టవలూ వున్నాయి." రంగమ్మ మాటలకి "అలాగే నంటూ" లోపలికి వెళ్ళింది మహేశ్వరి.

**ముఖం కడుక్కుని బయటికి వచ్చాక, రంగమ్మ అందించిన కుంకుమ భరిణె లోంచి కుంకుమ తీసుకుని నుదుట గుండ్రంగా బొట్టు పెట్టుకుని వచ్చి సోఫాలో కూర్చుంది మహేశ్వరి.**

రంగమ్మ **అందించిన టీ కప్పుల్లో ఒకటి మహేశ్వరికి అందించి మరొకటి తను తీసుకున్నాడు జయరామ్.**

**చల్లటి నీటితో ముఖం కడుక్కుని వేడివేడి టీ త్రాగాక ప్రయాణపు బడలిక పూర్తిగా తగ్గి పోయింది మహేశ్వరికి. కొన్ని క్షణాల తర్వాత.**

**ఖాళీ కప్పు ప్రక్కన పెడుతూ అన్నాడు జయరామ్.**

'మహేశ్వరి గారూ నా తల్లి తండ్రులు నా చిన్నతనంలోనే పోయారు. మా మేనమామే నన్ను పెంచి పెద్ద చేసి చదువు చెపించారు. మా మేనమామకి ఒక్కతే కూతురు. తన పేరు రాజేశ్వరి. రాజేశ్వరికి నేనంటే ఎంతో ఇష్టం, నేను కూడా రాజేశ్వరిని మనస్ఫూర్తిగా ప్రేమించాను. మా ప్రేమని అర్థం చేసుకున్న మా మేనమామగారు మా ఇద్దరికీ వైభవంగా వివాహం జరిపించారు. లోకంలో మా

[illegible]ంత అదృష్టవంతు లెవరూ లేరని ఎంతగానో మురిసి పోయాము. మా మురిపాన్ని చూడలేని ఆ భగవంతుడు, పిల్లలని నా దగ్గర వదిలి ప్రక్కవారిలో స్నేహితురాలు పెళ్ళికి వెళ్ళివస్తున్న నా రాజీని తన దగ్గరికి తీసుకుని వెళ్ళిపోయాడు. నేను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన నా రాజీ నాకు కనిపించని దూరానికి వెళ్ళి పోయింది. చిన్నప్పటి నుంచి నాతో కలిసి, ఆడీ పాడీ నన్ను లాలించి దగ్గరకి తీసుకున్న రాజీ, ఒంటరితన మంటే ఏమిటో తెలియనివ్వకుండా నన్ను అంటి పెట్టుకుని వుండే నా రాజీ నన్ను ఒంటరివాడిని చేసి వెళ్ళి పోయింది. నన్ను తన దగ్గరికి రానీయకుండా తన ప్రతిరూపాలని నా కాళ్ళకి బంధంగా వేసి మరీ వెళ్ళి పోయింది. రాజీ మరణం నన్ను పిచ్చి వాడిని చేసింది. పుట్టిన ఒకే ఒక కూతురు తమని అర్థాంతరంగా వదిలి వెళ్ళి పోవటం మా అత్త మామల్ని మానసికంగా కృంగదీసింది. వెళ్ళి పోయిన రాజీని మరచిపోలేక, ఆ రాజీని,రాజీకి పుట్టిన ముగ్గురి పిల్లల్లో వెతుక్కుంటూ కాలం గడుపుతూన్నాను. కాని ముందుకు పోతున్న కాలం వారిలోని ఓపికను హరించి వేస్తుంది. అందుకే నా పిల్లల్ని ఇక్కడికి తీసుకు రావాలని నిర్ణయించుకున్నాను. నా పిల్లల్ని కన్న తల్లిలా హృదయానికి హత్తుకునే ఓ అమ్మ కావాలని ప్రకటన వేయించాను."

రెండు క్షణాలు ఆగి మళ్ళీ అన్నాడు.

"మహేశ్వరిగారూ నా గురించి మీకు అంతా చెప్పాను. ఇక మిమ్మల్ని చూసిన దగ్గర నుంచి నేను ఊహించిన మహేశ్వరికీ, మీకూ చాలా తేడా కన్పించడంతో, ఆశ్చర్య పోయాను. అన్ని వివరాలు తెలిసి కూడా మీరు నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారంటే దానికి బలమైన కారణమేదో ఉండి ఉంటుంది. మీకేమీ అభ్యంతరం లేకపోతే దానికి కారణమేమిటో చెప్పండి" తలవంచుకుని కూర్చుని ఉన్న మహేశ్వరి వైపు చూస్తూ అన్నాడు.

తలఎత్తి అతడి వైపు చూసింది మహేశ్వరి.

అతడిలో ఆవేశంలేదు, కోరిక లేదు, అధికారం లేదు, హేళనలేదు. మంచితనం, మానవత్వం, సౌమ్యం ఉంది. నిర్మలంగా, నిశ్చలంగా ఉన్న అతడి కళ్ళలో పెద్దవాళ్ళు పసిపాపల వైపు చూసే చూపుల్లోని కరుణా ఆప్యాయతా, అనురాగం కన్పించాయి. మహేశ్వరికి. అతడు సంస్కారవంతుడని గ్రహించింది. అతడిని వివాహం చేసుకోవాలనే ఆమె నిర్ణయంలో ఏ మార్పు రాలేదు.

అతడివైపు చూస్తూ నెమ్మదిగా అంది.

"జయరామ్‌గారూ మీరూ అనుకున్నట్లుగా నేను మిమ్మల్ని వివాహం చేసుకోటానికి కారణాలు ఉన్నాయి. ముందుగా నేను మధ్య తరగతి తల్లి తండ్రులకు ఉన్న అయిదుగురు ఆడపిల్లల్లో ఆఖరి దాన్ని కావటం నాకు డబ్బుతో భర్తని కొనుక్కునే ఆర్థిక స్తోమత లేకపోవటం, నా తల మీద పడే తలంబ్రాలని చూడాలని తపన పడే నా తల్లి తండ్రుల మనసుకి సంతోషం కలిగించడం [illegible]

# ACTION AND GAIN

## జీవన్‌టోన్ క్రియాశీలత మరియు ప్రయోజనం

బలహీనమైన, అనారోగ్యమైన కణాలకు మరింత రక్తప్రసారం జరిపి ఆరోగ్యం కల్పిస్తుంది. శక్తిని పెంచి కండరాల పెరుగులకు దోహదం చేస్తుంది. ఒక సీసా ఔషధం సేవించిన తర్వాత మీ ఆరోగ్య అవసరాలకు మరెన్ని సీసాలు సేవించాలో మీరే నిర్ణయించవచ్చు. మీ ఆరోగ్యం సరిగా లేకపోతే ఎన్నో జబ్బులు వస్తాయి. మీకు చక్కటి ఆరోగ్యం, బలం, దారుఢ్యం. కండరాలు సమకూరిన తర్వాత ఈ ఔషధాన్ని సేవించడం నిలిపివేయడం మంచిది.






JEEVANTONE PRODUCTS P. B. 880
17/2 Cambridge Road, Bangalore-8

**Sole Distributor**
Sanjeevini Pharmaceuticals
39/188, Vaddigeri Kurnool — 1

**Ask for one 85 Picture Calendar**

## న్యూఢిల్లీ లేఖ

(5 వ పేజీ తరువాయి)

మూడు బాంకులకి చెందిన ఛైర్మన్‌లని ఉద్యోగాల నుంచి తొలగించారు లండన్‌లో. తదితర చోట్ల జరిగిన దుర్వినియోగమే దానికి కారణం. సేతియా వ్యవహారంలో మూడువందల కోట్ల రూపాయల పైగా దుర్వినియోగం జరిగింది. స్వరాజ్‌పాల్ వ్యవహారంలో ఒక బాంక్ ఇరుక్కున్నది. దానిక సంబంధించిన ప్రధానమైన వ్యక్తుల ఉద్యోగాలు ఊడిపోయాయి. కాని ఇంత పెద్ద ఎత్తున జరిగిన ఈ వ్యవహారం వాళ్ల రాజకీయ పెద్దలకి తెలియకుండా జరిగించంటే నమ్మటం కష్టం. ఆ బాంక్‌లు అంత పెద్ద మొత్తాలకి నీళ్లు వదులుకోవాల్సిందే పన్నులు కట్టేవారే ఆ నష్టాన్ని భరించాల్సి ఉంటుంది. అవి పన్ను కట్టేవారి బాంక్‌లేకదా మరి' అయితే ఆ డబ్బు అకారణంగా అదృశ్యం అయి-

పోలేదు. దానివల్ల ఎవరో కొందరు అపారమైన లాభం పొందే వుంటారు. ఎవరు ఏమేం చేసింది దానిలో ఉన్న వారికే తెలుసు. అయినా విచారణ-వల్ల ఏదీ బయటకి రాదు. ఎవరో ఒకళ్లు పట్టు-బడవచ్చు కాని సేతి స్పెయిన్‌లో ఉంటాడు, మిగతా వారు బాగా డబ్బు చేసుకొని ఎక్కడ వాళ్లక్కడ తప్పుకొంటారు.

ఈ ప్రభుత్వ రంగంలో సర్వత్రా కనిపించే అంశం ఒకటి ఉంది. పంచవర్ష ప్రణాళికలు అయినా, జాతీయ బాంక్‌లు అయినా రాజకీయనాయకుల చేతికందే పనిచేస్తాయి. ఈ దేశంలో అవినీతికి అదే మూల కారణం జాతీయ బాంక్‌లన్నింటిని తిరిగి ప్రైవేటు రంగంలోకి తీసుకువస్తే అవి మరింత శ్రద్ధగా పని చేయడమే కాక వాటిలో పని చేసే ఉద్యోగులు కూడా మరింత మర్యాదగా వ్యవహ-రించడం కనిపిస్తుంది. అంతే కాకుండా నల్ల-డబ్బుని అరికట్టేందుకు వారుకూడా తోడ్పడ గలుగు-తారు. అత్యున్నత శిఖరాలని అందుకున్న ఈ వ్యాపారం రాజకీయ నాయకులు తమవంతు వాటాని కొల్లగొట్టుకు పోవడానికి తప్ప సోషలిజానికీ, దేశ సంక్షేమానికి ఏ విధంగానూ దోహదం చెయ్యదు. ప్రభుత్వరంగం ఎంత పెద్దదిగా ఉంటే అవినీతికూడా అంత భారీ ఎత్తున ఉంటుంది. యూరోప్‌లో ఎక్కువ అవినీతి ఉన్నదేశం ఇటలీ అక్కడ ప్రభుత్వ-రంగం మనదేశంలోలాగే చాలా పెద్దది. అతి తక్కువ అవినీతి గలదేశం డెన్మార్క్ అక్కడ అసలు ప్రభుత్వ రంగం లేనేలేదు. మీ వ్యాపారంతో ఎవరికీ ఎలాంటి సంబంధం ఉండదు. అందువల్ల అక్కడ రాజకీయ నాయకులకి లంచం ఇవ్వాల్సిన పనిలేదు. పరి శ్రమలు స్థాపించడానికి, ఖరీదైన వాటి దిగుమతి లైసెన్సులు, పర్మిట్లు అక్కడ రాజకీయ నాయకులు ఇవ్వరు. మీ వ్యాపారం అంతా స్వయంగా మీరె చూసుకోవాలి. మరొకరి ప్రమేయం దానిలో ఉండదు. అందుకే డెన్మార్క్‌లో నల్ల డబ్బులేదు □

## "ఎదురు చూడని దేవుడు"

క్షణం ఆగి మళ్లీ అంది జయరామ్‌గారూ మాది మధ్య తరగతి కుటుంబం, ఉన్నవారికీ, లేని వారికీ లేని కొన్ని కట్టుబాట్లూ, ఆచారాలూ మధ్య తరగతి వారి నరనరాల్లో జీర్ణించుకుపోయాయి. మా నాన్న గారు ఎలిమెంటరీ స్కూల్ మాష్టారు. మా నాన్న గారికి అయిదుగురు సంతానం. ఆ అయిదుగురూ ఆడపిల్లలే కావటం మా నాన్నగారికి మనశ్శాంతిని పోగొట్టింది. పిల్లలు పెరుగుతూ వుంటే కొన్ని కొన్ని కోరికలకి సమాధికడుతూ, అప్పులు చేస్తూ, ఉన్న కొద్దిపాటి ఆస్తి పాస్తులను అమ్ముకుంటూ ఒక్కొక్క అమ్మాయికి, పెళ్లి చేస్తూ వచ్చారు. ముగ్గురమ్మాయిల పెళ్లిళ్ళు చేసేసరికి మా నాన్న గారికి రిటైర్‌మెంట్ ఆర్డర్స్ చేతికి వచ్చాయి. ఆ ఆర్డర్స్‌తో పాటు వచ్చిన డబ్బులో నాలుగవ అమ్మాయి పెళ్లి అయిందనిపించారు. ఇక మిగిలింది శిథిలమై పోతున్న చిన్న పెంకుటిల్లూ, పెళ్లికి సిద్ధంగా ఉన్న ఆఖరి కూతురూనూ, అప్పటికే మా నాన్నగారి ఒంట్లో రక్తమంతా హరించుకు పోయింది. కూతురి పెళ్లి తలపెట్టడానికి కూడా చేతిలో చిల్లి గవ్వలేదు. ఎక్కడా పైసా అప్పు పుట్టలేదు. వచ్చే పెన్షను రెండు పూటలా తినడానికే సరిపోయేదికాదు. ఇక కూతురి పెళ్లి ఎలా చేయగలము అన్న ఆలోచనలో, అంతకు మించి ఏ సుఖమూ, సంతోషమూ లేకుండా కూతురి జీవితం కన్నీటిమయం చేస్తున్నామనే బాధతో అనుక్షణం తమలో తాము కుమిలి పోయేవారు మా అమ్మా, నాన్నా, నా మూలంగా వారు పడే బాధ చూస్తుంటే నా గుండె నిస్సహాయంగా కన్నీరు కార్చేది. నేను ఎందుకు పుట్టానా అని బాధపడే దాన్ని. ఆ పరి స్థితుల్లో నేనేం చెయాలో తోచని స్థితిలో మీ ప్రకటన చదివాను. నా తల్లి దండ్రులకి సంతోషం కలిగించడమే కాకుండా నా జీవితానికి ఓ తోడు లభిస్తుందని ఆశించాను. మనసుని అర్థం చేసు కుని, మనసున, మనస్సై కలసి పోయే వ్యక్తి లభిం చాలే కాని అతడి మంచి వ్యక్తిత్వం ముందు అతడి వయసు అడ్డురాదు. అందుకే మీ ప్రకటన చదివి ఉత్తరం వ్రాశాను. జయరామ్‌గారూ నేను మీకు నచ్చితే, మీకు నామీద ఏ కొంచెమైనా ప్రేమా జాలీ అనేవి ఉంటే మనం చేసుకో బోయే ఈ వివాహానికి ముందు మీరు రెండో పెళ్లి వారనీ, మీకు ముగ్గురు పిల్లలు ఉన్నారనీ ముందుగా మా తల్లి దండ్రులకి తెలియనివ్వకండి. ఆ తర్వాత వారికి నే నెలాగో సర్ది చెప్తాను. ఏ పేదతల్లి తండ్రులైనా కూతురి సుఖాన్నే కోరు కుంటారు కదా.

జయరామ్‌గారూ మరో విషయం. మా తల్లి దండ్రులు సంతోషం కోసమే కాకుండా నా కోసం కూడా చేసుకునే ఈ వివాహంవల్ల మీ పిల్లలకూ, మీకూ ఎటువంటి బాధా కలుగ నివ్వనని ప్రామిస్ చేస్తున్నాను." అప్రయత్నంగా మహేశ్వరి కళ్ళు నీటితో నిండాయి. ఆ నీళ్లు నిండిన కళ్లని అతడికి చూపించటం ఇష్టంలేక తలవంచుకుని చేతి వేళ్ల వైపు చూస్తుండి పోయింది మహేశ్వరి.

**పెళ్లి కాబోయే మధ్య తరగతి అమ్మాయిల మనస్సుల్లో ఎంతటి సుడిగాలులు వీస్తుంటాయో అర్థమయింది జయరామ్‌కి. ఆ సుడిగాలుల్లో ఎంత మంది అమ్మాయిల జీవితాలు తెగిన గాలిపటాల్లా ఎగిరిపోతున్నాయో, ఆ ఎగిరిపోయిన గాలిపటాలు ఎలాటి ముళ్ల కంచెల్లో చిక్కుబడి పోతున్నాయో అర్థం చేసుకున్న జయరామ్ మనసు కొన్ని క్షణాలు బాధతో నిండిపోయింది.**

మహేశ్వరిని చూసిన మొదటి క్షణం నుంచి మహేశ్వరి పట్ల అతడికి తెలియకుండానే అతడి మనసులో క్షణ క్షణానికీ పెరిగి పోతున్న అనురాగం సింహాసన మంత ఎత్తులోకి ఎదిగి పోయింది. ఆ అనురాగపు సింహాసనం మీద మహేశ్వరిని కూర్చో బెట్టి అవిరామంగా కారే మహేశ్వరి కళ్లలోని ఆనంద భాష్పాలను తనివి తీరా చూడాలనిపించింది జయ రామ్‌కి.

అతడికి ఆ క్షణంలో అందమైన ఒక అతని రూపం మదిలో మెదిలింది. ఏదో నిశ్చయానికి వచ్చిన వాడిలా.

"మహేశ్వరి గారూ వారం రోజుల్లో మీకు అన్ని విషయాలూ తెలుపుతూ ఉత్తరం వ్రాస్తాను. అది చదివి మీరు వివాహానికి సిద్ధంగా ఉండండి అన్నాడు,

"సరే మరి నేను వెళ్లి వస్తానండి" అంటూ సోఫాలో నుంచి లేచింది మహేశ్వరి.

"తప్పక వివాహం జరుగుతుంది. ఇక నుంచీ మీరేమీ బాధ పడకండి. గేటు వరకూ వచ్చి అన్నాడు జయరామ్.

"అలాగే" తమ వివాహం జరుగుతుందనే ఆశతో చిరునవ్వుతో అతడికి వీడ్కోలు చెప్పింది మహేశ్వరి.

"భార్గవా మహేశ్వరిని వివాహం చేసుకుంటావా"

మరునాటి సాయంత్రం తోటలో కర్చీలు వేయించు కుని కూర్చున్నాక మహేశ్వరి గురించి పూర్తిగా చెప్పి అతడి అభిప్రాయాన్ని అడిగాడు జయరామ్.

జయరామ్ పని చేసే కాలేజీలోనే సంవత్సరం క్రితం ఇంగ్లీష్ లెక్చరర్‌గా కొత్తగా వచ్చి చేరాడు భార్గవ భార్గవ్ అవివాహితుడైన పాతికేళ్ల యువ కుడు. భార్గవ్ అందగాడే కాకుండా తెలివితేటలుకల బుద్ధిమంతుడైన యువకుడని భార్గవ వచ్చిన నెల రోజుల్లోనే తెలుసుకున్నాడు జయరామ్.

నా అన్నవాళ్లు ఎవరూ లేని, కష్టపడి చదివి అభివృద్ధిలోకి వచ్చిన భార్గవ్ అంటే ఎంతో ఇష్టం జయరామ్‌కి. భార్గవ్‌ని స్వంత తమ్ముడిగా అభిమా

సంగా చూసుకునేవాడు తన ఇంట్లోనే కలసి ఉందా మని జయరామ్ ఎంత చెప్పినా వినకుండా ప్రతి రోజూ జయరామ్‌ని కలుసుకోడానికి వీలుగా ఉంటుందని జయరామ్ ఉండే వీధిలో నే గది అద్దెకు తీసుకుని ఉండేవాడు భార్గవ్.

ప్రతి ఆదివారం జయరామ్ ఇంట్లోనే భో జనం చేసి రాత్రికి రూమ్‌కి వెళ్ళేవాడు. తన ఒంటరి జీవితంలో స్నేహితుడిగా, ఆత్మీయుడిగా తనను అభిమానించే జయరామ్ అంటే భార్గవ్‌కి ఎంతో ఇష్టం. తన కంటే పెద్దవాడైన తనని స్వంత తమ్ముడిలా ఆదరించే జయరామ్ స్నేహం లభించటం తన అదృష్టంగా భావిస్తాడు భార్గవ్.

ఈ రోజు జయరామ్ మహేశ్వరి గురించి చెబితే అతడి మనసులో ఆనంద తరంగాలు ఉవ్వెత్తున లేచాయి.

**"జయా కన్న తల్లి తండ్రుల ప్రేమా, తోబుట్టువుల ప్రేమా ఎలా ఉంటుందో తెలియని నాకు అన్ని ప్రేమలూ అందించావ్. అంతే కాకుండా నా వివాహం చక్కని సంస్కారవంతమైన అమ్మాయితో జరుపుతానని నిశ్చయించుకున్న నీకు నేనే విధంగా కృతజ్ఞతలు చెప్పాలో అర్థం కావటంలేదు." కృతజ్ఞతా భావంతో అన్నాడు భార్గవ్.**

"మనలో మనకి కృతజ్ఞతలు ఎందుకురా పిచ్చివాడా ఏ కట్న కానుకలూ ఆశించకుండా మహేశ్వరిని పెళ్ళి చేసుకోవాలనుకునే నీ మంచి మనసుకి నేనే కృతజ్ఞతలు అవునా" అన్నాడు జయరావ్.

"జయా ఇంకెప్పుడూ అలా అనకు" భార్గవ్ గొంతులో వేలువడిన బాధకి చలించిపోయి "భార్గానీ మనసు నా కెప్పుడో తెలుసు" పద టిఫిన్ చేద్దాం" నవ్వుతూ భార్గవ్ భుజం మీద చెయ్యేసి ఆప్యాయంగా లోపలికి తీసుకెళ్ళాడు జయరామ్.

* * * *

ఇద్దరి తరపున పెళ్ళి పెద్ద తనే అయి దేవుని ఎదుట ఆడంబరంగా వివాహం జరిపించాడు జయరామ్. కలలో కూడా ఊహించని విధంగా మహీ పెళ్ళి చక్కని ఈడూ జోడైన కుర్రవాడితో ఆడంబరంగా జరుగుతుంటే కొన్ని క్షణాలు కలో నిజమో అర్థం కాలేదు అన్నపూర్ణమ్మకి.

కూతురి తల మీద పసుపు పచ్చని తలంబ్రాలు ముత్యాల్లా జారుతుంటే చూస్తూ అధిక సంతోషాన్ని ఆపుకోలేని అన్నపూర్ణమ్మ కళ్ళల్లోంచి ఆనందాశ్రువులు జల జలా రాలుతున్నాయి. మనసున నిండిన ఆనందంతో ఆమె గొంతు మూగబోయింది.

జానకీరామయ్యగారి పరిస్థితి కూడా అలాగే వుంది. ఎదురు చూడని దేవుడు ఎదుటికి వచ్చి అడగకుండానే వరమిస్తే మనసులో ఆనంద తరంగాలు ఎగిసి పడుతుంటే ఎదురుగా నిలిచి వున్న ఆ దేవుడికి ఏ విధంగా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థం కాక

# ఇ'వేమన' పద్యాలు

మీ వారు ఇవాళ సన్యాసం పుచ్చుకుంటున్నారని తెలిసి, ఒసారి చూసి పోదామని వచ్చా!...



ఎఱిగి చేయుపూజ లెన్నడు చెడిపోదు
మొదటి పట్టునెపుడు వదల రాదు
మొదలు చెడిన పూజ మొనబట్టి నిలుచునా
విశ్వదాభిరామ వినురవేమ.

సున్నితమైన తన అర చేతులను అతడి పాదాలకి ఆన్చి కళ్ళకి అద్దుకుంది మహేశ్వరి.

పాదాల మీద నీటి చుక్కలు పడడంతో ఉలిక్కి పడ్డాడు జయరాం. పచ్చని పసుపు బట్టలతో వంగి కాళ్ళకి పాదాభివందనం చేస్తున్న మహేశ్వరిని ఆప్యాయంగా పైకి లేపాడు జయరామ్.

తల మీద అక్కడక్కడా నిలిచి పోయిన తలంబ్రాలు, నుదుట ఎర్రని తిలకం, బుగ్గన కాటుక చుక్క, మెడలో పచ్చని పసుపు తాడు, పాదాలకి పారాణి, అన్నింటికీ మించి మహేశ్వరి ముఖంలో వెల్లి విరుస్తున్న సంతోషరేఖల్ని చూశాక జయరామ్ మనసు తృప్తి నిండిపోయింది

తల వంచుకుని నిల్చున్న మహేశ్వరి చుబుకాన్ని వ్రేలితో నెమ్మదిగా పైకి ఎత్తాడు జయరామ్.

విశాలమైన ఆమె కాటుక కళ్ళల్లోంచి ముత్యాల్లా జారుతున్న ఆనందాశ్రువులని తృప్తి నిండిన మనసుతో కనురెప్ప వేయకుండా చూస్తుండిపోయాడు జయరామ్. □




## ఎ.యస్ – హైదరాబాద్

నా వయస్సు 24 సంవత్సరములు. నేను మలద్వారము లేకుండా పుట్టాను. ఆదేరోజు ఆపరేషన్ చేశారు. తిరిగి 11 నెలల తరువాత మరల చేశారు. నేను మూత్ర విసర్జన చేసేటప్పుడు మలద్వారము నించికూడా వస్తుంది. అలాగే మూత్ర ద్వారమునుండి మలము కొద్ది కొద్దిగా వస్తుంది. మూత్రము వెళ్లిన ప్రతిసారి మూత్రము మల ద్వారము నుంచి విధిగా వస్తుంది. దీనికి ఆపరేషన్ ఏమైనా అవసరం అవుతుందా? లేక మందుల వలన తగ్గుతుందా? ఉపేక్షిస్తే ఏమైనా ప్రమాదమా? ఈ విషయంలో ఎక్కడ ఎవరిని సంప్రదించాలో పూర్తి వివరాలు తెలుపండి.

★ దీనిని రెక్టో యూరెత్రల్ లేక రెక్టో వెసైకల్ ఫిస్టులా అని అంటారు. ఫిస్టులా ఉన్న ప్రాంతాన్నిపట్టి పై మాటలమువాడటం జరుగుతుంది. దీనికి తప్పక శస్త్ర చికిత్స అవసరం.

ఆపరేషన్ చేసేముందు సరిగ్గా ఫిస్టులా మార్గాన్ని కనుగొనటానికి కొన్ని పరీక్షలు చేస్తారు. మీరు మీ ఊళ్లోఉన్న ప్రముఖ వైద్యులను సంప్రదించండి.

## ఇ. పి – మద్రాసు

ఒకసారి మతిస్థిరం తప్పిన వారికి చికిత్స తీసుకుని నయమయిన తరువాత తిరిగి వచ్చే అవకాశం వుందా ?

★ తిరిగి వచ్చేది రానిదీ వారికి అలా మతిస్థిరం తప్పేటట్లు చేసిన పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. అదే పరిస్థితులు ఇంకా ఉంటూ ఉంటే మరలా రాకూడదనేమీ లేదు. పరిస్థితులు మెరుగైతే తిరిగి ఈ జబ్బు రానవసరం లేదు.

## కె. కె. ఆర్ – నంద్యాల

నాకు ప్రస్తుతం 3 వ కాన్పు అవబోతున్నది. ఆపరేషన్ చేయించుకోవాలని అనుకుంటున్నాను. ట్యూబెక్టమీ కాన్పు అయిన ఎన్ని రోజులకు చేయించుకొన వచ్చును ? పునఃసమాగమం ఎన్నిరోజులకు జరుపవచ్చును ? మరియు లెప్రోస్కోపిక్ ఆపరేషన్ పైన వివిధ అనుమానములున్నాయి. ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్లలో ఏది మంచిది. వివరముగా తెలుపగలరని ఆశిస్తున్నాను.

★ ట్యూబెక్టమీ కాన్పు అయిన వారం లోపల చేయించుకోవటం మంచిది. ప్రస్తుతం కాన్పుతో నిమిత్తంలేకుండా లాపరోస్కోపిక్ స్టెరిలైజేషన్ చేస్తున్నారు.

కాన్పు అయిన కొన్ని రోజులకే రతిక్రియ జరపగలిగినా, అలా చేయటం భావ్యంకాదు. కనీసం 2, 3 నెలలు ఆగడం ఎంతైనా మంచిది.

కొత్త పద్ధతి వచ్చినపుడు అనుమానాలుండటం సహజమే ! అన్ని ఆపరేషన్లు మంచివే ! వ్యక్తుల మానసిక దృక్పథాన్ననుసరించి పద్ధతిని ఎన్నుకోవలసి ఉంటుంది. □

సీరియల్

# రాగసంధ్య

## కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

గడియారం పన్నెండు గంటలు కొట్టింది సూర్యుడు నడినెత్తి మీదకు వచ్చి మండిస్తున్నాడు ఋతుధర్మంగా ఆకులు వర్షంలా చెట్లనుంచి రాలుతున్నయి ప్రొద్దుటి చల్లదనం క్రమేపీ తరిగిపోయి ఎండలో తీక్ష్యము వృద్ధిపొందింది అచేతనంగా చేష్టలు దక్కి కూర్చున్న సంధ్యను మంగి తట్టిలేపింది

ఇదేం దమ్మాయిగారూ! ఇంత ఎండలో కూకున్నారు రండి- బోంచేద్దురు- గాని-

నాకొద్దు- నువ్వు తిను మంగీ-' సంధ్య ముభావంగా సమాధాన మిచ్చింది

ఎడారి లాంటి ఆ సంసారంలో సంధ్యకు మంగి ఒయాసిస్‌లా చల్ల-దనాన్నిస్తుంది మంగితో వద్దనుకున్నా సంధ్యకు చనువు ఎక్కువ చామన-చాయగా వున్నా మంచి వయసు బిగువుతో మంగి అందంగా వుంటుంది మంగిని చూస్తున్న కొద్దీ సంధ్య మనసులో చిత్రమైన ఆలోచనలు రావటం మొదలు పెట్టినయి పురుగులా మంగి రూపం సంధ్య మెదడును తొలచసాగింది

ఏందమ్మగారూ! అట్టా సూత్తున్నారు-" మంగి సిగ్గుపడింది

మంగి, నిన్నొక మాటడుగుతాను- దాచకుండా నిజం చెప్తావా'

అడగండ సందేహంగా అంది మంగి

క్షణం ఆగింది సంధ్య

మంగీ' మీ అయ్యగారికి డబ్బుంది- అందం వుంది ఈ వయసులో వున్న నీవు వంటరిగా ఈ ఇంట్లో పని చేస్తున్నావంటే- నిన్ను చూస్తే నాకు జాలేస్తున్నది నీ కక్కడ ఏ రక్షణ వున్నది' మీ అయ్యగారు నిన్ను

మంగి ముఖం చూసిన సంధ్య ఆగిపోయింది మంగి ముఖం కత్తివేటుకి నెత్తురు చుక్కలేనట్టు పాలిపోయింది పెదవులు కొద్దిగా కంపించ సాగినయి

> జరిగిన కథ-9 : సంధ్య మధులు ప్రేమించుకొన్నారు. మధు ఫ్రెండు శ్రీకాంత్ అంటే సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీత గీతకు మూర్తి అంటె ఇష్టం మధుకు నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది మూర్తి తన భార్య పిచ్చిదని గీతతో చెప్పాడు. మధు చెల్లెలు భవిష్యత్తు బాగుకై మాధవిని పెళ్లి చేసుకోబోతున్నట్లు శ్రీకాంత్ సంధ్య వాళ్లతో చెప్తాడు గీతను మూర్తికిచ్చి పెళ్లి చేయమని సలహా ఇస్తాడు శ్రీకాంత్ మధు నుంచి సంధ్యకు వచ్చిన ఉత్తరం గీత చదువుతుంది. ఇష్టం లేకపోయినా గీత భవిష్యత్ కోసం శ్రీకాంత్‌ను పెళ్లి చేసుకోను ఒప్పుకుంటుంది సంధ్య గీత, మూర్తి, సంధ్య, శ్రీకాంత్‌ల పెళ్లి జరిగిపోయింది మూర్తి భార్య పిచ్చి ఎక్కువయింది. ఆమె పిచ్చిలో తోయడం వల్ల మూర్తి తల్లి చనిపోయింది మూర్తి భార్యను ఆసుపత్రిలో చేర్పించాలనుకుంటారు మూర్తి, శ్రీకాంత్ మూర్తి, గీత శ్రీకాంత్ వాళ్లింటికి వచ్చారు ఎంత సర్దుకున్నా సంధ్య మనసు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు

అమ్మాయిగారూ' ఇయ్యాల ఎవరిమొకం సూశానో గాని ఎన్నడూ ఇనకూడని మాటన్నాను నన్నెన్నన్నా అనండి- బాబుగారు శ్రీరామచెంద్రుని వంటివోరు ఆయన కన్నెత్తి సూడరు- అయినా మాకు మీలా డబ్బులేకపోవచ్చుగాని- నీతి, నిజాయితీ వుంది- అమ్మాయిగారూ' బాగా ఇనండి- మిమ్మల్ని ఈ బాబు ఏం సూసి సేసుకున్నారోగాని- సీతమ్మవారిలాంటి తల్లి మా ఇంటి కొస్తుందని మేమంచరమూ అనుకున్నాం-

మంగి ఒక్క పరుగుతో కిచకి పారిపోయింది సంధ్య కూర్చున్నచోటనే శిలాప్రతిమలా కూర్చుండిపోయింది చ, ఎన్ని అవమానాలు- చివరకు మంగిచేత కూడా అవమానం పొందింది పాడు బ్రతుకయిపోయింది శ్రీరామచంద్రుడుట- శ్రీరామచంద్రుడు' ఆ పేరు నోటితో అనటానికి కూడా అర్హతలేనివాడు సంధ్య లేచి మంచంమీద కొచ్చి పడుకున్నది ఎంతసేపయిందో తెలియదు పొద్దుట నుంచి కాఫీకూడా తాగలేదు తల బద్దలయిపోతున్నది ఎప్పుడు నిద్రపట్టిందొ తెలియదు మధ్య మధ్యలో కింద నుంచి ఏవో మాటలు వినపడుతున్నయి సంధ్యకు అక్కడనుంచి లేవబుద్ధి కాలేదు కడుపులో ఆకలి మూలంగా తలనొప్పి ఎక్కువై పోయింది' దిక్కులేని దానిలా అట్లా ఎంతసేపు పడుకుందో తెలియదు కాని గదంతా చీకటి ఆవరించుకుంది కొంచెం కాఫీ అయినా తాగితే తప్ప ఈ తలనొప్పి తగ్గదనుకుని నెమ్మదిగా లేచి వంటింటి వైపు కొచ్చింది సంధ్య

* * * * *

మధ్యాహ్నం నుంచి తిరిగి తిరిగి శ్రీకాంత్‌కి అలసట వచ్చేసింది సాయంకాలం నాలుగు- నాలుగున్నరకి పార్కులోకి వచ్చి కూర్చున్నాడతను క్లబ్బుకి వెళ్ళ బుద్ధికాలేదు వెళ్ళినా ఏంచేస్తాడక్కడ' వాళ్ళేవో జోక్సు వేస్తారు' తనకి నవ్వురాదు' వాళ్ళు ఆటలు పట్టిస్తారు- తనకి విసుగు' అసలే క్లబ్బుకి రావటంలో ఉద్దేశ్యం కూడా తను పార్టనర్సుని కలుసుకోవటం కోసమే' తన కెందుకీ వ్యాపారాలన్నీ' ఆ క్షణంలో ఈ వ్యవహారాలన్నీ వదిలేసి దూరంగా పారిపోవాలనుందతనికి ఎంత చెప్పినా తల్లి వినలేదు భోజనం చేసిన వెంటనే తోటకు బయలుదేరింది ఒంటరిగా వుండలేనంటే మంగిని కూడా తనకు వెళ్ళింది ప్రస్తుతం ఇంట్లో సంధ్యకు సాయంచేసే వారెవరూ లేరు రాములమ్మ పురిటికి పోయింది ఎందుకో మంగి వెళ్ళేముందు వెక్కి వెక్కి ఏడ్చింది పాపం, అమాయకురాలు- ఎందుకంత బాధ పడిందో తెలియదు తన అవసరాలన్నీ సమయానికి అందుకుంటూ నీడలా తొబుట్టువులా మెలిగేది దానికి తనంటె ఎంత భయమో అంత ప్రేమ' మంగి లేకపోవటం తనకి కాళ్ళూ చేతులూ లేనట్టే' ఇంటికి వెళ్ళాలంటె ఏదో బెరుకు, భయం' తల్లి లేదు గీత, మూర్తి ఉన్నారు

మూర్తిని పది రోజులైనా ఇక్కడే వుంచేయాలనుకున్నాడు మాటా పలుకూ లేని ఈ పెళ్ళాంతో అతిధులను పెట్టుకుని ఎట్లా గడపాలో తెలియటం లేదు మంగి, తల్లి వుంటే సంధ్య తనతో జీవితాంతం మాట్లాడక పోయినా తను గడపగలిగే వాడే' ఈ రోజు- ఈ రోజేం జరిగింది తను కొత్తగా తీసుకున్న ఏజన్సీకి-ఎప్పుడో కాంట్రాక్టు రాసిన దానికి ఈ రోజు డబ్బు కట్ట వలసి వచ్చింది ఈ రోజు కట్టక పోతే పరువు పోవటం కాకుండా తను కాన్సిల్ చేసుకుంటే ఆ ఏజన్సీ తీసుకునే వాళ్ళు ఎందరో రెడీగా వున్నారు వ్యాపారంలో డబ్బు తిరుగుతూ వుండాలి' డబ్బంతా బెంగుళూరు పంపించాడు అక్కడి వ్యవహారాలన్నీ అస్తవ్యస్తంగా వున్నాయి ఎక్కడి పని అక్కడ ఆగి పోయింది అక్కడ డబ్బు వ్యవహారం తేల లేదు ఆ లెక్కలన్నీ మూర్తికే తెలుసు' అమ్మకు తెలిసింది అరవై వేలే' బ్యాంక్ లోంచి సంధ్య సంతకంతో యాభయి వేలు డ్రా చెయ్య బడినయి అవి ఎందుకు డ్రా చేసిందో, ఏం చేసిందో తెలియదు అడగాలంటే తనకి అభిమానం అడ్డు వస్తున్నది నిజానికి తనకిదొక లెక్కలోది కాదు చాలా కాలంగా ఎస్టేటు వ్యవహారాలన్నీ సరయిన ఎకౌంట్సు లేక అస్తవ్యస్తంగా వున్నయి ఆ ఎకౌంట్సు సరయే వరకు అక్కడ నుంచి డబ్బు కదల కూడదు'

ఇంతలో ఈ అవాంతరం' యాభయి వేలు ఏంచేసింది? ఎక్కడ దాచింది? ఎట్లాగైనా తనకా డబ్బు కావాలి' ఎట్లా? శ్రీకాంత్ తప్పు దన్నట్లు అసహనంగా

లేచి ఇంటి వైపుగా కారు నడిపించాడు. శరీరమంతా ముక్కలవుతున్నట్టు ఒకటే బాధగా వుంది. తల మీద ఎవరో సుత్తితో కొడుతున్నట్టే వుంది. కారు గారేజ్‌లో పెట్టి లోపలకు అడుగు పెట్టిన శ్రీకాంత్ ఆశ్చర్య పోయాడు. గుమ్మంలో వాచ్ మన్ నిలబడే వున్నాడు కాని, ఇంట్లో ఎక్కడా దీపాలు వెలగటం లేదు. నెమ్మదిగా హాలు దాటి పైకి వెళ్ళబోతూ పక్కకి తిరిగి చూశాడు. హాలు వైపుకి వీపు పెట్టి గుమ్మానికి రెండు వైపులా చేతులు పెట్టి నిలబడి వుంది సంధ్య! ఆ మసక వెలుతురులో దీపం లేకుండా ఆ గదిలోకి ఏం చూస్తున్నది! ఆ గదిలో అంత నిలబెట్టి చూపించ గల విచిత్రం ఏమున్నదో తెలియ లేదతనికి!

నెమ్మదిగా సంధ్య వెనకాల వెళ్ళి నిల్చున్నాడతను! క్షణకాలం శ్రీకాంత్ కొయ్యబారి పోయాడు. అంతలోనే తెప్పరిల్లి సంధ్య భుజాల మీదుగా రెండు చేతులతో నెమ్మదిగా తలుపులు దగ్గరగా లాగి సంధ్య చెయ్యి పట్టుకుని ఇవతలకు లాగాడు! సంధ్య ఉలికి పాటుతో వెను దిరిగి చూసింది!

క్షణం సేపు ఇద్దరి కళ్ళూ కలుసు కున్నయి! శ్రీకాంత్ చేతిలో సంధ్య చెయ్యి అలాగే వుంది. సంధ్య బెదురు తున్న కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు శ్రీకాంత్-

"సంధ్యా! అట్లా వున్నావేం?" దాదాపు రహస్యం చెప్తున్నట్లే అన్నాడు.

సంధ్య మాట్లాడ లేదు. మూర్తి కౌగిలిలో పరవశంతో లోకం మర్చి పోయినట్లున్న గీత,, గీత సన్నిధిలో సమాధి స్థితిలో వున్న మూర్తి - ఆ ఇద్దరి రూపాలే మె కళ్ళ ముందు మెదులు తున్నయి.

"సంధ్యా!" ఆమె భుజం మీద చెయ్యి వేస్తూ తిరిగి పిలిచాడు శ్రీకాంత్.

అప్పటికి గాని ఈ లోకంలోకి రాలేదు సంధ్య.

అతను దాదాపు సంధ్యను నడిపించుకుని కారు దగ్గరకు తీసు కెళ్ళాడు. సరాసరి హోటల్‌కి తీసుకుని వెళ్ళాడు. ముందు కాఫీకి ఆర్డరిచ్చాడు.

తల వొంచు కునే కాఫీ తాగింది సంధ్య. భోజనాలు కూడా మౌనంగానే ముగిసినయి. సంధ్య వంచిన తల ఎత్త లేదు. శ్రీకాంత్ వైపు చూడాలంటేనే ఆమెకు తల కొట్టేసి నట్టున్నది. సిగ్గు లేక పోతే సరి! మరీ అంత మై మరుపా తలుపులన్నా వేసుకోకుండా - కాదు-కాదు-తలుపులు వేసే వున్నయి- తనే తోసింది! పరాయి యింట్లో వున్నా మన్న జ్ఞానం కూడా లేకుండా ఎంత అసభ్య ప్రవర్తన! సంధ్య మనసు ఎదురు తిరిగింది! వాళ్ళేం కాని పని చేశారు. వాళ్ళిద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరున్నారు. అవును, తన కప్పుడు గుర్తొస్తున్నది! గీత కళ్ళ నుండి ధారలుగా కన్నీరు కారు తున్నది. అతని గుండెల్లో తల దాచుకుని ఎందుకో ఏడుస్తున్నది!

అతను ఆమె భుజం చుట్టూ చెయ్యి వేసి ధైర్యం ఇస్తున్నట్టుగా దగ్గరకు తీసు కున్నాడు. తను తలుపులు నెట్టింది! వాళ్ళకు తెలియ లేదు.

శ్రీకాంత్ తలుపులు వేశాడు- అదీ తెలియ లేదు. మధ్యలో తన కెందుకు బాధ!కానీ, తన కెందుకో బాగాలేదు వాళ్ళిందు కంత సన్నిహితంగా వుండాలి! మూర్తి ఎంత దుర్మార్గుడు కాక పోతే రాధని మర్చి పోతాడు.

రాధను తీసికెళ్ళి పిచ్చాసుపత్రిలో పడేసి తను హాయిగా పెళ్ళాంతో సుఖంగా వున్నాడు. ఇది చాలా అన్యాయం! ఆ క్షణంలో గీత తన చెల్లెలన్న మాట కూడా మర్చి పోయింది సంధ్య! ఇంటి దగ్గర కారు ఆగటం ఆలస్యం డోర్ తెరుచుకుని తన గదిలోకి పరుగు పెట్టింది. శ్రీకాంత్ కారియర్ తీసుకుని లోపలకు వచ్చే సరికి గీత, మూర్తి సోఫాలో కూర్చుని వున్నారు.

శ్రీకాంత్‌ని చూసి మూర్తి లేచి ఎదురొచ్చి కారియర్ అందుకున్నాడు.

"మీకు చాలా శ్రమ ఇచ్చాం - అయినా గీత వంట చేసింది." మూర్తి అభిమానంగా అన్నాడు.

"మాకేం శ్రమ లేదు కాని- మీరిద్దరూ భోజనం చెయ్యండి - అంటూ గీత వైపు తిరిగి "గీతా, లే - పొద్దుపోయింది. భోజనం చెయ్యండి" అన్నాడు. వాళ్ళు కదలకపోవటంతో తిరిగి హెచ్చరించి డైనింగ్ టేబుల్ ముందు కుర్చీ లాక్కుని తనూ అక్కడే కూర్చున్నాడు. గీత తప్పదన్నట్టు లేచి తనకి, మూర్తికి వడ్డించింది. శ్రీకాంత్ సరదాగా కబుర్లు చెప్తూ ఫ్రిజ్‌లోంచి యాపిల్స్ తీసి ముక్కలు చెయ్యసాగాడు. వాళ్ళ భోజనాలు పూర్తయేసరికి వాతావరణంలో వున్న గాంభీర్యం పోయి అందరూ సరదాగా నవ్వుతూ మాట్లాడుకోసాగారు. యాపిల్ ముక్కలు తింటూ గీత సందేహంగా అడిగింది -"బావగారూ! అక్కలో నాకు మార్పు కనపడటం లేదు. ఎన్నాళ్ళిలా! కనీసం, నాతో కూడా హాయిగా మనసు విప్పి మాట్లాడదు. నాకు మా అక్క గురించి కాదు కాని మిమ్మల్ని చూస్తుంటేనే బాధగా వుంది -"గీత కళ్ళల్లో నీళ్ళు నిలిచినయి.

"నాకేం, నేను బాగానే వున్నాను - కుమిలిపోతున్నది మీ అక్కే! నేను నిస్సహాయుణ్ని! నేను చెయ్యగలిగింది కూడా ఏమీ లేదు. విధి బలీయం! అనుభవించాలి"

గీత టేబుల్ మీద తల ఆన్చి దుఃఖాన్ని మింగటానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నది.

"సాయంత్రం నుంచ ఏడుస్తూనే వున్నావు - కళ్ళు చూడు ఎలా వాచి పోయినయ్యో -" మూర్తి బలవంతంగా గీతను లేవదీస్తూ అన్నాడు. ఆ సాయంత్రం తను చూసిన దృశ్యం కళ్ళ ముందు మెదిలింది శ్రీకాంత్‌కి. అవును - గీత ఎందుకో బాధ పడుతున్నది. ఎందుకో మరి!

"గీతా! నువ్వెళ్ళి పడుకో - నేను మూర్తితో మాట్లాడాలి!" హాలు వైపు నడుస్తూ అన్నాడు శ్రీకాంత్. గీత తమ పడక గదిలోకి నడిచింది. అక్క దగ్గర దుఃఖోపశమనం పొందటానికి వచ్చింది తను! ఏ ఆప్యాయతా, ఆత్మీయతా లేని చోట తను ఏమాశించి వచ్చిందో తనకే తెలియదు. ఏమైనా ఈ నరకంలో తనుండలేదు. శ్రీకాంత్ తల్లి సుభద్రమ్మగారు ఎంత మంచిది! పాపం, ఆవిడ కూడా ఇక్కడ వుండలేక వెళ్ళిపోయింది. ఈ నిశ్శబ్దం తను భరించలేదు! మేడ మీదెక్కడో వుంటుంది సంధ్య! కిందకు రాదు! మాట్లాడదు. రోజూ అయితే



# రాగసంధ్య

సుబ్రహ్మణ్యంగారు వంట చేసేది కాబట్టి, పైన శ్రీకాంత్ వున్నాడు కాబట్టి ఏదో నడవక పోతుందా అనుకున్నది కాని మౌనం స్వైరవిహారం చేసే ఈ బంగారు మేడలో తనుండ లేదు! తను బెంగుళూరు మాత్రం వెళ్ళగలదా! అక్కడ మాత్రం వుండగలదా! అక్కడ పిచ్చాసుపత్రిలో పిచ్చివాళ్ళ మధ్య వున్నట్టుండాలి. అది మరీ భయంకరం! బెంగుళూరు వెళ్ళి ఇల్లు సర్దించి, సామాను తెప్పించి రాధను తీసుకెళ్ళాలనుకుంటున్నాడు మూర్తి ఇప్పుడే చిగురించిన తన జీవన లత ఎండి మోడైపోతుంది కాబోలు! జీవితంలో ఈ అగ్నిని తను కోరి కొంగులో మూట కట్టుకున్నది పెళ్ళికి ముందు తనెన్ని ఆదర్శాలు పెట్టుకుంది అత్తగారి కనుసన్నలలో మెదులుతూ, రాధను కంటికి రెప్పలా కాపాడుతూ, మూర్తి జీవితంలో వసంతాలు పూయించాలనుకుంది! అడుగులోనే హంసపాదులా అత్తగారు మరణించింది మూర్తి తన నుంచి దూరంగా పారిపోయాడు రాధ తనని చూస్తేనే పిచ్చి ప్రకోపించేది ఈ రోజు తను ఉండటానికి నిలువ నీడ లేకుండా పోయింది! తను ఈ పెళ్ళి ద్వారా సాధించుకున్నదేమిటి? అంతులేని నిరాశా నిస్పృహలు! జీవితంలో భయంకరమైన ఓటమి! ఆ ఇల్లన్నా వుండి వుంటే తను అక్కడ తల దాచుకునేది! ఎప్పటికైనా మంచిరోజులు వస్తే మూర్తితో తను కలిసి జీవించేది! లేకపోతే ఎప్పుడైనా అతను వస్తుంటే – అదే తనకు పది వేలుగా భావించేది కాని, ఇదేమిటి? ఈ ఇంట్లో ఈ రకంగా వుండవలసి వస్తే మాత్రం ఇంతకంటే నరకం వుండబోదు! ఈ రోజు పొద్దునే సామానంతా పాక్ చేసి బెంగుళూరు పంపించేశారు తనకి ఇల్లు తప్పదు! ఇంతలో మూర్తి రావటంతో గీత ఆలోచనలు పక్కకునెట్టి అతని దగ్గరకు వెళ్ళింది

గీతా! రేపు నీ కొక విశేషం చెప్తాను అంటూ గీతను దగ్గరకు లాక్కున్నాడతను తాత్కాలికంగా గీత తన ఆవేదనంతా మర్చిపోయి మూర్తి అనురాగంలో లీనమైపోయింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రోజులా కాకుండా ఆ రోజు అలారం పెట్టుకుని మరీ త్వరగా నిద్ర లేచింది సంధ్య తెల తెలవారుతుండగానే కిందకు వచ్చింది అప్పటికే గీత లేచి కాఫీ చేసే ప్రయత్నంలో వుంది సంధ్య ముఖం కడుక్కునే సరికి గీత కాఫీ తయారు చేసింది సంధ్యకు కాఫీ గ్లాసు అందిస్తుంటే ఎంతో తృప్తిగా వుంది గీతకు వాళ్ళిద్దరూ చాలా రోజుల తర్వాత, పూర్వంలా కలిసి వున్నప్పటి అనుభూతి పొందుతూ వంట ప్రయత్నంలో పడ్డారు మధ్య మధ్యలో సంధ్యను నవ్విస్తూ గీత చాలా కలుపుగోలుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ సంధ్యకు ఎక్కువ పని కల్పించకుండానే వంట పని పూర్తి చేసింది మధ్యలో మూర్తికి కాఫీ కలిపి ఇచ్చింది శ్రీకాంత్ కోసం కాఫీ పైకి సంధ్యతోనే పంపింది సంధ్య కాఫీ తీసుకు వెళ్ళేసరికి శ్రీకాంత్ సోఫాలో కూర్చుని పేపరు చూస్తున్నాడు సంధ్య కాఫీ తీసుకెళ్ళి టీపాయ్ మీద పెట్టింది పేపరు చూస్తూ యథాలాపంగా అందుకున్న శ్రీకాంత్‌కి సంధ్య కాఫీ తీసుకు రావటం ఆశ్చర్యాన్ని కలిగించింది

ఓ, నువ్వు తీసుకొచ్చావా! అన్నట్టు మనిషి లేడు కదా! సారీ సంధ్యా! కిందకు వచ్చేవాడ్ని – మర్చిపోయాను! నొచ్చుకుంటూ తీసుకున్నాడు

నేను ఇవ్వాళ నుంచి డ్యూటీలో చేరదామనుకుంటున్నాను లీవ్ క్యాన్సిల్ చేసుకుంటున్నాను– ఈ మాటలు చెప్పాలని సంధ్య విశ్వప్రయత్నం చేసింది కాని చెప్పలేకపోయింది అతను కాఫీ త్రాగటం పూర్తయింది

కూర్చో! అతని గొంతులో మార్దవానికి సంధ్య హృదయంలో ఎక్కడో సన్నటి శ్రుతి పలికింది

అంటే ఇంతసేపూ తను అతని ఎదురుగా నిల్చునే వున్నది కాబోలు! ఆ మరి తనలో మానసిక స్వచ్ఛతేకాక శారీరక స్వచ్ఛత కూడా ప్రవేశించిందన్న మాట మళ్ళీ ఏదో గుండెల్లోంచి మెల్లగా ప్రవాహం జారుతున్నట్టనిపించింది ఈ

## అన్యాపదేశం

ఆకర్షకంగా ఉండవచ్చు
ఆహ్లాద భరితమూ కావచ్చు
అన్యాపదేశం
నిశితంగా పరిశీలిస్తే
మనసులోని అక్కసునంతా
పంచదార పాకంతో రంగరించి
మాయ మాటల్లో ప్రదర్శించటం
అన్యాపదేశం!

—చల్లా రాధాకృష్ణ శర్మ

# రాగసంధ్య

మధ్య ఎందుకో అతని దగ్గర ఒంటరిగా వున్నప్పుడు అతనేదైనా ఇట్లా మాట్లాడినప్పుడు తనకు అటువంటి అనుభూతే కలుగుతున్నది. ఎందుకని? ఎందువల్ల?

"సంధ్యా! నిన్న అమ్మ తోటలో బంగళాలో ఉంటానని వెళ్ళింది. నువ్వు మా పొలాలూ, తోటలూ, బంగళా చూడలేదు కదూ! అక్కడ అన్ని సౌకర్యాలూ అమ్మకి సరిగా అమరినయ్యో లేవోనని చూడాలని వెళ్తున్నాను. నువ్వు కూడా రా! అక్కడ చాలా హాయిగా వుంటుంది. చక్కటి ఆశ్రమ వాతావరణం! వస్తావా!" అతని గొంతు మరీ మృదువుగా అనునయంగా మధురంగా వుంది. సంధ్య అక్కడ నిలబడలేకపోయింది. తనకేదో జరిగింది! తనలో ఏదో అంతర్యుద్ధం జరుగుతున్నది. చకచకా కిందకు పారిపోయింది. భోజనాల సమయంలో శ్రీకాంత్ అన్నాడు.

"మూర్తీ! టిక్కెట్లు రెడీగా వున్నయి! మీరు ప్రయాణానికి సిద్ధంకండి! మిమ్మల్ని ఎయిర్‌పోర్టులో దింపి నేను వెళ్తాను".

కూర కలుపుకోబోతున్న గీత 'ఎక్కడ?' కన్నట్లు కళ్ళెత్తి చూసింది. సంధ్య కూడా తలెత్తి చూసింది. శ్రీకాంత్ తననే దీక్షగా చూస్తున్నాడు.

మూర్తీ, గీతా ఒక పదిరోజులు అట్లా తిరిగి వస్తారు!' సంధ్యకు చెప్తున్నట్లుగానే ఆమె కళ్ళలోకి చూస్తూ చెప్పాడు శ్రీకాంత్

నా కెందుకన్నట్లుగానే సంధ్య పెరుగు వేసుకోకుండానే లేచిపోయింది

ఆ వెళ్ళటం సరాసరి తన గది కెళ్ళింది తెల్ల కాగితం తీసుకుని గబగబా వ్రాయసాగింది

మధూ – నా రాజా!

నా కెందుకీ శిక్ష విధించావు నిష్కల్మషంగా నిన్ను ప్రేమించటమే నా అపరాధమా! నీ కష్టాలూ, బాధలూ నావిగా పంచుకుందామనుకున్నాను రమణి పెళ్ళి చెయ్యలేమని భయపడి నా జీవితాన్ని నరకంలోకి తోశావు నేను ఇతనితో కలిసి జీవించలేను నా వల్లకాదు ఆవేశంలో నేనేదో ప్రతీకారం తీర్చుకోవాలని పగబట్టి ఈ పెళ్ళికి ఒప్పుకున్నాను కాని, మధూ, నాకు ప్రతీకారమూ లేదు, పగా లేదు– ఇతన్ని చూస్తూ ఇతని ఎదురుగుండా గోళ్ళు గిల్లుకుంటూ ఈ గదిలో ఈ మూల ఒంటరిగా ఎన్నాళ్ళీ జీవితం! ఎన్ని ఏళ్ళు గడిస్తే ఈ జీవితానికి మంగళం పాడగలుగుతాను వద్దు మధూ, వద్దు– నన్ను తీసుకుపో – నీ ఎదురుగా నిన్ను చూస్తూ ఎన్ని యుగాలైనా గడపగలను నువ్వు మాధవిని కాదు– లక్ష మంది మాధవిల్ని పెళ్ళి చేసుకో ఏమైనా చేసుకో– కాని, నాకు నీ సమక్షం కావాలి నీ ఎదురుగా నేనుండాలి మధూ, నన్ను తీసుకెళ్ళవూ! ఈ వియోగం నేను భరించలేను నువ్వూ మాధవీ అన్యోన్యంగా ఆనందంగా వుండటానికి నే నడ్డుపడతానని భయమా! మీ జోలికిరాను రోజూ నిన్ను చూడగలిగితే చాలు నీ దగ్గరున్నానన్న తృప్తి చాలు నాకు నీవేమి అన్నంపెట్టి పోషించనక్కరలేదు నాకు తిండి కూడా వద్దు నన్ను తీసికెళ్ళు మధూ! ఒక్క క్షణంకూడా ఇక్కడ వుండలేను– ఇకపైన వ్రాయలేక పేపరు పక్కనపడేసి దిండులో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది సంధ్య

ఎంతో సేపు హృదయభారం తీరేవరకూ ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోయిన సంధ్య తెప్పరిల్లి లేచి కూర్చుంది. ఆమె పక్కనే ఆమె వ్రాసిన ఉత్తరం మడిచి కవరులో పెట్టి అడ్రసు వ్రాయబడివుంది.

సంధ్య గుండెలు వేగంగా కొట్టుకున్నయి. దూరంగా సోఫాలో శ్రీకాంత్ బూట్ తొడుక్కుంటున్నాడు. తెల్లని ప్యాంట్ మీద ఇటుకరాయి రంగు ఫుల్‌షర్టు వేసుకుని ప్రశాంతంగా నెమ్మదిగా తన పనిలో లీనమయిపోతున్న అతన్ని రెప్పపాటు లేకుండా చూడసాగింది సంధ్య. ఆమెకెందుకో వీపులోంచి సన్నగా వణుకు లాంటిది వచ్చింది. ఇతను .... ఇతను తను వ్రాసిన ఉత్తరం చదివాడా! చదివితే అంత ప్రశాంతంగా వుండటం సాధ్యమవుతుందా! అతను తన పని పూర్తయినట్లున్నది– బయలుదేర బోతున్నాడు. గుమ్మందాటబోతూ వెను దిరిగి చూచాడు.

సంధ్యవైపు నిశితంగా చూసి ఏదో చెప్పబోతున్న అతని మీదకు సంధ్య పూనకం వచ్చిన దానిలా ఒక ఊపులో వచ్చింది. చేతిలో ఉత్తరం వుంచిన కవరు ముక్కలుగా చించిపారేసింది.

"మనుషులన్న తర్వాత బుద్ధుండాలి! ఎంత అనాగరకులైనా పరాయివాళ్ళ ఉత్తరాలు చూడటానికి సాహసించరు–" నిప్పులు కురిపిస్తున్న సంధ్య కళ్ళను ప్రసన్నంగా చూస్తూ అన్నాడతను.

"నిన్ను పెళ్ళి చేసుకున్ననాడే నాకు బుద్ధి లేకుండా పోయింది. అప్పటికి నా బుద్ధి ఇంకా వికసించ లేదు. నువ్వు నాకు పరాయి దానివి కావు. కాబట్టి నువ్వంటున్న ఈ రెండూ నాకు వర్తించవు!"

అతని పెదవుల మీద చిరునవ్వు సంధ్యకు అగ్నికి ఆజ్యం పోసినట్లయింది.

"సిగ్గులేకపోతే సరి!"

"ఎవరికి? నీకా, నాకా! నా భార్య శ్రీమతి సంధ్యాదేవి మాధవిగారి భర్తగారైన శ్రీ మధుసూదనరావుగారికి ప్రేమలేఖ వ్రాసినందుకు నేను మరి సిగ్గుపడద్దూ–"

సంధ్య పిడికళ్ళు బిగుసుకున్నయి. పళ్ళ బిగువుకు పెదవులు నలగసాగినయి.

"సంధ్యా! గుర్తుంచుకో! నీ ఉత్తరం చదివేస్థితిలో మధులేడు. అతను నిన్నెప్పుడో మర్చిపోయాడు. మాధవి ఉత్తమురాలు. అమాయకమైన పతిభక్తిని నెరపి మధును ప్రసన్నుడ్ని చేసుకుంది. మధు దృష్టిలో నువ్వొక పరిచితురాలివి మాత్రమే! పైగా అతని ప్రాణ స్నేహితుడి భార్యవి! నీకా గౌరవస్థానం ఎప్పుడూ వుంటుంది నా భార్యగా శ్రీకాంత్ మాటలు పూర్తి కాలేదు

భార్య భార్య, భార్య! నే నెవరి భార్యనూ కాదు నీకూ నాకూ ఈ బంధం ఈనాటితో సరి– భార్యట, భార్య సంధ్య ఆవేశంగా మెడలో మాంగల్యాలు బలవంతంగా ఒక్క ఊపులో బయటకు లాగింది కళ్ళు పెద్దవి చేసుకు చూస్తున్న శ్రీకాంత్ ఒడుపుగా మెరుపులా లాఘవంగా సంధ్య రెండు చేతులు గట్టిగా పట్టుకున్నాడు ఆ ఊపుకి సంధ్య మెడ గీరుకుపోయి రక్తం చిమ్మసాగింది అతని చేతులలో బిగుసుకుపోతున్న తన చేతుల్ని బలంగా పెనుగులాడుతూ అతన్ని మోచేతులతో గుండెలమీద పొడవసాగింది ఆమె రెండు చేతుల్నీ బలంగా పట్టుకుని చాలాసేపు అతను ఎదుర్కొన్నాడు

సంధ్య శరీరంలో శక్తంతా శ్రీకాంత్ లాగేసుకున్నాడా అన్నట్లు ఆమె నిస్సహాయంగా నిర్జీవంగా అతని చేతుల్లో బందీ అయిపోయింది

సంధ్యను సున్నితంగా దగ్గరకు తీసుకుని మృదువుగా ఆమె నుదుటిమీద చుంబించి పసిపాప వలె జాగ్రత్తగా మంచం మీద పడుకో బెట్టాడు ఆమె ఆవేశం తగ్గలేదనటానికి నిదర్శనంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీవ్రంగా వున్నయి శ్రీకాంత్ చెదిరిన ఆమె ముంగురులను సవరిస్తూ సంధ్యా! ఆ ప్రయత్నం మాత్రం చెయ్యకు! ఏ ఆడపిల్లా అంత సాహసానికి ఒడిగట్టదు! నేను నీకు అడ్డంగా వుంటే నీకు దూరంగా వెళ్ళిపోతాను నీకు కనబడను కూడా! నువ్వాపని చేసేకంటే నాకింత విషం ఇస్తే నాకు చాలా ఆనందం! ఈ రకంగా నన్ను అవమానించాలనుకోకు– శ్రీకాంత్ వెళ్ళిన వైపు చూస్తూ దిగులుగా కూర్చుండి పోయింది సంధ్య ఆమె కిప్పుడు ఏడుపుకూడా రావటం లేదు వస్తే బాగుండునని వుంది

(ఇంకా ఉంది)

## కె. వి. వి. ఎస్. ఎమ్. భద్రాచలం.

మీరెప్పుడూ నన్నుచూసి దడుసుకుంటారు ఫోటో పంపను అంటారు, ఎందుకని? ఈ మధ్య మీ రీసెంట్ ఫోటో గ్రాఫ్ చూశాను బాగానే వున్నారు ఇండియాలో సగానికిపైగా దరిదాపు ఆ పర్సనాలిటీలో నే వున్నారు మీ కీ విషయం తెలుసుగా!

★ తెలియకేం? మీరా మాటన్నాక కాస్త ధైర్యంగా వుంది' కాని నేను ఫోటో లు పంపను– నేనేం సినిమా స్టారునా?

## యు. ఎల్. ఆర్. అయ్యగార్లపల్లె.

రామలక్ష్మిగారూ, మీకు ఆడపిల్లలు ఎక్కువ అని విన్నాను

★ కాదు ఎక్కువేమిటి? కన్నవాళ్ళు ముగ్గురు, అభిమాన పుత్రి ఒకతె ఇక అసంఖ్యాకంగా ఉన్నారు 'గాడ్‌ఛిల్డ్రన్' అని చెప్పుకోతగ్గ అమ్మాయిలు నాకు ఆడపిల్లలంటే యిష్టం

## కె. వి. ఎల్. దర్శి.

రామలక్ష్మిగారూ, భూమిలో అంపమైనది ఏమిటి?

★ 'నేను' అన్నమాట

మనిషికి తృప్తి అనేది ఎప్పుడు కల్గుతుంది?

★ అది కల్గేనాటికి బ్రతికి వుండడు'

పత్రిక రాగానే నేను మొదట చదివేది ప్రశ్నావళి

★ నమ్మాలనే వుంది చిట్టితల్లీ

## షి. ఎస్. ఆర్. ఎమ్. గుంటూరు.

విలన్‌లేని నవల వుండ దెందుకు?

★ చెడు లేకుండా – మంచి ఘనత ఎలా తెలుస్తుంది?

## బి. వి. ఆర్. రాయగడ.

జీవితంలో మరపురాని తీయని అనుభవం ఏది?

★ ఎప్పటి కప్పుడు అనుభవాలు కొత్తగానూ, తీయగానూ వుంటాయి కనుకనే– మనుషులు బ్రతక్కలుగు తున్నారు

## జి. ఎన్. ఆర్. సాలూర్.

నేనెవరితో స్నేహం చేసినా తగువుతో ముందు తరువాత ఆప్తమిత్రులుగా మారుతారు అమ్మాయిల విషయంలో – స్నేహం చేశాక తగవు వచ్చే సూచనలు

★ చక్కగా సినిమా సన్నివేశాలు జీవితాలకి అన్వయించుకుంటూ బ్రతికేస్తున్నారు? మీకు నేనేం చెప్పగలను?

## ఎస్. ఎస్. ఆర్. నిడమానూరు.

ప్రపంచంలో అందరికి అర్ధమయే భాష ఏది?

★ పసి పిల్లల చిరునవ్వు




## పి. ఐ. ఆర్. మహబూబ్‌నగరు.

నేను, ఒకమ్మాయి మనస్ఫూర్తిగా ప్రేమించు-కొన్నాం కొన్నాళ్ల తరువాత పెళ్ళికూడా చేసు-కోవాలను కొన్నాం మా సంగతి అందరికీ తెలిసిపోయాక – నా ముఖం ముందే నేనెవరో తెలియదంది

★ ఏం? మీ పెద్దలని కట్నరాయబారం పంప-లేదు కద?'

## పి. వి. డి. సాలూరు.

మేం అడిగిన ప్రశ్నలకు మీరు సింపుల్‌గా సూటిగా చక్కగా సమాధానా లిస్తున్నారు మీరు జవాబులు యివ్వడానికి–ఎవరి సహాయం అయినా అడుగు-తారా?

★ ఏమిటి? యీ సింపుల్ సూటి సమాధానాలకె ఎవర్నైనా సహాయం అడగాలా?'

## పి. జి. కె. పి. బల్లిగూడ.

ఆటలు, డబ్బుకై దిగజారునది ఆడది అని ఫ్రెండు అంటే–అసలు బలమైన లలన అబల అని నేనన్నాను మీరేమంటారు?

★ బల్లిగూడా పెద్ద వూరై వుండదు–మీ ఇద్దరూ కలిసి– తల్లో పారేసుకున్న స్క్రూలు ఎక్కడేనా కన బడతాయేమో వెదుక్కోండి ముందు''

## డి. ఆర్. ఆర్. ఇచ్ఛాపురం.

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను కాని ఆమెకు నేనంటే కోపం, ఎలా?

★ ఏ చిరంజీవో, సుమనో, శోభనో ఏద్తైనా సినిమాలో మార్గం చూపెట్టే వుంటారే అనుస-రించండి తెలుక్కుర్రాళ్లకి ప్రేమ పాఠాలు నేర్పేవి సినిమాలేకద'

## ఎమ్. బి. ఆర్. భిలాయి.

దేశంలో ఎన్నికలు, వివిధ పార్టీలు ఫిరాయింపులు, కొత్త పార్టీ స్థాపనలు, మత కలహాలు, ఆ కలహాల మృత దేహాలు ఉండగా– అటు వరదలు భీభత్సాలు కరువు పీడిత ప్రాంతాలు నిరుద్యోగ సమస్యలు మరీ పెరిగి పోతున్నాయి ప్రస్తుతం – ఈ నా, నీ, మీ మా మన దేశ పరిస్థితి పై మీ అభిప్రాయం?

★ కలికాలం– అని సద్ది చెప్పుకుంటున్నా'

## సంధ్య. భువనేశ్వర్.

మారేజెస్ ఆర్ మేడిన్ హెవెన్'

★ కాని లివ్‌జ్ ఇన్ హెల్'?

## ఎ. ఎన్. ఏ. అలంపూర్.

ఒకరి కోసం నేనాగినా– నా కోసం కాలం ఆగుతుందా?

★ ఎంత కాలం ఆగాలేంటి ఆ ఒకరి కోసం'' □

# హైదరాబాద్ నోట్‌బుక్

## శ్రీ రామారావు విజయం .-

మరొకమారు హైదరాబాద్ నోట్‌బుక్ చెప్పిన జోస్యం ఫలించింది తెలుగుదేశం పార్టీకి విధానసభ ఎన్నికలలో 180 స్థానాలకు పైగానే వస్తాయని రెండు నెలల కిందే చెప్పిన మాట నిజమయింది మా పార్టీకి వోట్లు వేయకపోతే మా రక్తంతో హోలీ చేసుకుంటామని వోటర్లను బెదిరించిన వారి రోషారుణ ముఖాలు వెలవెలబోయాయి ఇక పరలోకం పార్టీ అని వెక్కిరించిన వారి ముఖాలు నల్లబడ్డాయి మిత్రపక్షాలతో కలుపుకుంటే నాల్గింట మూడు వంతులకు పైగా మెజారిటీ వచ్చింది తెలుగుదేశం పార్టీకి మిత్రపక్షాల పరిస్థితి కూడ ముందు కన్నా మెరుగయింది ఈ విజయంతో తెలుగుదేశం పార్టీ పట్ల ప్రజల విశ్వాసం సడల లేదని నిరూపితమయింది ప్రజాస్వామ్య తెలుగు దేశం పక్షానికి 124 స్థానాలు వస్తాయని: అది ఇతర వర్గాలతో కలిసి ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందని అంచనాలు వేసిన రాజకీయ పండిత ప్రభువులు తెల్లబోయారు కాంగ్రెస్ పరిస్థితి ముందుకన్నా దిగజారింది రాయలసీమ విమోచన సమితిని కూడా ప్రజలు నమ్మలేదు తెలుగుదేశం విజయానికి కారణం శ్రీ రామారావు పలుకుబడి మాత్రమే కాక ఇదివరకే హైదరాబాద్ నోట్‌బుక్ అన్నట్టు ఆయన అమలు పరచిన రెండు రూపాయల కిలో బియ్యం జనతా వస్త్రాలు రైతులకు పెన్షన్ మున్నగునవి కాంగ్రెస్ (ఐ) నాదెండ్ల వర్గంతో కుమ్మక్కయి ఎన్ టి ఆర్‌ను పడగొట్టడానికి చేసిన కుట్ర ప్రజల మనస్సు నుంచి తొలగిపోకపోవడమూ కారణం కావచ్చు గ్రామాధి కారుల వ్యవస్థను రద్దు చేయడం వల్ల కలిగిన నష్టమేమీ లేదనీ మరొకమారు రుజువయింది రాష్ట్రాలలోను కేంద్రంలోను ఒకే పార్టీ వుంటేనే శ్రేయస్కరమనే శ్రీ రాజీవ్‌గాంధీ సిద్ధాంతం ఆంధ్ర కర్నాటక ప్రజలకు నచ్చినట్టు లేదు ఈ విజయంతో తెలుగుదేశం పార్టీ బాధ్యత గురుతరమయింది పెద్దపెద్ద ప్రాజెక్టులు సమగ్ర రాష్ట్ర ప్రగతికి అవసరమే అవి సుదూరఫలాలు ప్రజలు సద్యఃఫలం కోరుతారు అలాటి వాటిలో ముఖ్యమైనవి కూడు గుడ్డ, గూడు అలాంటప్పుడు

రెండు రూపాయల కిలో బియ్యం పథకం జనతా వస్త్రాల పథకం జనాన్ని ఆకర్షించడం సహజం ఈ రెండూ మరింత కట్టుదిట్టంగా అమలుపరచాలి ముఖ్యంలో భాగమే నీళ్ళు గ్రామాలలో నీటి వసతి మరీ తక్కువ కొన్ని ప్రాంతాలలో మైళ్ళ దూరం నుంచి నీళ్ళు తెచ్చుకోవాలి నా చిన్నతనంలో బిందెలు కట్టుకొని తుంగభద్ర నుంచి పెద్ద పెద్ద హండాలలో నీళ్ళు తెస్తున్న దృశ్యాలు నేడూ

రాష్ట్రంలో మూడుమూల ప్రాంతాలలో కనిపిస్తాయి నీటివసతి వుంటే పారిశుద్ధ్యం కూడ వుంటుంది పారిశుద్ధ్యం రోగ నిరోధానికి తొలిమెట్టు ఇక ఇళ్ల సంగతి చూస్తే మరీ ఘోరం పల్లెటూళ్లలో ఊరికంతా ఒక మేడ దాని చుట్టూ పాకలు గుడిసెలు నేటికీ దయనీయ దృశ్యాలు పట్టణాలు నగరాలలోను మురికివాడల పరిస్థితి ఇదే కనుక రెండు గదుల నివాస స్థలాలున్న పలు అంతస్థుల భవనాలు మద్రాసు ప్రభుత్వంలాగ మురికివాడల లోను, గ్రామాలలోను కట్టిస్తే తెలుగుదేశం



ప్రభుత్వం పునాది మరింత బలపడుతుంది ఈ మూడు తర్వాత చదువు నేటి విద్యావిధానం గుమాస్తాగిరీ విద్యావిధానమని ప్రతివారూ విమర్శించేవారే గాని సరైన ప్రత్యామ్నాయం సూచించిన వారు లేరు ఈ నాటి విద్యావిధానంలో లోపాలు వుండవచ్చు గాని విమర్శిస్తున్న వారు చెబుతున్నంత అధ్వాన్నమేమీ కాదు ఆధునిక విజ్ఞాన ప్రగతికి అనుగుణంగా ప్రజల బుద్ధి వికసించడానికి చిన్ననాడి నుంచే మూలబంధం

పడాలి గదా! కనుక నేటి విద్యావిధానంలో పాఠ్యక్రమం సహేతుకమయిందే మారవలసింది మన దృక్పథం ఇంత పెట్టుబడి చదువు పెట్టాము ఇంతకు నూరింతలో వేయింతలో సంపాదించాలి అనే దృక్పథం పోవాలి పూర్వం ఏవో వృత్తులు వారికి వుండేవి గనుక చదువు జ్ఞానం కోసమనే భావముండేది ఇప్పుడు వృత్తులు మారాయి గనుక చదువు వృత్తి కోసం సంపాదన కోసమనే భావం ప్రబలింది అందువల్ల వృత్తి చదువులకు కులమతాది వివక్ష లేక అవకాశం కలిగించాలి సంస్కరించవలసిన మరొక ముఖ్యమయిన విషయం రవాణా బస్సులలో రోజూ లక్షల మంది పయనం సాగిస్తుంటారు ఆయిన

రవాణాశాఖకు నష్టమంటే ఎక్కడో లోపం వుంది మనరాష్ట్రం రవాణా వ్యవస్థ ఏమీ బాగాలేదు దానిని సరిగా నిర్వహిస్తే ఎన్నో సమస్యలు పరిష్కారమవుతాయి రవాణా బస్సులు చెత్త లారీల కన్నా అధ్వాన్నంగా వుంటున్నాయి సీట్లు వుండవు. వుంటే మేకులు గుచ్చుకుంటాయి కిటికీలకు తలుపులుండవు వుంటే పగిలి వుంటాయి నిర్ణీత స్థలాలలో ఆగవు స్టాండింగు ప్యాసెంజర్లు పట్టుకోడానికి ఇనప కమ్మీలుండవు ఫుట్‌బోర్డు పాసింజర్లను అదుపు పెట్టే పద్ధతిలేదు ఆడవాళ్ళ సీట్లో కూర్చున్న మగవారు ఆడవాళ్ళు నిలబడి బాధపడుతున్నా లేవరు తక్కిన రాష్ట్రాలు – ముఖ్యంగా తమిళనాడులో రవాణా వ్యవస్థ బాగుండడానికి, మన రాష్ట్రంలో బాగుపడకపోవడానికి కారణమేమిటి? కనుక ఈ వ్యవస్థను చక్కజేయాలి. సామాన్య ప్రజలు అల్ప సంతోషులు

ఏ కొద్ది మంచి చేసినా మహా గొప్పగా పొగుడుతారు కనుక తెలుగుదేశం ప్రభుత్వం ఈ చిన్నపనులు చేస్తే తన ప్రభుత్వం పునాదిని గట్టి పరచుకుంటుంది. ఇక దీర్ఘకాల ప్రయోజనాలను గురించి ఆలోచించడం వుండనే వుంది వాటి ఉపాంగాలు గానే చిన్న ప్రయోజనాలు చిన్నప్రయోజనాలు చూపి ప్రజలను ఆకట్టుకోవాలని కౌటిల్యుడు కూడ చెప్పాడు.

## ఉపశ్రుతి : –

ఏమిసార్ ఎన్నికల ప్రచార సమయంలో చాలమంది పెద్దలు అంతగా నోరు పారేసుకున్నారే మరి ఇప్పుడేమంటారు? – అనడిగారు ఒక సామాన్య పౌరుడు అందువల్లనే అవివేకుల హృదయం నోట్లో వుంటుంది వివేకుల నోరు హృదయంలో వుంటుంది అని బెంజమిన్ ఫ్రాంక్లిన్ అన్నాడండీ గురూగారూ – అన్నాడొక శ్రోత

– తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna
Phones P B X 61247, 61248 & 75667

మీకుటుంబానికోసం
సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన
ఆహారం ఇప్పుడు
ఫ్యామిలీ ప్యాక్‌లో

# చాక్లెట్ రుచిగల కాంప్లాన్ ఇప్పుడు 1 కిలో ప్యాక్‌లో

**ఉచితం!**
ఆకర్షణీయమైన
స్టెయిన్‌లెస్ స్టీల్
గ్లాసు 1 కిలో ప్యాక్‌తో
బాటు తీసుకోండి






రెండు 500 గ్రాముల ప్యాక్‌ల బదులు, కొత్త 1 కిలో కాంప్లాన్ ప్యాక్ కొనండి, దాంతో రూ. 4 ఆదా చేసుకోండి. అంతేకాదు, దాంతోబాటు మీకు ఒక ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ గ్లాసు వస్తుంది—ఉచితంగా!

కేవలం **కాంప్లాన్** లోనే, కుటుంబంలో ప్రతివారికీ ప్రతిరోజూ అవసరమయ్యే కీలక ఆహారపదార్థాలు శాస్త్రీయంగా సరియైన పాళ్ళలో వున్నాయి— కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు, అత్యుత్తమమైన ప్రోటీన్లు, పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి.

మీ కుటుంబంలోని వారికి **కాంప్లాన్** యివ్వండి, రోజుకు రెండుసార్లు, ప్రతిరోజూ.





మంచి ఆరోగ్యానికి
మూలస్థానం
గ్లాక్సో

**కాంప్లాన్®**– సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GK&E.B85.GLC.11.Tg

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
22-28, March, '85

# ఆప్కో వస్త్రాల అలంకారం - మీ అందాలకు అహంకారం

అందం అందరికీ ఎలా సొంతమో అలాగే ఆప్కో చీరలు కూడా అందాలకు సొంతమే మరి. అందాలను స్వంతం చేసుకున్న ఆప్కో చీర కట్టుకుంటే చాలు అటివరకు లేని అహంకారంతో మీ అందం ద్విగుణీకృతమౌతుంది. ఆప్కో చీర ధరించడానికి అన్ని సందర్భాలూ. అన్ని క్షణాలూ అనువైనవే! బుట్ట బొమ్మలా చుట్టుకున్నా అలంకారమే! కుందనపు బొమ్మలా కుచ్చెళ్ళు పోసి ముచ్చట పడ్డా అలంకారమే! ఆప్కో అందాలకు స్వాగతం పలకండి!

**ఆప్కో చేనేతలు**




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హాండ్లూం వీవర్స్
కోఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్-500029

kiron/apco/84 g5